# ANCIENT GLORY.



BY

K. B. SUBBARAYUDU, B. A., B. Ed.

HINDI SAHITYA VISARADA,

Authour of 'NARI DHARMA'

# భారతదేశము,
# ప్రాచీనౌన్నత్యము.



ఇది

హిందీసాహిత్యవిశారదయు 'నారీధర్మ' గ్రంథకర్తయు నగు

## కె. బి. సుబ్బారాయుడు, బి. ఏ., బి. యిడి.,

చే రచియింపబడి ప్రకటింపబడియె.

మొందటికూర్పు 500 ప్రతులు


కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1934




[Price 1—0—0.



To

# THE SACRED MEMORY

of

My little beautiful child who, three years ago, had passed away from this world leaving me in great sorrow.

నాకన్నుల కానందచంద్రికయు, ప్రేమస్వరూపియు, చివరకు నన్ను దుఃఖసముద్రమున ముంచి దివి కేగినట్టియునగు నాముద్దుతనయుని యాత్మశాంతికొరకు—

ప్రేమసంస్మృతికొరకు—

# విజ్ఞప్తి.

---

పాఠశాలలందును, కళాశాలలందును పెట్టబడు చరిత్రగ్రంథములు యువకుల మనంబుల కలుషితమొనర్చుచు ప్రాచీనులయెడ ద్వేషమును పురికొల్పుచు దేశదౌర్భాగ్యమునకు తోడగుచున్నవి. గ్రంథములే కాక, చరిత్రోపాధ్యాయులు గూడ కొంతవర కీదౌర్భాగ్యమునకు కారణభూతు లగుదురనియే నావిశ్వాసము. పరిశోధనాసక్తి, సంస్కృత, ప్రాకృతభాషలలో వ్రాయబడిన మూలగ్రంథములను పఠింపగల్గు సామర్థ్యము, మూలగ్రంథములు కాకపోయినను, వాటి యనువాదములను పఠించి స్వతంత్రముగా చరిత్ర జ్ఞానమును సంపాదింపవలె ననుకోరికయు లేని యుపాధ్యాయులు దేశోపద్రవకారు లగుటలో నాశ్చర్యమేమున్నది ! భారతీయుల విజ్ఞానాశయములను స్మృతిపథమునకు దెచ్చువా రెంతయు ప్రశంసనీయులు. స్మృతియే జ్ఞానమని ప్లేటో మహాకవి నిర్వచించియున్నాడు. స్మృతిపథమునకు దెచ్చుట గూడ నొకవిధమగు దేశభక్తియనియే నా యభిప్రాయము.

నాకు సంస్కృత, ప్రాకృతభాషలతో పరిచయ మావంతయు లేకున్నను ఆంగ్ల, హిందీయనువాదములను, విశేష పాండిత్యముగల భారతీయులచే వ్రాయబడిన చరిత్రగ్రంథము లనేకింటిని పఠించి ...గ్రంథరచనకు పూనుకొంటిని. ఈగ్రంథమందు వ్యాకరణదోష ..., అచ్చుతప్పులు విశేషముగా కలవని నేనెఱుంగుదును. వాటి ...టిని ద్వితీయముద్రణమందు సవరించుకొందునని మనవిచేయుచు ...ను. చరిత్రాంశములం దసత్యము లేవైనను కన్పట్టినయెడల ...ఠకమహాశయులు వాటిని నాకెఱింగించినచో వారికి నే నెంతయు ...తజ్ఞుడను. ఈగ్రంథము చరిత్రవిద్యార్థులకు విశేషముగా నుపయో...చునని నానమ్మకము.

19-7-1934.

ఇట్లు విధేయుడు,
కె. బి. సుబ్బారాయుడు.

# OPINIONS.

---

M. R. Ry. Jayanti Ramayya Pantulu Garu, B. A., B. L., Retired Deputy Collector, President of the Andhra Historical Research Society, and President of the Andhra Sahitya Parishad writes :—

I have gone through the book 'భారతదేశము ప్రాచీనౌన్నత్యము' by Mr. K. B. Subbarayudu, B. A., B. Ed. It embodies much of the information contained in the Puranas, Smritis and modern historical books, on the political, economic and cultural condition of India in ancient times and Mr. Subbarayudu has done a patriotic duty by making this information available to the telugu public.

Mr. Subbarayudu is evidently interested in investigating the ancient history of this country and I wish him success.

**Muktiswaram**
**19-6-34.**

(Sd.) **J. RAMAYYA.**

---

M. R. Ry. RALLABANDI SUBBA RAO Garu, M. A., L. T.

Lecturer, Govt. Arts College, Rajahmundry, Writes :—

‘భారతదేశము—ప్రాచీనౌన్నత్యము’ అను తెనుగుగ్రంథము మాశిష్యుడగు కొంపెల్ల సుబ్బారాయుడుచే వ్రాయబడి, ప్రకటింపబడుట కడు ప్రశంసనీయము. గ్రంథము పదిభాగములుగ విభజింపబడినది. మొదటిభాగమున, ప్రాచీనకాలమున భారతీయులు సద్గుణసంపన్నులనియు, నాగరికులనియు, సహేతుకముగ చర్చింపబడినది. రెండవభాగమున, రాజుయొక్క ఆవశ్యకత, యోగ్యత, ధర్మములు మున్నగువిషయములును, దుష్ప్రవర్తనయొక్క నష్టములును ప్రాచీన గ్రంథముల సహాయమున సహేతుకముగ చూపబడినవి. మూడవ భాగమున పరిపాలనావిధానములు కొంతవిపులముగా మూలాధారములతో వర్ణింపబడినవి. ఇంకను ఎక్కువవిపులముగనుండినచో బాగుండెడిదని తోచును. నాల్గవభాగమున మంత్రులయొక్కయు, తదితర రాజకీయోద్యోగులయొక్కయు, రాజసభలయొక్కయు అధికారములను గురించి తెలుపబడినది ఈభాగము మిక్కిలి బోధకరముగానున్నది. అయిదవభాగమున న్యాయస్థానములు, న్యాయపరిపాలనావిధానములు, కులసంఘములు, దండనీతివిధానములు మొదలగునవి బహు చక్కగను,విపులముగను, సహేతుకముగను చర్చింపబడినవి. ఆరవభాగమున, స్థానికసంస్థలు, గ్రామపరిపాలనావిధానములును, ఏడవభాగమున వర్తకసంఘములు, విషయములును వర్ణింపబడినవి. ఎనిమిదవభాగమున ప్రాచీన విద్యాపీఠములు, వాటివిధానములు తెలుపబడినవి. చాలినంత వివరములు సహేతుకముగా నివ్వబడినవి. వేద

కాలము నాటియు, బౌద్ధయుగము నాటియు విశ్వవిద్యాలయ పరిస్థితులు నవీను లాచరింపదగినవి. తొమ్మిదవభాగమున ప్రాచీనకళలను గురించియు, పదియవభాగమున ప్రాచీనుల ధర్మ, జ్ఞానసంపత్తును గురించియు గ్రంథకర్త చక్కగవ్రాసి తన పరిశోధనాసక్తిని చక్కగ వెలిబుచ్చినాడు గ్రంథము మొత్తముమీద మిక్కిలి చక్కగా వ్రాయబడినది. భారతదేశముయొక్క ప్రాచీనౌన్నత్యము బాగుగ ఋజువు చేయబడినది. కొన్నిచిత్రపటములు, అకారాదిసూచికయుండిన గ్రంథమింక నెక్కువ ప్రశస్తిని బడయుగలదు పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయములు పుస్తకభాండాగారములు తప్పక నీగ్రంథమును స్వీకరించవలెను.

సర్కారుకళాశాల,
రాజమహేంద్రవరము.
20—6—1934.

(Sd) రాళ్ళబండి సుబ్బారావు.

# విషయసూచిక.

# భారతదేశము.
# ప్రాచీనౌన్నత్యము.



## మొదటిభాగము.



### I

ప్రాచీనభారతదేశ చరిత్రనుగూర్చి ముచ్చటించుట సంతోష జనకమే కాని బహుక్లిష్టమైనకార్యము. దానికి పలువురు పలువిధముల జెప్పుటే మొదటికారణము. రెండవది ప్రజలలో వ్యాపించిన మూఢత్వము, విద్యావిహీనతయని చెప్పకతప్పదు. మూడవది విదేశీయులు కొందరు మనవాఙ్మయమునంతను భాషాంతరీకరించిమన మతాచారములను, రాజకీయాభిప్రాయములను, సాంఘికాదిజీవితములను, విపరీతముగా గ్రహించి సత్యమును తలక్రిందుజేసి గ్రంథములువ్రాయుట. ఆగ్రంథముల నాధారముగా జేసికొని పెక్కుమంది మనభారతీయులు మనపూర్వులు చాలయనాగరికులనియు, విద్యావిహీనులనియు, నిత్యము మతవిచారణయందే మునిగి రాజ్యపరిపాలనా విధానము లేవియు తెలియనివారనియు తలపోయుట మనము ప్రతిదినము చూచుచున్నవిషయమే. అంతేకాక వారు మనభరతఖండ మేబదివత్సరములనుండియే ధనధాన్యసంపత్తుతో తులతూగెననియు, నంతకుపూర్వము ప్రజలందరు దరిద్రులై యేబురదయో త్రాగి జీవించుచుండిరనియు నభిప్రాయపడుటకూడ మనమెరుగుదుము. ప్రాచీనసంస్కృత ప్రాకృతగ్రంథములను విమర్శదృష్టితో పరిశోధించినను పలుతావులందు దొరకు శిలాశాసనములను తామ్రశాసనములను నాణెములను చదివిచూచినను, శిథిలములైన ప్రాచీనకోటలను, సౌధములను, ప్రాకారములను, స్థూ

పములను చూచినను, హంపి, పాటలీపుత్ర, మహేంజదారా, హరప్ప మొదలగు పట్టణములను పరీక్షించినను లేదా నరేంద్రనాథ్‌లా, జయస్వాల్, రాధాకుముద్ ముఖర్జి, రమేష్‌చంద్ర దత్తు మొదలగు సుప్రసిద్ధ చరిత్రకారుల యమూల్యగ్రంథములను చదివినను, మన వసుంధర పూర్వము సస్యవాటికలచే శోభాన్వితమై నేత్రపర్వ మొనరించుచుండెననియు, లక్ష్మి యిక్కడ తాండవ మాడుచుండెననియు, పూర్వులు గొప్ప మేధావంతులనియు, సత్యసంధులనియు, దయామయులనియు, పరిపాలనాధురంధరులనియు, స్వార్థత్యాగులనియు, ఆధ్యాత్మికవిద్యాసంపన్నులనియు మనకు తెలియగలదు.

ధనధాన్యములచే వర్ధిల్లెననుటకు విదేశీయుల దండయాత్రలే తార్కాణము. మన సారవంతమైనభూమి, మనబంగారుగనులు, మన పరిశ్రమలు, మనవర్తకవ్యాపారము విదేశీయులదృష్టి నాకర్షించినవన్నమాట సత్యము. ధనాకర్షణే విదేశస్థులను హిందూదేశములో నడుగుపెట్టి దేశమునంతను గొల్లకొట్టుటకు ప్రోత్సాహపరచెను. అట్టివారిలో మొదటివారు రోమనులు, గ్రీకులు. గ్రీకుచక్రవర్తియగు యలగ్జాండరు ససైన్యముగా యిండియాపై దండెత్తివచ్చుటకు కారణము కేవలము సామ్రాజ్యకాంక్షయే కాదు. ధనాశకూడ తోడయ్యెను. పారశీకచక్రవర్తియగు డరయస్సుకూడ సైన్యాధిపతులను పంపుటకు ధనాకర్షణే హేతువు. తరువాత అతని సామ్రాజ్యము కాన్‌స్టాంటినోపుల్ మొదలు సింధునదీ ప్రాంతమువరకు వ్యాపించినను సింధునదీ ప్రాంతమందుండు హిందువులే యెక్కువ కప్పము చెల్లించుచుండిరని మనకు తెలియ వచ్చుచున్నది. హిందువులచే చెల్లింపబడునది డరయస్సుకువచ్చు నాదాయములో మూడవవంతు. తరువాత సిథియనులు, సెరాసెనులు, ఆఫ్గనులు, మంగోలియనులు, పలుకష్టములు పడి పర్వతములన్నిటిని దాటి యిండియాకు వచ్చుటకు కారణము ధనసం

పాదనాసక్తియే. రానురాను గజనీమహమ్మదు, గోరీమహమ్మదు యిండియాపై దండెత్తి దేవాలయములను భూమట్టముగావించి, ప్రజలను భరింపరాని కష్టముల పాల్జేసి, సోమనాథ్ దేవాలయములోని బంగారమునంతను యధర్మముగా కొల్లగొట్టిరన్నమాట తెలిసినదేకదా! పోర్చుగీసువారు, డచ్చివారు, డేనులు, ఫ్రెంచివారు, క్రూసేడునకు పూర్వమెన్నడును హిందూదేశముపేరు వినకపోయినను క్రూసేడ్సమూలమున హిందూదేశము చాలా ధనవంతమయినదనియు, ధనమార్జించుట కవకాశమిచ్చుననియు తలంచియేకదా యిక్కడకువచ్చి వర్తకరూపమున ధనసంపాదన మొదలుపెట్టిరి. తరువాత మన యింగ్లీషు వారుకూడ వర్తకముపేరుతో ధనమును సంపాదించుటకై ఎలిజబెత్తు రాణీవద్దనుండి 1600 వ సంవత్సరమున చార్టరుపొందుట లోకవిదితము. వారన్ హేస్టింగ్సు కంపెనీనౌకరులు దేశమును కొల్లగొట్టి యెట్టినిందలు పాలయిరో ఎడ్మండు బర్కు (Edmund Burke) యొక్క యింపీచుమెంటు యుపన్యాసమే నిదర్శనము. విదేశస్థుల కీదురాశకల్గుటకు దేశములోని లక్ష్మియే హేతువగుచున్నది.

హిందువులు సత్యసంధులనియు అతిశుద్ధమైన, పరమపవిత్రమైన చరిత్రగలవారనియు, స్వార్థపరరహితులనియు పైని చెప్పియుంటిని. స్వదేశాభిమానముచే నట్లుచెప్పితినని తలంపరాదు. విదేశీయాత్రికుల యభిప్రాయములను తెలిసికొనుట సమంజసము. ఏడవశతాబ్దమునం దిండియాకువచ్చిన హుయాంగ్ త్సియాంగ్ యను చీనాయాత్రికు డిట్లు వ్రాయుచున్నాడు:—

"Though the Indians are of a light temperament, they are distinguished by the straightforwardness and honesty of their character. With regard to riches they never take any thing unjustly; with regard to justice they make even excessive concessions......straightforwardness is distinguishing feature of their administration."

...ందువులు ...త్యముగ నుండువారనియు, అధర్మముగా ధనమార్జించరనియు, పరిపాలనయందు కపటము లేనివారనియు చీనాయాత్రికుని సాక్ష్యము తెలుపుచున్నది. టేసియస్ యను యూనానివైద్యుడు (Present at the battle of Cunaxa 404 B. C) టేసియాప్రాగ్రంటాయను గ్రంథములో తాను పెర్షియా కోర్టులో విన్నదాని నాధారముగా హైందవ భారతీయులయొక్క ధర్మాచరణనుగూర్చి వ్రాసియున్నాడు. సెల్యూకస్ నికటార్ చే పాలిబోత్రా (పాటలీపుత్ర)లోనున్న సాంద్రకోటస్ (చంద్రగుప్త) వద్దకు రాయబారిగా పంపబడిన మెగాస్థనీసు తన గ్రంథములో హైందవులు సత్యమును ధర్మమును గౌరవించువారనియు ఆకాలములో దొంగతనము బహుఅరుదనియు వర్ణించియున్నాడు. రెండవశతాబ్దపు ఏరియన్ (pupil of Epictutus) ఆకాలపు ఓవర్ సీర్లనుగూర్చి వ్రాయుచు వారెప్పుడు తప్పురిపోర్టుచేయరనియు, హిందువు లెట్టిపరిస్థితులలోను యూడితప్పనివారనియు వివరించినాడు. పదునొకండవ శతాబ్దమునాటి ఇడ్రిసీ (Idrisi) యను మహమ్మదీయ గ్రంథకర్త తన భూగోళశాస్త్రమునందు "The Indians are naturally inclined to justice and never depart from it in their actions. Their good faith, honesty and fidelity to their engagements are well known." అని వ్రాసియున్నాడు. భారతదేశస్థులు న్యాయదృష్టిగలవారనియు, సత్యపథమునే ద్రొక్కువారనియు, వారిసహజసరళస్వభావమే విదేశీయుల నాకర్షించెననియు యతనియభిప్రాయము. పదమూడవ శతాబ్దమునాటి మార్కోపోలో బ్రాహ్మణులను (Abrahman) గూర్చి వ్రాయుచు వర్తకము వారి సహజవృత్తి కాకపోయినను రాజుచే నియోగింపబడి వ్యాపారము సాగించెడివారనియు జీవితములో నొకసారియైన యనృతవాక్యము పలికెరగరనియు చెప్పియున్నాడు. పదునాల్గవ శతాబ్దములోని ఫ్రయర్

జోర్డానస్‌కూడ యిట్టి యభిప్రాయమునే ప్రకటించెను. అక్బరుచక్రవర్తియొక్క మంత్రిపుంగవుడయిన అబుల్‌ఫజల్ తన అయిన్‌అక్బరీ యనుగ్రంథములో యిట్లు వ్రాయుచున్నాడు.

"The Hindus are religious, aflable, cheerful, lovers of justice, given to refinement, able in business, admirers of truth grateful ard of unbounded fidelity."

బిషప్‌హీబరు, ఎల్ఫిన్‌స్టన్, సర్: జాన్ మాల్కమ్, సర్: తామస్‌మన్రో మొదలగువారు పాశ్చాత్యులైనను హిందువుల గుణవిశేషములను తగురీతిని చిత్రింపసాగిరి. భారతీయులు ధైర్యవంతులనియు, గౌరవనీయులనియు, జ్ఞానసంపాదనాసక్తి గలవారనియు, కష్టపడి పనిచేయువారనియు, ఆడితప్పనివారనియు, తలితండ్రులయెడ పెద్దలయెడ వినయముజూపువారనియు వారి యభిప్రాయము. వారన్ హేస్టింగ్సు యిట్లు చెప్పినాడు.

"They are gentle and benevolent, more susceptible of gratitude for kindness shown them, and less prompted to vengence, for wrongs inflicted than any people on the face of the earth; faithful, affectionate, submissive to legal authority."

ప్రొఫెసరు మాక్సుముల్లర్ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ భవనమున తన యుపన్యాసమం దిట్లు చెప్పియుండెను.

I feel bound to say that, with hardly one exception, they have displayed a far greater respect for truth, and a far more manly and generous spirit than we are accustomed to even in Europe and America.

ఇట్లు విదేశీయుల యభిప్రాయముల నొకటివెంబడి యొకటి వ్రాయుట చదువరులకు విసుగుకలిగించునన్నమాట నిజము. కాని భారతీయులు పూర్వము దెట్టిగౌరవ ప్రతిపత్తులు గలిగియుండిరో

తెలియజేయుటకుగాను యత్నిపని నిర్వహించితిని. గ్రంథవిస్తరభీతిచే వారివారి యభిప్రాయములను పూర్తిగా వివరించనేలేదు.

II

మన ప్రాచీనభారతీయుల మతస్థాపన, మేధాసంపద, పాండిత్య పటిమనుగూర్చి ముచ్చటించుటకూడ యప్రస్తుతమని యనదగదు. ఏయేపండితులు, కవిశిరోమణులు, మతబోధకులు ఎప్పుడెప్పుడు జన్మించి దేశకళ్యాణమునకు తోడ్పడిరో తెలియుటముఖ్యము. వేదములు, యుపనిషత్తులు, స్మృతులు, పురాణములు సామాన్యభాషాపరిచయముగల మానవులచే నిర్మింపబడలేదని మనవిశ్వాసము. హిందూమతమునకు మూలము చతుర్వేదములుగదా! శ్రీకృష్ణభగవానుని గీతోపదేశము (భగవద్గీత) ప్రస్థానత్రయమం దొకటిగను బురుషార్థమును బడయుటకు బూర్ణయోగ సాధనముగను బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమని పిలువబడుచు హిందూధర్మగ్రంథసారమై వెలయుచున్నదిగదా! ఈయుత్తమ గ్రంథరాజముపై శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులు, వారిశిష్యులు, బ్రహ్మసమాజ బోధకులగు సీతానాథ తత్వభూషణ, అరవిందఘోషు, అశ్వినీకుమారదత్తు, బిపిన చంద్రపాలు, దివ్యజ్ఞాన సమాజమునకు జెందిన ఏనీబిసెంటు, ఆర్యసమాజనాయకులగు లాలాలజపతిరాయి సనాతన ధర్మవాదులగు బాలగంగాధరతిలకు, మహాత్మాగాంధి, పాశ్చాత్యులలో ఎడ్విన్ ఆర్నాల్డు, యిత్యాది మహాపురుషు లనేకులు వ్యాఖ్యానములు రచించి లోకప్రఖ్యాతిని బడయుట నిస్సంశయము. అద్వైత మతస్థాపకుడగు శంకరాచార్యుని గీతాభాష్యము హిందువుల హృదయంబుల నాకర్షించుచున్నది. విద్యారణ్యులు వేదాంత దేశికాచార్యులు, మధుసూదన సరస్వతి మున్నగువారు శంకర పక్షపాతులై వాని గీతాభాష్యమును

దేశమందంతట వ్యాప్తినొందించిరి. ఆధ్యాత్మిక భావనిరూపణమందు భగవద్గీతను మించిన గ్రంథ మే వాఙ్మయమందును గన్పట్టదని పాశ్చాత్య తత్వశాస్త్రజ్ఞులగు షాంబోర్లు, ఎమర్సన్, థిరో, పాల్ డ్యూసన్, ష్లిగెల్ మొదలగువారు యభిప్రాయపడుచుండినట్లు మన మెరుగుదుము. రామాయణ భారతాది గ్రంథములు మునీశ్వరులచే రచించిరి. వారికవిత ధారావాహినిగాను, హృదయాకర్షముగాను యుండునని సంస్కృతభాషాజ్ఞాను లెల్లరు చెప్పుదురు సర్వమానవధర్మములను యితిహాసపూర్వముగా ప్రకటించిరన్న సంగతి సత్యము. రానురాను గౌతమ బుద్ధునియొక్కయు, మహావీరునియొక్కయు మతములు నలుదిక్కుల వ్యాపించి, ప్రజలమనస్సులను ద్రిప్పి మనస్సుచేతను, వాక్కుచేతను, కర్మచేతను అహింస తప్పరాదనియు, అదియే స్వర్గారోహణ సోపానమనియు చాటినవి. పాలీ, సౌరాష్ట్రి, మాగధీభాషలలో వ్రాయబడిన గ్రంథములు వారిమతములను జనసామాన్యమునకు బోధపరచుచున్నవి. బౌద్ధమతము త్రిపీటకములమీదను, జాతకములమీదను యాధారపడి యున్నది. మౌర్యచంద్రగుప్తుని మంత్రిశేఖరుడైన చాణక్యుని (కౌటిల్య) అర్థశాస్త్రము హిందువుల రాజనీతిజ్ఞానము, పరిపాలనాచతురతను వేనోళ్ళచాటుచున్నది. నాగార్జునుడు, అశ్వఘోషుడు, వసుమిత్రుడు, కనిష్కునికాలములోనివారు. అశ్వఘోషుడు గొప్పపండితుడు, కవీశ్వరుడు, సంగీతవిద్యాపారీణుడు. హిందూ వైద్యశాస్త్రకర్తయగు చరకుడుకూడ కనిష్కచక్రవర్తి కాలములోనివాడే.

నాల్గవశతాబ్దమునాటి విక్రమాదిత్యుని యాస్థానమందు నవరత్నములను పండితులుండిరనియు, అందులో కాళిదాసు దండిమొదలగు పండితశిరోమణులు వారివారి కవితాచాతుర్యమును జూపుచుండెడివారని యనుటకు చరిత్రయే సాక్ష్యము. కాళిదాసుయొక్క నాటకములు, కావ్యములు సంస్కృతభాషాప్రపంచకములో వన్నె

కెక్కెనుగదా ! అతనికవిత్వము యమృతస్రవంతిగా నిరాఘాటముగా ప్రవహించుచుండెననుటలో సందేహ మిసుమంతయు లేదు. అందుచే తనే యతనికి కవిసార్వభౌముడని బిరుదువచ్చెను. మొదట పాశ్చాత్య దేశస్థులు కాళిదాసుయొక్కయు, తదితరులయొక్కయు సంస్కృతగ్రంథములను పఠించి హిందువులు యడవిజాతివారనియు వారువ్రాయునది విషయశూన్యమనియు తలచుట మన మెరుగుదుము. రానురాను సర్: విలియమ్ జోన్సు (England) హెర్డర్, గెతె (Germany) మొదలగువారు సంస్కృతభాషనభ్యసించి యందులోనమూల్యగ్రంథములు వ్రాయబడినవని చెప్పినప్పుడు పాశ్చాత్యుల మూఢవిశ్వాస మంతరించిపోయినది. అలెగ్జాండర్ వాన్ హాంబోల్టు తన కాస్మాస్ గ్రంథమున కాళిదాసుకవిచంద్రునిగూర్చి యిట్లుపలికెను.

" The great contemporary of Virgil, and Horace, in the court of Vikramaditya."

విక్రమాదిత్యునికాలమందే అమరనిఘంటువు నిర్మించిన అమరసింహుడును, వ్యాకరణకర్తయగు వరరుచియు, జ్యోతిషగ్రంథకర్తయగు వరాహమిహిరుడును జీవించియుండిరి. ఆర్యభట్టుడు, బ్రహ్మగుప్తుడుకూడ అప్పటివారే. మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, వాయుపురాణముకూడ వ్రాయబడినవి. కవిత్వమేగాక సంగీతము, శిల్పము, చిత్రలేఖనము కూడ యున్నతస్థితికి వచ్చెనని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఏడవశతాబ్దమందు హర్షచక్రవర్తి సంస్కృతమందు విశేషజ్ఞానముపొంది ప్రియంవద, రత్నావళి, నాగానంద యను నాటకములు రచించి గొప్పపేరువడసెను. కాదంబరి, హర్షచరిత్రాది గ్రంథములు రచించిన బాణుడు, హర్షచక్రవర్తియొక్క యాస్థానకవి.

ఎనిమిదవశతాబ్దమందు కుమారిలయను బ్రాహ్మణమతబోధకుడు ప్రజలలో వ్యాపించిన మూఢత్వమునునశింపజేసి వేదములలో జెప్పబడిన కర్మకాండనంతను నాచరించునట్లుజేసెను. హిందూమతోద్ధారకుడును, అద్వైతమతస్థాపకుడునునైన శంకరాచార్యులు తొమ్మిదవశతాబ్దములోనివాడు. కనూజ్ రాజైన యశోవర్మన్ యొక్కయు తరువాత లలితాదిత్యునియొక్కయు (A D 750) ఆస్థానకవియగు భవభూతి, పద్మగుప్తుడు (A. D. 950); నైషధగ్రంథకర్తయు జయచంద్రుని యాస్థానకవియు నగు శ్రీహర్షుడు (A. D 1150); పాలా సభలోనున్న భట్టనారాయణుడు (A. D. 850); కనూజ్ సభలోనున్న రాజశేఖరుడు (A. D. 900); జయదేవుడు (A. D. 1100); పండ్రెండవశతాబ్దమందుండిన కాశ్మీరకవులయిన సోమదేవుడు, క్షేమేంద్రుడు, బిల్హణుడు, రాజతరంగిణి కర్తయగు కల్హణుడు మొదలగువారు పండితలోకము నలంకరించియుండిరి. ఈశతాబ్దమందే పాషండమతమునుస్థాపించిన బసవ; రామానుజ, మాధ్వ, పూర్ణప్రజ్ఞ మొదలగువారు తమతమనూతనాశయములతో ప్రజలలో నుద్బోధముగావించిరి. అనంతరము విజయనగరసామ్రాజ్యము యఖండవైభవముతో ప్రకాశించుకాలమున సాయినాచార్యుడు, వేదాంతదేశికాచార్యులు యుద్భవించిరి. పిమ్మట ఉత్తరహిందూస్థానములో రామానందులవారవతరించిరి. ఆయనశిష్యుడగు కబీరుదాసు హిందువులచేతను, మహమ్మదీయులచేతను గౌరవింపబడుచుండెడివాడు. పదమూడవశతాబ్దములో నాజిర్‌షా మహాభారతమును బంగాళాభాషలోనికితర్జుమాచేయ నాజ్ఞాపించెను. హుస్సేన్‌షా చే నియోగింపబడి మాలాధరదాసు భాగవతపురాణమును భాషాంతరీకరించెను. కీర్తివాసుడు రామాయణమును బంగాళాభాషలోనికిమార్చెను. ఈకాలములోనే మైథిలీ భాషలో విద్యాపతి ఠాకూరు, చండీదాసు, మీరావారులో మీరాబా

యి వైష్ణవసంబంధమగు గీతలను పాడుచు ప్రజలను తన్మయులగావించుచుండిరి. వల్లభాచార్యులు, నూతనవైష్ణవమతబోధకుడైన శ్రీచైతన్యుడును యీకాలములోనివారే యని చరిత్ర చెప్పుచున్నది.

దామర్లేను దండయాత్రకాలమునకైనను హిందువుల బుద్ధిచాతుర్యము నశించలేదు కుల్లూకభట్టుడు మనుస్మృత్యాదిగ్రంథముల మీద వ్యాఖ్యానముల్వ్రాయుచు లోకప్రఖ్యాతిపొందిన దయాభాగను ప్రకటించెను. విజ్ఞేశ్వరుడు మితాక్షరగ్రంథమునురచించి వన్నెకెక్కెను గదా! మహమ్మదీయులు ఘోరదారుణమైన యొత్తిడిగల్గించుచున్నను మధ్వాచార్య, విజ్ఞేశ్వరభట్ట, చండేశ్వర, కమలాకర మొదలగు వారు భారతీయుల సాంఘికాచారములను గ్రంథరూపమున వర్ణింప మొదలిడిరి మొగలాయీలకాలమునను హిందువులు విజ్ఞానవంతులై యుండిరనుటకు పెక్కునిదర్శనములు గలవు. ఫ్రేజర్ తన Literary History of India అను గ్రంథములో యిట్లువ్రాసి యుండెను.

Brahminism remained with its undving vitality of intellectual iife to continue its own course nnmoved. The glorious reign of Akbar had seen an outbreak of nature genius that in its own lines, rivals that seen in England in Elizabethan times.

సూర్దాసు, తులసీదాసు అక్బరుచక్రవర్తి కాలములోనివారు. సూర్దాసు గ్రుడ్డివాడయ్యు మహాభక్తుడు. వాని భక్తిపూరితమగు గ్రంథములు యిప్పటికిని హిందీనభ్యసించువారు చదువుచుండుట మనముజూచుచున్నాము. అతనివలెనే కృష్ణదాసను మరియొకకవీశ్వరుడు కలడు. తులసీదాసు రామాయణమందు వేదములయొక్కయు, నుపనిషత్తులయొక్కయు, పురాణములయొక్కయు మూలసూత్రములన్నియు కానవచ్చుచున్నవి. గొప్పగొప్పపండితులకుకూడ ఆరామాయణమందలిపదములకు అర్థముచెప్ప సాహసములేదని నొక్కి వక్కా

ణింపగలము జహాంగీరు చక్రవర్తి రాజ్యము చేయునప్పుడు తులసీదాసు మతమును అజ్మీరునందును, రాజపుత్రస్థానమందును దాసుయొక్క శిష్యులు వ్యాపింపజేసిరి.

1469 లో నానక్ జన్మించి సిక్కుమతము స్థాపించెను. సిక్కుమతమునకు మూలగ్రంథము ఆదిగ్రంథమైయున్నది. సిక్కుల పంచమ గురువైన అర్జునుడు జాట్ ప్రజలను సిక్కుమతములో జేర్చుచు మొగల్ చక్రవర్తులకు భయోత్పాతము కలిగించెను అర్జునుడు పట్టుబడి చిత్రవధగావింపబడెను. తరువాత హరిగోవిందు, తెగ్ బహాదుర్ మొదల గుగురువులు బయలుదేరి మతసంరక్షణకై యుద్ధములు జేయుటకూడ మతసిద్ధాంతములలో నొకటియని బోధింపసాగిరి. దుర్గనుపూజింప మొదలిడిరి.

తరువాత మహారాష్ట్రచరిత్ర చదివిచూచిన శివాజీయొక్క గురువు రామదాసని తెలియుచున్నది. ఇతడొక సన్యాసి. మహారాష్ట్రజాతీయపతాకము సన్యాసి ధరించువస్త్రముల రంగునే కలిగియుండును. తుకారామ్ కూడ యిప్పటివాడే. ఇతడు శూద్రుడు. శూద్రుడైనను గొప్ప విద్యనభ్యసించి ప్రజలకు అధ్యాత్మిక విషయములను బోధించుచు మహారాష్ట్రులనందరను నిద్రనుండి మేల్కొనునట్లు చేసెను. శ్రీకృష్ణుడే దేవుడనియు, అతనియందు విశ్వాసముంచుటే మోక్షసాధనమనియు ప్రబోధగావించెను.

కాబట్టి భారతీయులు పూర్వము అనాగరికులుగారనియు, విద్యాహీనులుగారనియు తేటపడుచున్నది.

## రెండవ భాగము.

ధరణి నేలుటకు రాజావశ్యకమని పూర్వులెట్లు గ్రహించిరో అట్టి రాజాస్థానమలంకరించుట కెట్టి యోగ్యతలు కలిగియుండవలెనో ప్రాచీనకాలమందలి భూపతులెట్టి ధర్మసూత్రములపై నాధారపడి రాజ్యభారమువహించిరో తెలిసికొనుట మనముఖ్యకర్తవ్యము. పండిత విద్యాలంకారు మూాడేండ్లక్రిందట ఒక Vedic Magazineలో మొదట ప్రజలు రాజులేమిచే యొకరినొకరు హింసించుకొనుచు, నీతి నియమములు లేక పలుకష్టములకు గురియై బహు అనాగరికులైయుండిరనియు, రానురాను, కొన్నికుటుంబములక్రిందను, తరువాత పెద్ద పెద్ద తెగలక్రిందను యేర్పడిరనియు తుదకాదేశమునంతను బాలించు నధిపతి యుండవలెనని గ్రహించి పరిపాలకునొకని నియమించుకొనుచుండిరనియు వ్రాసియున్నాడు. అధర్వణవేదమందీవిషయమే చెప్పబడినదనికూడ నిరూపించినాడు. ఇందలి సత్యాసత్యములు విమర్శించుట బహు క్లిష్టమైనపనియనియు, మనబుద్ధివిశేషమునకు, మనసమర్థతకు అతీతమనియు నాయభిప్రాయము. కాని రాజశబ్దము రామాయణకాలమునకు పూర్వమే పుట్టియుండవలెను. రఘు, దిలీప, అజ, దశరథ మొదలగు మహారాజులెందరో భూభారమువహించి సర్వజనసమ్మతముగ రాజ్యపాలనము చేసిరనుటకు ప్రాచీనగ్రంథములే తార్కాణము. అప్పటికే రాజులేని రాష్ట్రము విధ్వంసమగుననియు, హింసాది కృత్యములకు తావొసంగునని గ్రహించిరన్నమాట సత్యము. బృహస్పతి వసుమనువను మానవేంద్రునితో యిట్లుచెప్పెనని భీష్ముడు ధర్మరాజుతో మహాభారతములో చెప్పియున్నాడు.

తే. లోకములు లోకధర్మంబులును నృపాల
రాజమూాలముల్ రాజవిరహితమైన

పుడమిజనులకు నింకిన మడువులోని
జలచరంబులు వడుపాటు నందవిల్లు.

క. తరణిశశాంకుల తేజ
స్స్ఫురణము లేకున్న యట్లు భూజనములు ని
ర్భరదురితత జెడ్డపుదురు
నరపాలక విహితపాలనము లేకున్నన్.

తే. విభుడు లేకున్న జనులు నదయహృదయు
లగుచు హాహానినాదంబు లడరదల్ల
డిల్లుదురు రాజు లేమియు నెల్లవారు
లేమికల్మియు కల్మిదుర్లేపరహిత.

రాజు లేని రాష్ట్రమందు ప్రజలు నీరు లేని మడువుయందుండు చేపలవలె పలుకష్టములకు లోనగుదురనియు, దరిద్రము పలురూపములు దాల్చుననియు, ప్రజలలో హాహాకారములు బయలుదేరుననియు యాగములు భోగములు త్యాగములు మొదలగు ధర్మములకు భిన్నము కలుగుననియు బృహస్పతి యభిప్రాయము. ఇందలి సత్యమును గ్రహించియే వసిష్ఠమహర్షి, దశరథుడు మృతినొందినప్పుడు రామలక్ష్మణులు యడవియందు దిరుగాడుచుండుటయు, భరతశత్రుఘ్నులు కేకయరాజుకడనుండుటయు గాంచి, భరతుడువచ్చులోపున యున్నతాసన మధిష్ఠించి రాజ్యతంత్రములను నడపెను. మార్కండేయుడు మౌద్గల్యుడు మొదలగుపండితులును, మంత్రులును, తదితరప్రజలును రాజ్య మరాజకమగుచున్నదనుభయముచే వసిష్ఠునితో యిక్ష్వాకువంశమందు జన్మించినవాని నొకనిని రాజుగా చేయుమని ప్రార్థించిరి. దీనినిబట్టి ప్రాచీనులు అరాజకస్థితిని సహించెడివారుకారనియు, దేశమున కది నష్టము వాటిల్లజేయుననియు గ్రహించినట్లు తేటమగుచున్నది.

రాజపదవిపొందుటకెట్టి యధికారములుండవలె నన్నవిషయము చర్చింపదగినది. వారసత్వముకన్న ఎన్నికసూత్రమే ఎక్కువగా గౌరవింపబడుచుండెనని జయస్వాలు హిందుపోలిటి (Hindu Polity) యను గ్రంథమునందు వివరించియున్నాడు. రాజ్యపాలనముచేయుటకు తగుసమర్థుడే రాజుగా నియమింపబడవలెనని పూర్వులయభిప్రాయము. రాజవంశమందు జన్మించినంతమాత్రమున భూభారమువహింపజాలడు. ఈయంశమునే కౌటిల్యుడు తనఅర్థశాస్త్రమందు విశదీకరించియున్నాడు.

నచైకపుత్రమవినీతం రాజ్యేస్థాపయేత్.

... ... ... ...

కులస్యవా భవేద్రాజ్యం కులసంఘోహిదుర్జయః
అరాజవ్యసనాబాధః శశ్వదావశతిక్షితమ్.

రాజసమర్థుడగునపుడు కులమనుసంఘము అతనిస్థానే ప్రజానురంజకముగ రాజ్యవ్యవహారములను చక్కపెట్టవలెనని కౌటిల్యుని యుద్దేశ్యమైయున్నది.

ప్రజలప్రతినిధులు సమితియనుసంఘముగా నేర్పడెడివారు. వీరికే రాజునెన్నుకొను యధికారముగలదట. కొంతకాలమైనతరువాత యీసమితి జనపదసంఘముగా మారెను. ఈజనపదసంఘము దేశసంఘమనికూడ పిలువబడుచుండెడిది. ఈసంఘముయొక్క అధిపతికి జనపదమహత్తార (Lord High President) లేక రాష్ట్రముఖ్యయను బిరుదునామములుగలవు. భూపాలుని పదభ్రష్టునిజేయుటకును, పిమ్మట మరియొకనినా పదవలంకరించునట్లు చేయుటకును, రాజుయొక్క జ్యేష్ఠపుత్రుని యువరాజుగా జేయుటకునుగూడ యీసంఘమున కధికారముగలదు. దేశమంతకును సంబంధించెడి వ్యవహారములను నడుపు యధికారముగూడ యీసంఘమువారికైయుండెను.

దశరథమహారాజు ముద్దుబిడ్డయగు శ్రీరామునికి యువరాజపట్టాభిషేకము చేయవలెనని పౌరజానపద సంఘములు ఏకగ్రీవముగా తీర్మానించుకొనిరి.

అభిషేచనీయానంతరముననగాని రాజనామము వర్తించకూడదను నియమముకూడ గలదు. ఇంద్రుని, రుద్రుని, మిత్రుని, వరుణుని అగ్నిదేవుని, తదితర దేవతలను నారాధించవలెను. ఆదేవతల యనుగ్రహమూలమున పరిపాలనాశక్తి, పశురక్షణశక్తి, ధర్మరక్షణశక్తి మొదలగు శక్తులన్నియు ప్రాప్తించునని వారియొక్క నమ్మకము. పట్టాభిషేకమహోత్సవమందు తనవలన యేవిధమైన బాధకలిగిన తాను తనవంశము నశించునని ప్రమాణముజేయవలెనని కూడ గలదు. రాజైనను, మహారాజైనను, సార్వభౌముడైనను యిట్టిప్రమాణమునే గైకొనవలెను.

రాజేయేధర్మములపై నాధారపడి భూపరిపాలనము చేయవలెనో కొద్దిగావిచారింతము. భూపతులందరు ప్రజారంజకమే, మూలరాజధర్మమని గాఢముగానమ్మి రాజ్యపాలనము చేయుచుండెడివారు. అష్టవక్రమహాముని శ్రీరామునితో తనయంతిమసందేశమందిట్లుచెప్పెను "ప్రజారంజకమేఉత్తమరాజధర్మము. ప్రజాంగీకారములేనిదే యే రాజశాసనము చేయబడునో అది ప్రజాపీడనమనుటకు యోగ్యమైనది. రాజు ప్రజలకుభృత్యుడు. రాజుయొక్క ముఖ్యకర్తవ్యము ప్రజాసేవ జేయుటయే. ప్రజలను సుఖపెట్టుటకు తనయావత్తుసుఖములను త్యజింపవలెను. అవసరమయినప్పుడు బంధువులను, సోదరులను, తల్లిని మరియు భార్యనుకూడ విడువవలెను." విశ్వామిత్రుడుకూడ దశరథమహారాజుయొద్దకువచ్చి శ్రీరాముని తనతో పంపుమనియడుగుచు యిట్లుచెప్పినాడు. "భూలోకమున ధర్మ మభివృద్ధిపొంద వలెననియు సాటిలేనికీర్తి స్థిరముగా కావలెననియు కోరుదువేని శ్రీరాముని

నాతో బంపుము." దీనినిబట్టిరాజు దేశకల్యాణముకొరకు శాశ్వతమైన కీర్తి సంపాదనకొరకును ప్రియపుత్రునినయితము త్యజింపవలెనని స్పష్ట పడుచున్నది. భరతుడు శ్రీరామపట్టాభిషేకానంతరమున శ్రీరామునితో నయోధ్యలో మారువేషములను ధరించు గుప్తచారులను నియోగించి వారివలన ప్రజలఅభావఅభియోగములను గ్రహించి వాటిని నివారించుటకు ప్రయత్నము చేయుచు సర్వజనసమ్మతముగ రాజ్యము పరిపాలింపుమని సలహాపూర్వకముగా చెప్పియున్నాడు. దుర్ముఖుడను గూఢచారుడు మహాపతివ్రతయగు సీతాదేవినిగూర్చి ప్రజలలో సందేహముకల్గినదని శ్రీరామునితో జెప్పగా శ్రీరాముడు వ్యాకులహృదయుడై కర్తవ్యముతోచకయుండు సమయమున వసిష్ఠమహర్షి ప్రజలనురంజింపజేయుటకు సాధ్వీమణియగు సీతనుగూడ త్యజించి తన రాజధర్మమును పాటింపుమని యాజ్ఞాపించెను తక్షణమే శ్రీరాముడు సీతాదేవిని వాల్మీకియాశ్రమమునకు బంపివేసెనుగదా! బాలుర మరణముగూడ వాటిల్లకుండ రాజ్యము చేసిన సంగతి లోకవిదితము. జనులచిత్తంబుల నొప్పింపక ప్రజారక్షకుడై వెలసెనను టసత్యము.

మహేంద్ర, బృహస్పతి, భరద్వాజాది రాజధర్మానుశాసకులందరు రాజత్వమునకు మూలకారణము ప్రజాసంరక్షణయని చెప్పియున్నారు. బృహస్పతి మరుత్తుండను మహారాజున కిట్లుపదేశముగావించెను.

"సీ. మేదినీపతి యతిమృదువైనమావంతుఁ
డేనుఁగునెట్లట్ల యెక్కియాడఁ
జూచుఁ దేఁకువసెడి నీచపుఁబ్రజక్రూరుఁ
డగునేని లోకంబు బెగడుగుడుచుఁ
గానవసంతంబు భానునిచాడ్పునఁ
దగిమెదుపాటితో ధరణిపప్రజల

నుచితవర్తనముల నొందించునది యిది
రాజధర్మములకు రాజసుమ్ము
తే. ... ... ... ...
... ... ... ..."

వర్ణంబుల నాలిగింటిమీదను మేదినీశ్వరుండు దయగలుఁగవలయుననియు, క్షమావంతుడగుటకు సాదుకేనుగుచందంబై యుండవలయుననియు, భృత్యులయెడ నత్యంతహార్షంబునందేలి తేకువనిశఁజరింపవలదనియుకూడ బోధచేసెను.

యాజ్ఞ్యవల్క్యస్మృతియం దిట్లున్నది —
"కులాని జాతి శ్రేణీంశ్చ గణాన్ జనపదాం స్తథా,
స్వధర్మచలితాన్ రాజా వినీయ స్థాపయేత్ పథి"

కులములు, జాతులు, శ్రేణులు, గణములు స్వధర్మమును వదలి మారుధర్మము నవలంబించినయెడ రాజు మరల వారిని వారి వారి ధర్మమునకు దేవలయునని యాజ్ఞవల్క్యుని యభిప్రాయము. విష్ణుస్మృతియం దీక్రిందిరూపమున జెప్పబడినది
"ప్రజాపరిపాలనం వర్ణాశ్రమాణాం స్వేస్వేధర్మే వ్యవస్థాపనమ్"

రాజుయొక్క ప్రధానధర్మము నాలుగువర్ణములవారిని వారి వారిధర్మముల నాచరించునట్లు జేయువలెననిగదా! మనుస్మృతియందెనిమిదవయధ్యాయములో పరిపాలకుడగురాజు బ్రాహ్మణాదిజాతి ధర్మములను వేదావిరుద్ధములగు దేశీయధర్మములను వైశ్యాదిజాత్యవిరుద్ధములగు దేశీయధర్మములను పరిశీలించి ధర్మమునకు భిన్నముగాకుండ స్వధర్మమును పరిపాలించవలెననియు, కులములు శ్రేణులు గణములు మొదలగుసంఘములనుకూడ అధికారియగు ప్రభువు పాలింపవలెననియుగలదు. బృహస్పతి వసుమనుడను రాజుతో యీక్రిందివిధముగా జెప్పినట్లు భీష్ముడు ధర్మరాజుతో పలికెను.

క. విను నృప సమ్రాట్టు విరా
ట్టని యెడు శబ్దములఁ బొగడు నాగమములు నె
ట్టన భూపాలకు ననిన న
తనిఁ దగ నర్చింపకుండఁ దగునె యొరులకున్.

క. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయున్
రాజోత్తమ! యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్.

బృహస్పతి హితోపదేశము ప్రకారము వసుమనుఁడు ప్రజాపాలనంబాచరించెనని మహాభారతమునఁగలదు.

భీష్ముఁడు ధర్మరాజతో భూవల్లభుం డేవిధముగా నభివృద్ధినొంది యతిశయిల్లునో యను విషయమును ముచ్చటించుచు యిట్లు నుడివెను.

ఆ. సకలవర్ణధర్మ సంకరరక్షయు
సంధివిగ్రహాది షడ్గుణములు
నలయ కరయుటయును నర్థసమ్యగుపార్జ
నమును నృపతి యెపుడు నడపవలయు.

ఆ. ధర్మరతులు నర్థనిర్మాణచతురులు
శౌర్యరతులును నలంఘితాజ్ఞ
లును సునీతి నిపుణులును గులజులునగు
పరిజనములఁ బెనుపు పతికి హితము.

తే. సంతతోత్సాహవంతుఁడై శత్రుకోటి
నార్జవంబుననైన ననార్జవమున
నైన జెఱుపవలయు నత్యల్పుఁడైన
బగతు డగ్నివిషంబుల పగిది నొంచు.

క. ఆరామాదికనిజ సం
చారస్థలములకు దేశసంధులకుఁ బురీ
ద్వారములకు నగరికిని ధ
రారమణుఁ డొనర్పవలయు రక్షలునియతిన్.

జనకునివలె ప్రజంబరికించుచు ధర్మనిష్ఠఁజేసి ధరణీపాలనంబు చేయవలెననియు రాజధర్మప్రకారంబంతయు సంక్షేపరూపంబున నెరింగించెను.

అంగీరసభార్గవాదులు యిట్లుచెప్పిరి —"యజ్ఞాధ్యయనదాన తత్పరుండగుచు దుర్మంత్రుల కుటిలవాక్యంబులకు లోనుగాక నయపిక్రమక్రమజ్ఞులైన యమాత్యులతో దైవమానుషచింతనంబు సేయుచు దేవబ్రాహ్మణ ప్రణామతర్పణ రక్షణంబులంజేసి యసుధనిరాసనంబును శుభాదానంబును నొనర్చుచు ప్రజలఁబాలించుభూపతి యుభయలోకసిద్ధులంబొందు." దేవస్థానుండును పారాశర్యుండును ధర్మనందనునితో హితవచనంబులుపలుకుచు భూపాలుడు ధర్మశాస్త్రవిదుండును ధైర్యసమగ్రుండును పుణ్యక్రియానుష్ఠానపరుండును, దండనీతివిద్యనభ్యసించినవాడునునై వర్ణాశ్రమధర్మములను పాటించుచు ప్రజల రక్షింపమి రాజకోటికి మహాపాతకమనితలంచుచు ప్రజాకంటకుడు కాక మనుజలోకమును కనక, అన్న, వస్త్ర, భూమణాదులచే తృప్తిపరచుచు సామ్రాజ్యము పాలింపవలెనని చెప్పియున్నారు.

కళింగదేశమును జయించినపిమ్మట మౌర్యవంశపురాజైన అశోకవర్ధన బౌద్ధచక్రవర్తి వ్యాకులచిత్తుడై తాను చేసినది మహాపాతకమనియు ధర్మవిరుద్ధమనియు నమ్మి రాజుయొక్క ఘనత ప్రజలమనంబుల నాకర్షించుటయం దిమిడియున్నదని తలచియేకదా దేశదేశములకు బౌద్ధమతబోధకులనంపి బౌద్ధధర్మమును విస్తరింపజేసెను. ప్రజావత్సలుడగు ప్రభువే ధన్యుడనియు, నట్టిరాజుచే పాలింపబడుదేశమే

పుణ్యమయమనియు, నతనిదేశమున వసియించుప్రజల సౌభాగ్యమే భాగ్యమనియు, ప్రజలమనస్సులను ప్రేమవలనజయించుటే నిజమైన జయమనియు నొకదేశమును జయించి కోట్లకొలదిప్రజలను మృత్యుదేవతపాలిటికంపుట జయముగాదనియు నతనియభిప్రాయము. ఈసత్యమునే ఆంగ్లకవీశ్వరుండగు మిల్టన్ కూడ యీవిధముగా విశదీకరించెను.

They err, who count it glorious to subdue
By conquest far and wide to overrun
Large countries, and in fields great battles win
Great cities by assault...
But if there be in glory aught of good,
Itmay be means far different be attained
Without ambition, war, or violence;
By deeds of peace, by wisdom eminent,
By pretence, temperance

(Paradise Regained)

సెల్యూకస్ నికటార్ కుమార్తెయు, చంద్రగుప్తమౌర్యుని భార్యయునగు హెలెన్ సర్వశాస్త్రములను గ్రీకుభాషయందునేర్చి తండ్రితో దుఃఖగ్రస్తుల దుఃఖములను దూరముచేయుట, రోగులరోగముల నివారింపజేయుట, ఆకలిగొన్నవారికి భోజనమిడుట, అజ్ఞానులకు జ్ఞానబోధచేయుట రాజధర్మములనియు పరదేశములపై దాడి, స్వార్థచింత, అత్యాచారము, అవిచారము, పరపీడన రాజధర్మములకు విరోధమనియు గూడ విస్పష్టముగా నెరిగించెను.

మొగలువంశదీపకుడైన అక్బరుచక్రవర్తి యొకానొకసమయమున కౌటిల్యుడు చెప్పినవిధముననే యిట్లు చెప్పెను. 'Divine worship inmonarchs consists in their justice and administration.'

పూర్వులు భూపతి దేవాంశసంభూతుడని నమ్ముచుండెడివారు. రాజప్రత్యక్షభూలోకదైవతమని వారియుద్దేశము. దీనినే పాశ్చాత్యులం

Divine right of kingship యనియందురు రాజు యిట్టిగౌరవపదమును బోగొట్టుకొనక తగురీతిని నేరస్థులనుదండించుచు సన్మార్గమునకు మరలింపవలెను. ఇట్లుచేయనినాడు తనకు, తనరాష్ట్రమునకు హానిసంభవించును. మనుస్మృతియం దిట్లు కన్పించుచున్నది.

"దండో హి సుమహా త్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః,
ధర్మా ద్విచలితం హంతి నృపమేవ సబాంధవమ్.
తతోదుర్గం చ రాష్ట్రంచ లోకంచ సచరాచరమ్,
అంతరిక్ష గతాంశ్చైవ మునీన్ దేవాంశ్చపీడయేత్.
సోసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా,
నశక్యోన్యాయతో నేతుం సిక్తేన విషయేషు చ."

నీతిశాస్త్రమెరుగనివారిచేత దండనసేయుట శక్యముగాదు. నీతివిరుద్ధమగుదండనవలన రాజునకు రాష్ట్రమునకు దుర్గమునకు ప్రజలకు మునులకు దేవతలకు పీడకలుగును. అసహాయుడు, మూఢుడు లుబ్ధుడు, విషయాసక్తుడు న్యాయముగశిక్షించుటకసమర్థుడు. మనువు, సామాన్యమానవుడుచేయుతప్పు రాజుచేసిన, వేయిరెట్లెక్కువశిక్షను పొందవలెనని చెప్పినాడు. రాజుగూడ జుల్మానాయివ్వవలసియుండునని మనువుయభిప్రాయము.

"కార్షాపణం భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః,
తత్ర రాజా భవేద్దండ్య స్సహస్రమితిధారణా."

అధర్మముగా పరిపాలించురాజులు పదభ్రష్టులై పలుకష్టములకు లోనైరని పలుచోట్ల ప్రాచీనభారతవర్షమందు కాన్పించుచున్నది.

# మూడవ భాగము.

---

రెండవ భాగములో ప్రాచీనకాలమందలి రాజధర్మములను విపులముగా విశదీకరించియున్నాను. పాశ్చాత్యులు నామరూపములు లేక అనాగరికులై యడవులందు మృగములను వేటాడుచు దిరుగాడు సమయమున భారతవర్షమందు భూపతులు పెద్దపెద్ద సామ్రాజ్యములనుస్థాపించి సత్యసంధులయి ప్రజారంజకముగా పరిపాలనచేసిరన్న మాట సత్యము. కాయ మస్థిరమనియు, సత్యమేజీవితమందు ప్రధానధర్మమనియు నమ్మి, పూర్వకాలమందలి రాజు లనేకులు యఖండకీర్తి సంపాదించిరని ప్రాచీనగ్రంథములే ఋజువుచేయుచున్నవి. రఘువంశమందు అజమహారాజునకు ఇందుమతికి జన్మించిన దశరథుడు సత్యవాక్యపరిపాలనకొరకై తనప్రియపుత్రుడయిన శ్రీరాముని విశ్వామిత్రునివెంట పంపియున్నాడుగదా! ఆడితప్పకుండుటకై దశరథుడు శ్రీరాముని యువరాజపట్టాభిషేకమాసన్నమయినప్పుడు కైకేయియొక్క వరములనాదరించి యిష్టములేకపోయినను ప్రియపుత్రుని పదునాలుగేండ్లరణ్యవాసమున కంపియున్నాడుగదా! శ్రీరాముడు పట్టాభిషేకమన్న యానందములేక అరణ్యవాసమన్న విచారములేక పితృవాక్యమును పాలించుటే తనముఖ్యధర్మమని లక్ష్మణసీతాసమేతుడై యడవికేగినమాట మనమెరుగుదుము. హరిశ్చంద్రుడు సత్యమును కాపాడుటకై! రాజ్యసుఖములనుత్యజించి భార్యను తన్ను విక్రయించి అఖండకీర్తిని సంపాదించి ప్రజలకాదర్శపురుషుడై వెలసిల్లెనని చరిత్రయే వేనోళ్ల చాటుచున్నది. ధర్మరాజాదులు ధర్మబద్ధులైగదా ద్రౌపదిమానభంగసమయమున నూరకుండి తుదకు అరణ్యవాసమునకు అజ్ఞాతవాసమునకు గడంగిరి! ఇట్లెందరెందరో మహారాజులు ప్రాచీనభారతదేశమందు సత్యసంధులై పరిపాలించియున్నారు.

ఇంక ప్రజలనెట్లు రంజింపజేసి పరిపాలించిరో కొద్దిగావిచారిం తము. ధరణీపతులు తప్పుగలిగిన గురుని, మిత్రుని, పుత్రుని, యని మన్నింపక దండించుచుండెడివారు. సగరుడు తనకుమారుని పౌరబాలబాధకుండనిదెలిసి పరిత్యజించియున్నాడు. శ్రీరాముడు సీతయొక్క పాతివ్రత్యవిషయమై ప్రజలలో కలవరముగలిగినదని దుర్ముఖునివలన విన్నవాడై వసిష్ఠమహర్షి చెప్పినట్లు సీతాదేవిని వాల్మీకాశ్రమమునకు పంపుట ప్రజానురాగముచేతనేగదా! శ్రీరాముడు ప్రజలయొక్క కష్టములనెరింగి వాటినినివారించుటకై గుప్తచారులను అయోధ్యానగరమందును, రాజ్యమందలి తదితరప్రదేశములందును నియోగించియున్నాడు. జంతుహింసకునిష్టపడక అట్లుచేయువారిని తగురీతిని దండించుచుండెడివాడు. శ్రీరాముడేకాక పూర్వమందనేకభూపాలురు రాజసూయ, అశ్వమేధాదియాగములను భూ కనక అన్నవస్త్రాది దానములఁజేయుచు ప్రజారక్షకులైరని భారతమందుకలదు. శ్రీకృష్ణుడు ధర్మరాజుతో మరుత్తుడు, సుహోత్రుడు, అంగుడు, శిబి, శ్రీరాముడు, భగీరథుడు, దిలీపుడు, మాంధాత, యయాతి, అంబరీషుడు, శశిబిందుడు, గయుడు, రంతిదేవుడు, భరతుడు, పృథుడు, జామదగ్న్యుడనుషోడశచక్రవర్తులు రాజయోగ్యంబులగునధ్వరములు పెక్కాచరించి గజములు, హయములు, స్వర్ణమయములగుకొమ్ములతో నలరారుపశువులు, అఖిలరత్నములచే పొదగబడినఆభరణములు బ్రాహ్మణులకును తదితరజనులకునుయిచ్చి లోకప్రఖ్యాతిపొందిరని చెప్పియున్నాడు. ధర్మరాజు పట్టాభిషేకానంతరమున మృతినొందిన బంధుజనులందరకు శ్రాద్ధక్రియలాచరించి రాజ్యపరిపాలన ప్రారంభించెను. రత్నహేమాదిదానములుచేయుట, చలివందిరులు, సత్రములుఁబెట్టుట, చెరువులు త్రవ్వించుట, దేవాలయములనిర్మించుట మొదల

సుప్రజోపయోగమగునను లెన్నియో చేసియుండెను. భారతమందిట్లు కలదు:—

క. చలిపందిరులును సత్రం
బులఁ బెట్టించెను దటాకములు దేవగృహా
ములుఁ గల్పించెను బంధుజ
నులకు సుగతియగుటకై వినుతధర్మంగిన్నృపా.

క. లోకమున గలుగు భూసుర
లోకమునకు నెల్లగోవ్రలుం బసిడియు నా
నాకల్పంబులు బంధుల
కై కోటిశః ధయములనిచ్చె నతులితభక్తిన్.

శాంతిపర్వమందు ప్రథమద్వితీయాశ్వాసములం దక్కడక్కడ ధర్మనందనుని రాజ్యపరిపాలన వర్ణింపబడినది. దీన అనాథజనులకు పోషణముజరుగుట, పతులైన సతులయెడ దయఁజూపుట, పౌరజన పదకోటులకు సంతోషముగల్పించుట మొదలగుపనులు జరుపబడు చుండెడివి.

చంద్రగుప్త, మౌర్యునికాలముననుగూడ ప్రజలకుపయోగ కరమగుపను లనేకము జరుపబడినట్లు గ్రీకులవలన తెలియవచ్చు చున్నది. స్ట్రాబో (Strabo) మెగాస్థనీస్ (Megasthanes) వలననే గాక చంద్రగుప్తుని మంత్రిపుంగవుఁడగు చాణక్యుని అర్థశాస్త్రమువల నగూడ రాజ్యపరిపాలన మెట్లుండెనో స్పష్టపడుచున్నది చాణక్యుడు చెప్పినట్లు చంద్రగుప్తుఁడు నిరంతరము నడుచుచుండెనని నమ్మవచ్చును. చంద్రగుప్తునికాలములోగూడ శ్రీరామునికాలములోవలె గూఢ చారు లుండెడివారు. ఈగూఢచారులు పట్టణములు, పల్లెలుతిరిగి ప్రజలకష్టసుఖములను కనిపెట్టి చక్రవర్తితో చెప్పుచుండుటయు కలదు. వీరు తీర్థసభపాలసమవాయమును (Sectional assembly

of the Paura in charge of the temples and other buildings)
2. పౌరసమవాయమును (in charge of manufactures and trade)
3 జనసమవాయము లేక పౌరపదసమవాయమును (popular assemblies) కలిసికొని పౌరజానపదుల రాజకీయ సంబంధమైన అభిప్రాయములను కనిపెట్టి చక్రవర్తితో చెప్పుచుండెడివారు స్ట్రేబొ, మెగాస్తనీస్ పాటలీపుత్రముయొక్క పరిపాలనావిధానమును వర్ణించుచు పురపాలకులు 'నగరక' అని పిలువబడుచుండెననియు, పురపాలక సంఘమువారు అన్యదేశస్థులు పట్టణము ప్రవేశించినప్పుడు వారికివలయు సౌకర్యములు కల్పింపబడుచుండెననియు, వారిలో నెవరైన మృతినొందినప్పుడు వారియాస్తి వారసులకు బహుజాగరూకతతో నొప్పగించుచుండెడివారనియు వ్రాసియున్నారు. అయిదుగురు సభ్యులుగల యొక సంఘము అన్యదేశస్థులకై యమైపాటుబడుచుండెననికూడ వ్రాసినారు దేవాలయములు, చెరువులు, విశ్రాంతిస్థలములు, వర్తకస్థానములు కాపాడబడుచుండెను ఏదైనను శిథిలమైనప్పుడు విశేషధనమును వ్యయపరచి వాటిని మరల మరమ్మత్తు చేయుచుండెడివారు. తూనికలలోను, కొలతలలోను ఏవిధమైన మోసము జరిగిన శిక్షవేయుటకలదు. చంద్రగుప్తుని కాలములో గోసంరక్షణ విశేషముగా జరుగుచుండెననుటకు నిదర్శనములు కలవు. కౌటిల్యుని అర్థశాస్త్రమందు గోహత్యచేసినవానికి ఏబదిపణములు జుల్మానా వేయవలెననికలదు. రోడ్లు సరియైనపద్ధతిని పెట్టుట కొకప్రత్యేక శాఖకూడ ఏర్పరుపబడెను. రాళ్లు, మార్గముచూపు స్తంభములు పదిస్టేడియాల (10 stadia) లేక ఒకఅర్ధకోసుదూరమున నాటబడుచుండెడివి. 'అధకోసక్య' అని కలదు అనగా అర్ధకోసని చరిత్రకారులు కొందరర్థము చెప్పుచున్నారు.

10000 స్టేడియాల పొడుగుగలిగిన రోడ్డొకటి ఆఫగనిస్థాన్ ప్రాంతములనుండి రాజధానివరకు వేయబడెనట. చంద్రగుప్తుని కిరి

సేద్యడిపార్టుమెంటు (Irrigation Department) ను స్థాపించి వారిచే భూమినంతను కొలిపించి కాలువలు త్రవ్వించి తూముల ద్వారా ప్రతి చేనుకు, సమానముగా నీరందునట్లు ఏర్పాటు చేసియున్నాడు. ఈ విషయమునే మెగాస్థనీస్ తన గ్రంథములో వ్రాసియుండెను. ఈజిప్టు (Egypt) లోవలె భారతదేశములో గూడ నీటిసదుపాయము విశేషముగా కల్పింపబడెననియు ఆనీటివలన పంటలు విస్తారముగా పండుటకు వీలగుచుండెననియు వివరించియున్నాడు. 150 A. D. సంవత్సరమున కేతియవార్ లోని గిర్నార్ లో రుద్రదామనుయొక్క శిలాశాసనము మూలమున చంద్రగుప్తుని రాజ్యమందు పశ్చిమభాగమునకు ప్రభువైన (Governor) పుష్యగుప్తుడు సుదర్శన అను పేరుతో ఒక సరస్సు త్రవ్వించెననియు దానివలన కొన్నివేల ఎకరముల భూమి సాగుబడియగుచుండెననియు తెలియవచ్చుచున్నది. అర్థశాస్త్రములో చెప్పబడినట్లు చంద్రగుప్తుడు స్వయముగా దేవతలను, వేదాధ్యయనపరులగు బ్రాహ్మణులను, పశువులను, పవిత్రస్థలములను, బాలురను, వృద్ధులను, బాధపడువారిని, స్త్రీలను, దిక్కులేనివారిని జూచుచు తగురీతిని సహాయ మొనరించుచుండెను.

చంద్రగుప్తుని మనుమడైన అశోకవర్ధనుని పరిపాలన జూచిన పూర్వకాలమందు చక్రవర్తులు జనులకు తాము భృత్యులని నమ్మి వారికి యెట్టిసౌకర్యములు గల్పించిరో తెలియగలదు. అశోకవర్ధనుడు రాజ్యమునకువచ్చిన తరువాత కళింగయుద్ధము కాక మరేయుద్ధము జరిగియుండలేదు. ఆకళింగయుద్ధమే అశోకుని బౌద్ధమతావలంబకునిగా జేసినట్లు అతని పదమూడవశిలాశాసనము చెప్పుచున్నది.

"Directly after the annexation of the kalingas began His Sacred Majesty's Zealous protection of the Law of Piety, his love of that Law, and his inculcotion of that Law (Dharna)"

బౌద్ధమతమందలి ముఖ్యధర్మమైన అహింసాధర్మమును గ్రహించి దేశమందంతటను 'ధర్మమహామాత్రు' లనుఉద్యోగీయుల నియమించి బౌద్ధమతమును వ్యాపింప మొదలిడెను. మనుష్యుని జంపుటకంటె జంతువునుహింసించుట మహాపాపమనినమ్మినదు దేశమందు బ్రాహ్మణులచే చేయబడు జంతుహింసతోకూడినక్రతువులను చేయకుండ చూచునట్లు ధర్మమహామాత్రుల నాజ్ఞాపించెను. రాష్ట్రాధిపతులు, మండలాధిపతులు బౌద్ధమతమును వ్యాపింపజేయుటయందు తగుశ్రద్ధ దీసికొనవలయుననియాజ్ఞచేసెను. తాను అడవికిబోయి వేటాడుట మానివైచెను. రాజభవనమందుగూడ మాంసభక్షణకూడదని తలంచి యేజంతువునుగాని పక్షినిగాని జంపకూడదనెను అతనిప్రేమామృత ప్రవాహము పశుపక్షికీటపతంగపర్యంతము ప్రవహించినట్లు తెలియుచున్నది అతనిప్రేమసామ్రాజ్యమున పశుపక్ష్యాదులుగూడ ప్రజలేయని చెప్పుట యతిశయోక్తికానేరదు 243 B. C. సంవత్సరములో కొన్నినిబంధనలు గావించెను. "ఇకటినుండి నా రాజ్యమునందెచ్చటను నీక్రిందిజీవులను హింసింపకూడదు—చిలుక, గోరవంక, చక్రవాకము, రాజహంస, గంజలనేరికొని తినుపక్షులు, పికిలిపిట్ట, కూర్మము, శంకరమత్స్యము, వానరము, ఆబోతు, ఖడ్గమృగము, పావురము, గువ్వ, పిచ్చుక, ఆడుమేక, ఆడుపంది, గర్భిణి, దుగ్ధవతి, గాడిద, గుర్రము, గోవు, మొదలగునవి." ఆషాఢపూర్ణిమ మొదలు కార్తికపూర్ణిమవరకును, యితరమాసములయందలి విశేషనిర్దిష్టదినములయందును మత్స్యవధయు, మత్స్యవిక్రయమునుగూడ నిషిద్ధములని శాసింపబడినవి. వాటినిబట్టి జీవహింసజేయుటకు స్వాతంత్ర్యమును పూర్తిగాతగ్గించివైచెనని చెప్పవచ్చునుగదా! జంతువునుజంపినందుకుగాక మాంసము భక్షించినందుకుగాని మరణశిక్షకూడ విధించుటకలదు. రూమినీడి స్తంభమందు అశోకునిశాసన మిట్లుగలదు

1. దేవానంపియేన పియదసిన లాజినవీసతివసాభిసితేన. 2. అతన ఆగాచ మహీయితే హిదబుధేజాతె సక్యమునీతి. 3. సిలావిగడభీచా కాలాపిత సిలాథభేచ ఉసపాపితే. 4 హిదభగవమ్ జాతేతి లుమ్మినిగామె ఉబలికేకతే. 5 అఠభాగియేచ.

ఈశాసనమంతయు అశోకవర్మని అహింసాధర్మమందు ప్రీతిని గురించియే చెప్పబడినది

తండ్రి కుమారునిచేతను, గురువు శిష్యునిచేతను గౌరవింపబడవలెననియు, బంధువులయెడ ఆదరముగలిగియుండవలెననియు కొన్ని శాసనములలో వ్రాసియున్నాడు. మైసూరులోని ఒకచిన్న శిలాశాసనమునం దిట్లు వ్రాయబడినది. (Thus saith. His Majesty; Fathers and Mothers must be obeyed; similarly respect for living creatures must be enforced; truth must be spoken. These are the virtues of the Law of Duty (or 'Piety', dharma) which must be practised. Similarly the teacher must be reverenced by the pupil, and proper courtesy must be shown to relations.)

బీదలను, దాసీజనులను, సేవకులను, బ్రాహ్మణులను, సాధువులను బహుదయతో, ఔదార్యముతో జూడవలెనని యాజ్ఞాపించినాడు. ఇతరమతములయెడ సహనము జూపుచుండెడివాడు. రోడ్లప్రక్కను చెట్లు నాటించుట, స్తంభములను రాళ్ళను వేయించుట, విశ్రాంతిస్థలముల నిర్మించుట, పశువులు మనుష్యులు నీరుత్రాగుటకు సరస్సులను త్రవ్వించుట, కాలువలు త్రవ్వించుట, కొండవాగులను కట్టించి నీరు నిలువచేయించి పొలములకు పెట్టించుట, పండిన పంటలో నారవపాలుమాత్రమే భూమిపన్నుగా గ్రహించుట, ఉచితముగా వైద్యముచేయుటకై వైద్యశాలలను నిర్మించుట, ఫలపుష్ప భరితములగు వృక్షములను పెంచుట మొదలగు పనులెన్నియో విశేషధనమును వ్యయపరచి

చేసియున్నాడు. ఏడవశిలాశాసనముమీద యిట్లు వ్రాయబడినది. "On the roads I have had banyan trees planted to give shade to man and beast; I have had groves of mango-trees planted; and at every Kos I have had well dug; rest-houses have been erected; and numerous watering places have been prepared here and there for the enjoyment of man and beast". వైద్యమునకు పనికివచ్చు మూలికలుకూడ తెప్పింపబడుచుండెనని రెండవ శిలాశాసనమును బట్టి తెలియుచున్నది. పల్లెలయందలి శ్యామలశోభా మధ్యమున నున్న వస్త్రములకును జలమునకును బాధ లేకుండ నాకలిదప్పిక లనుమాటయెరుంగక శీతాతపబాధలకు లోబడక స్వస్థచిత్తులై యారోగ్యవంతులై ప్రజలెల్లరును తమతమ కష్టసుఖంబుల ననుభవించుచు గాలము గడుపుకొనుచుండిరి.

బౌద్ధమతమును భారతదేశమందును యితరదేశములందును వ్యాపింపజేయుటకై మతబోధకులను పంపియుండెను. Antiochos of Theos చే పాలింపబడుచున్న సిరియాదేశమునకున్ను Ptolomy Philadelphos యొక్క యీజిప్టుకున్ను, Magas యొక్క సైరీన్ (Cyrene) దేశమునకున్ను, Antigonus Gonatas యొక్క మేసిడోనియాకున్ను, Alexander యొక్క ఎపిరస్‌కున్ను Tissa చే పరిపాలింపబడుచున్న లంకాద్వీపమునకున్ను మతప్రచారకులు పంపబడిరి. 'ఏంటియోకోయోనరాజా' అని ఉదహరింపబడినది. లంకాద్వీపమునకు మహేంద్ర యనునాతడును, అతని సోదరి సంఘమిత్రయు కాశ్మీర, గాంధార దేశములకు మజ్జన్తికుడును మహిషమండలమునకు మహాదేవుడును, వనవాసి మండలమునకు రక్షితుడును, అపరాంత మండలమునకు ధర్మరక్షితుడును, మహారాష్ట్రదేశమునకు మహా ధర్మరక్షితుడును, యవనలోక (గ్రీసు) మునకు మహారక్షితుడును, హిమవంతమండలమునకు మజ్జిమ మరభిసారుడు, మహాదేవుడు, మాలవదే

పుమను, సువర్ణభూమికి సోణుడు, ఉత్తరుడును, పంపబడిరి. చోళ, పాండ్య, కేరళపుత్ర, సతియపుత్ర దేశములకుగూడ మతప్రచారకులు పంపబడిరి కాంభోజులు, భోజులు, పులిందులు, పితేనికులు, కృష్ణ గోదావరి మధ్యనున్న ఆంధ్రులుగూడ ఈబౌద్ధమత ప్రచారకుల యొక్క బోధనలువిని బౌద్ధమతమును అవలంబించిరి అశోకుని పవిత్రచరిత్రము రాజ్యపరిపాలనా చాతుర్యము, సుఖశాంతి స్థాపనము సర్వభూత దయాళుత్వము భారతవర్షమందలి ప్రజలకందఱకు చిరకాలమాదర్శములై విరాజిల్లుచున్నవి. ఇతని నామము సర్వ జగచ్చరిత్రమందును పవిత్రనామముగా పరిగణింపబడుచున్నదిగదా !

కుషానువంశములో కీర్తికెక్కిన కనిష్కచక్రవర్తి (మహారాజ రాజాతిరాజదేవపుత్ర కనిష్క See Vihar Inscription) కూడ బౌద్ధ మతమును అవలంబించి కుండలవనమందు సభనొకదానిని గావించెను. జ్ఞానప్రస్థాన శాస్త్రమునకు వ్యాఖ్యానగ్రంథము మహావిభాష శాస్త్రమురచించిన వసుమిత్రుడు, అశ్వఘోషుడు, నాగార్జునుడు, చరకుడ , సిద్ధాంత శిరోమణి కర్తయగు భాస్కరాచార్యులు మొదలగు పండితులందరు కనిష్కునిచే గౌరవింపబడుచుండెడివారు. అన్యదేశస్థులను సగౌరవముగా జూచుచుండెడివాడని గ్రంథములు చెప్పుచున్నవి గుప్త వంశీయుడైన రెండవ చంద్రగుప్తుడు (విక్రమాదిత్య) ఉత్తమ రాజలోకమందు వన్నెకెక్కిన మహానుభావుడని చీనాయాత్రికుడగు ఫాహియాన్ తన చీనాగ్రంథములో (Travels) వ్రాసియున్నాడు జనులు చాలా మైశ్వర్యవంతులై యుండిరనియు, చక్రవర్తిచే వైద్యశాలలు ఉచితముగా స్థాపింపబడెననియు, మాళవదేశములో కష్టమన నెట్టిదో యెరుగరనియు వ్రాసియున్నాడు ) The large population lived happily under a sensible Government which did not worry. They have not to register their households or attend to any Magistrates and rules.' ప్రజలందరు ధర్మనిష్ఠాపరులై అహిం

నదే పరమధర్మముగా నమ్ముచుండెడివారట. ఫాహియాన్ యిట్లు వ్రాయుచున్నాడు. 'Throughout the country no one kills any living thing or drinks wine or eats onions or garlic......... they do not keep pigs or fowls, there are no dealings in cattle, no butcher's shops or distilleries in their market places' జంతుహింస చేయబడుట లేదనియు, వర్తకస్థలములందు మాంసమమ్మబడుట లేదనియు, పందులు పెంచబడుట లేదనియు, వెల్లుల్లి, నీరుల్లి తినబడుట లేదనియు, కల్లు సారాయి మొదలగుమత్తు పదార్థములు వాడుట లేదనియు చీనాయాత్రికుని యభిప్రాయము. విక్రమాదిత్యునకు భాషాభిమానము మెండని చెప్పవచ్చును. కాళిదాసాదిమహాకవులు అతనిచే నాదరింపబడుచుండెడివారు. సంస్కృతము విశేషముగా ప్రచారము చేయబడెననుటకు సందేహము యిసుమంతయు లేదు. ప్రజానురాగము విక్రమాదిత్యునకు విస్తారముగలదని లోకప్రతీతిగలదు.

హర్షచక్రవర్తిపరిపాలన జూచిన అశోకునిపరిపాలన జ్ఞప్తికివచ్చును. బౌద్ధమతస్థుడైనను పరమతసహనము గలవాడు. బ్రాహ్మణులను ఆదరించుచుండెడివాడు. అహింసామార్గమునే అవలంబించి రాజ్యమందెక్కడను జంతుహింస జేయరాదనియు యాజ్ఞాపించెను. విశ్రాంతిస్థలములలో వైద్యసంబంధమైన సౌకర్యములుకూడ కల్పించబడినవి. విదేశీయులను బహుజాగరూకతతోను, గౌరవముతోను జూచుచు, వారికెట్టి హానిగలిగినను శిక్షవిధింపబడునని యాజ్ఞాపించినట్లుకూడ గలదు. చీనాయాత్రికుడైన హుయాన్‌త్సికియాంగ్‌కు జూపిన గౌరవమే అందుకు తార్కాణము. బౌద్ధమతసభలయిన తరువాత బీదలకు అన్నదానము చేయుట, బంగారమును పంచిపెట్టుట మొదలగు పనులు జరుపబడినవి. దేశములోని వ్యవహారములన్నిటిని స్వయము

గ నేపరిశీలించవలెనని యతని యూహ. అందుచేతనే ప్రతిపట్టనమునకు, పల్లెకు వీలయినంతవరకు పోయి, అక్కడ వెదురుపాకలు వేయించి విశేషముగా ప్రజలధనమును వ్యయపరచక ప్రజల కష్టసుఖములను గ్రహించుచుండెడివాడు. సంస్కృతమున్న హర్షునకు బహుప్రీతి. తాను నాగానంద, రత్నావళి, ప్రియదర్శికఅను నాటకములురచించెను. ఇట్సింగ్ యను చీనాయాత్రికుడు హర్షుని కవీశ్వరులు అయిదువందల కావ్యములను రచించి అతని కంకిత మొసఁగిరని వ్రాసియున్నాడు. బౌద్ధమతపీఠములే అతని కాలమందు విశ్వవిద్యాలయములై వెలయుచుండెను. జలంధరులో నాగరధనవిహారము, కన్యాకుబ్జములో భద్రవిహారము, వైశాలిలో శ్వేతపుత్ర పీఠము, నలంద, మహాబోధి, రక్తామృత పీఠములు విద్యాలయములై యుండెను. వీటి నన్నిటిని హర్ష చక్రవర్తి ధనమిచ్చిపోషించుచుండెడివాడట సమస్తశాస్త్రములు చెప్పబడుచుండెడివి. నలందవిశ్వవిద్యాలయములో వేదములు, హేతువాదవిద్య, శబ్దవిద్య, చికిత్సావిద్య, సాంఖ్య, న్యాయ, యోగ శాస్త్రములు బోధింపబడుచుండెనట. హుయాన్ త్సికియాంగ్ నలందవిద్యాలయాధికారియగు శీలభద్రునివద్ద యోగశాస్త్రము నభ్యసించెను. హర్షునికాలమందుండు కవులలో జయాదిత్య, వామన, ధర్మపాల, శీలభద్ర, సుబంధు, ధర్మకీర్తి, రాహులమిత్ర, జినప్రభువు, జ్ఞానచంద్ర (Professors at Nalanda) బాల, కుమారదాస, (Author of Janakiharanam) మాఘ, రవికీర్తి, మయూర (సూర్యశతకము గ్రంథకర్త,) మాతంగదివాకర, భారవి, మాఘముఖ్యులు. హర్షునికాలమందు ప్రజలు చాల ఐశ్వర్యవంతులై యుండిరని చీనాయాత్రికుని సాక్ష్యము తెలుపుచున్నది.

## నాల్గవ భాగము.

మూడవభాగములో ప్రాచీనభరతఖండమందు నరపతులు ప్రజానురాగమును బడసి యెట్లు రాజ్యమును పరిపాలించిరో పుష్కలముగా వ్రాసియుంటిని. ఆరాజులకడనుండు మంత్రులెవరో వారును తదితర యుద్యోగీయులు నెట్టెట్టియధికారముల నిర్వహించి క్రమపద్ధతిని రాజ్యచక్రమును నడపగలిగిరో తెలియుట ముఖ్యావశ్యకము. మంత్రులులేని భూపాలుడు, లేదా మంత్రుల హితవచనముల పెడచెవినిబెట్టి యిష్టమువచ్చినరీతిని ప్రజాపాలనముచేయు రాజు నిరంకుశుడనబడును, శీఘ్రకాలములో నశించుననిన్ని శాస్త్రములు ఘోషించుచున్నవి. మంత్రిశబ్దమునకు ఆత్మీయుడని, విశ్వాసనీయుడని యర్థము. మంత్రి యుత్తమవంశమం దుద్భవించి ధర్మవిదుడై లౌకిక వ్యవహారములందు స్వతంత్రుడై, నిర్భయుడై, సత్యనిరతుడై, జనప్రియుడై, వివేకము, బుద్ధితీక్ష్ణత, ప్రమాణసామర్థ్యము, శబ్దచాతుర్యము గలిగియుండవలెనని కౌటిల్యుడు తన గ్రంథరాజమగు అర్థశాస్త్రమందు వివరించియున్నాడు. రాజు తానెంత ప్రజ్ఞాన్వితుడైనను మంత్రులతో నాలోచనలుసలుపుచు వారుచెప్పినచొప్పున సర్వరాజకార్యములను చక్కపెట్టుచుండవలెనని శుక్రనీతిసారమందు కనబడుచున్నది. మంత్రులు రాజకృతులని పిలువబడుచుండుటయు గలదు. రాజకృతు (King-makers.) లన ఒక రాజును పదభ్రష్టునిజేసి మరియొకని నాపదవినలంకరించునట్లుచేయు నధికారముగలవారని యర్థము.

మంత్రులసంఖ్యనుగూర్చి రాజధర్మానుశాసకు లెట్టెట్టియభిప్రాయములు గలిగియుండిరో కొద్దిగా విచారింతము. పదునార్గురు మంత్రులుంగల సభయుండవలెనని బృహస్పతియొక్క యభిప్రాయము, మంత్రులసభ (Cabinet or Council of Ministers.) అష్టప్రధాను

లతో నిండియుండవలెనని మనువు వ్రాసియున్నాడు. అందులో ఏడ్గురు సాధారణమంత్రులనియు ఎనిమిదవమంత్రి ప్రధానమంత్రియనియు ఆ ప్రధానమంత్రి ధర్మశాస్త్రవిశారదుడై సునీతినిపుణుడై యుండవలెననియు ఆపదవికి బ్రాహ్మణుడే నియోగింపబడవలెననియు చెప్పియున్నాడు.

అష్టప్రధానులు.

1. సుమంత్రి (Minister of Finance)
2. పండితామాత్య (Minister of Law)
3. మంత్రి (Home Minister)
4. ప్రధాన (President of the Council of Ministers)
5. సచివ (Minister of War)
6. అమాత్య (Minister of Revenue)
7. ప్రాడ్వివాక (Minister of Justice)
8. ప్రతినిధి (Representative)

అష్ట ప్రధానులుగాక తదితర యుద్యోగియులలో దూత (Ambassador) పురోహితుడును ముఖ్యులు. దూత మంచివంశమందు జన్మించి ధైర్యసాహసములు గలిగి విదేశవ్యవహారములను గొప్పనైపుణ్యముతో చక్కబెట్టు మంత్రియని చెప్పవచ్చును. పురోహితుడు వైదికకార్యములందేగాక రాజకార్యములందుగూడ పాల్గొనుచుండినట్లు రామాయణమువలన గోచరమగుచున్నది. మునిచంద్రుడగు వశిష్టమహర్షి శ్రీరామునిరాజ్యమందును, శ్రీరాముని ప్రియజనకుడగు దశరథునిరాజ్యమందును వైదికకార్యములనేగాక రాజకార్యములనుగూడ క్రమపద్ధతిని నడుపుచుండినట్లు లోకవిదితము. దేశకాలానుగుణ్యముగ మంత్రులసంఖ్య నిర్ణయింపబడవలెనని కౌటిల్యుని యభిప్రాయము. "మంత్రిపరిషదం ద్వాదశామాత్యాని... ." మంత్రిపరిషత్తు

లో పంద్రెండుగురు అమాత్యులుండవలెనని మరియొకగ్రంథకర్త వ్రాసియున్నాడు. దశరథమహారాజుకడ ఎనమండుగురు మంత్రులుండిరనియు వారితో దశరథుడు సర్వలౌకికవ్యవహారములందును సలహాలను గైకొనుచుండెననియు రామాయణమువలన గ్రహింపగలుగుదుము. ధర్మరాజు పట్టాభిషేకానంతరమున సామ్రాజ్యపదస్థుడై అమాత్యులతో దైవమానుష చింతనంబు చేయుచుండెనని భారతమునకలదు భారతమందు శాంతిపర్వములో ధర్మనందనునికడ అష్టప్రధానులుండినట్లు వ్రాయబడినది. ధర్మరాజు భీమసేనుని యువరాజపదంబున నిలిపియుండెను. కర్తవ్యవిచారమునకును సంధి, విగ్రహము, యాన, ఆసన, ద్వైధీభావము సమాశ్రయము, అనుష్ఠానములను నడుపుటకు విదురుని నియోగించెను. సమయమును గుర్తెరింగి ఆదాయవ్యయములెరింగించుటకు సంజయుడు నియోగింపబడెను. సేనలకొలందులు గనుగొనుటకును భృత్యుల తగురీతిని పోషించుటకు నకులుడును, గర్వించుచు మదోన్మత్తతగలుగు వారి నణగద్రొక్కుటకును పరచక్రము లాక్రమించుటకు అర్జునుడు నియోగింపబడిరి. బ్రాహ్మణకార్యములకు శ్రౌతస్మార్తకృత్యములకు ధౌమ్యుడును రాజగృహమును గనిపెట్టుచు సర్వావస్థలయందును తనసమీపమునందే నిల్చునట్లు సహదేవుడును నాజ్ఞాపింపబడిరి ధర్మనందనుడు మరల విదుర సంజయులనాలోకించి పౌరులయొక్కయు జానపదులయొక్కయు యోగక్షేమములు తనకు నిరంతరము యెరింగించునట్లాజ్ఞాపించినాడు. అమాత్యులతో నాలోచనలుసలుపుచు ప్రజానురంజకముగా పరిపాలనముచేసియున్నట్లు భారతమే నిదర్శనము. భారతయుద్ధములో రథులు, అతిరథులు, మహారథులు మున్నగు సైనికోద్యోగులుగలరని భారతము ఋజువుచేయుచున్నది.

మౌర్యవంశస్థాపకుడైన చంద్రగుప్తునికాలమును పరికింతము. అతని ప్రధానమంత్రి కౌటిల్యుడే. సర్వలౌకికవ్యవహారస్వతంత్రుడై

కౌటిల్యుడు రాజ్యచక్రము నడుపుచుండెడివాడు. ప్రధానమంత్రిని అజాతశత్రువు అగ్రమహామంత్రియని పిలుచుచుండెనని చరిత్రవలన తెలియుచున్నది. చంద్రగుప్తునిరాజ్యమందు పదునెనిమిది శాఖలుండెననియు కన్పట్టుచున్నది. వానిలో కొన్నిటిని క్రింద పేర్కొనుచున్నాను.

మంత్రి నాయక (Generalisms)
పురోహిత పౌర
సేనాపతి వ్యవహారిక
యువరాజ కర్మాంతిక (in charge of mines and manufactures)
దౌవారిక (Lord Mayor of the Palace)
అంతర్వంశిక (Lord Chamberlain)
ప్రశస్త్రి (in charge of prisons)
సమాహర్త (for Revenue)
ప్రదేష్ట్రి
మంత్రిపరిషదధ్యక్ష
దండపాల (for the maintainance of the army)

గ్రీకురాయబారియయిన మెగాస్థనీస్ పాటలీపుత్రమును వర్ణించుచు, దాని పురపాలకసంఘమందు ముప్పదిసభ్యులుండిరనియు, యందులో మరల అయిదుగురు సభ్యులుగల ఉపసంఘము లారుండెననియు చెప్పియున్నాడు. మొదటియుపసంఘము నగరముయొక్క పారిశ్రామికవిషయములను జూచుననియు, రెండవది అన్యదేశీయులకు వలయు సౌకర్యములను చేకూర్చుచుండుననియు, మూడవది జనన మరణసంఖ్యలను తయారుచేయుననియు, నాల్గవది వర్తకపు వస్తువుల మీద పన్నులను వసూలుచేయుననియు, అయిదవది ప్రజలకుపయోగకరమగు ఆరామాది విశ్రాంతి బహిర్గంగస్థలములను కాపాడుననియు

యు, ఆరవది ధరలను నిర్ణయముచేసి కొలతలను తూనికలను సరిజూచుచుండుననియు యీవిధముగా పురపాలనమంతయు విపులముగా తనగ్రంథమందు వ్రాసియున్నాడుగదా! చంద్రగుప్తునికాలమందు యుద్ధసభయని మరియొక సంఘముగలదు. అందులోకూడ ముప్పది సభ్యులుగలరు.

యువరాజాదిమంత్రులకు సంవత్సరమునకు 48000 పణములు జీతముండెను. రెండవతరగతి మంత్రులకు 28000 పణములును, మూడవతరగతి మంత్రులకు 12000 పణములును వేతనముగా యివ్వబడుచుండెను.

బౌద్ధచక్రవర్తియగు అశోకవర్ధనునికాలము నాటికి వచ్చి చూతము. పాటలీపుత్రమును తాను స్వయముగనే పరిపాలించుచు తక్కిన రాష్ట్రములను రాజప్రతినిధుల నేర్పరచి యున్నాడు. పాంచాల, సింధు, కాశ్మీర, సింధునది కావలనుండు దేశములకు తక్షశిలానగరము రాజధానిగాయుండునట్లేర్పరచి, అందొక రాజప్రతినిధి (Viceroy) ని నియమించియుండెను. కళింగదేశాది ప్రాగ్దేశములకు తోసలిపట్టణము రాజధానిగాయుండునట్లుగ మరియొక రాజప్రతినిధి నియోగింపబడెను. మాళవ, ఘూర్జర, గేధియావారు రాజ్యములకు ఉజ్జయినినగరము రాజధానిగా యేర్పరచి, అందొక రాజప్రతినిధిని నియమించియున్నాడు. నర్మదానదికి దక్షిణముననుండు దేశములను పరిపాలించుటకు మరియొకప్రతినిధిని నియోగించెను. ఈ రాజప్రతినిధిని అశోకునికాలమున 'రాజూకు' డనుచుండెడివారు. రాజూకునిక్రింద 'ప్రాదేశికుడు' (Compared to on presetday District Magestrate) న్ను ప్రాదేశికునిక్రింద 'యుక్తుడు' 'ఉపయుక్తుడు' యను యుద్యోగియు లుండెడివారట. ఇట్లు తనసామ్రాజ్యమునంతను కొన్నిరాష్ట్రములక్రింద విభజించి అశోకుడు వాటిమీద యధికారము సాగించుచుండెడివాడని

చరిత్రకారులవలన తెలియవచ్చుచున్నది. అశోకుని సైన్యానిభాగమున నౌకాసేన, పదాతిసేన, అశ్వసేన, రథసేన, గజసేన మొదలగు నానాశాఖలు కాన్పించుచున్నవి. వీనిమూలమున రణసామగ్రులను బంపుట, రసనంగ్రహణము, వస్తుసంచయప్రేషణము మొదలగు కార్యములు నిర్వహింపబడుచుండెను.

రాష్ట్రాధిపతులు, మండలాధిపతులు, నగరపాలకులు మొదలగువారందరును చక్రవర్తిచే బౌద్ధధర్మమును వ్యాపింపచేయుటకు సభలు గావింపవలెనని ఆజ్ఞాపింపబడుచుండిరి. ఉద్యోగియులందరును రాజకీయవ్యవహారమందే గాక ప్రత్యేకముగా సంవత్సరములో కొద్ది దినములు ధర్మబోధ, ధర్మవ్యాప్తికొరకు పాటుపడుచుండవలెనని యాజ్ఞాపింపబడిరి. అశోకుడు ప్రత్యేకవేతనమిచ్చిధర్మమహామంత్రులను, స్థైర్యమహామంత్రులను, దేశదేశములను తిరిగిబౌద్ధధర్మసూత్రములను వెదచల్లున ట్లేర్పాటు చేసెను.

ప్రతిరాజప్రతినిధివద్ద మంత్రులుండెడివారు. అశోకునికాలములో తక్షశిలానగరమందుండు రాజప్రతినిధియొక్క మంత్రుల దుష్ప్రవర్తనలవలన పౌరజనులందరు తిరుగుబాటు చేసిరి. అశోకు డాసమయమున తనకుమారుడగు కునాలయనువానిని ప్రజలకు తిరుగుబాటు చేయకుండునట్లు చేయుటకు తక్షశిలానగరమునకంపియున్నాడు. పిమ్మట ప్రజలదోషము కాదని తెలిసి తక్షశిలానగరమంత్రులు ప్రతిమూడుసంవత్సరములకు మారుచుండవలెననియు, యితరరాజధానుల మంత్రులు ప్రతిఅయిదుసంవత్సరములకు మారుచుండవలెననియు యాజ్ఞాపించినట్లు చరిత్రవలన ద్యోతకమగుచున్నది.

పుష్పభూతివంశమందు జన్మించిన ప్రభాకరవర్ధనునకు యశోమతివలనపుట్టిన హర్షచక్రవర్తి రాజ్యమును పరిశీలింతము. శ్రీ హర్షునకు

పరమభట్టారక, మహారాజాధిరాజపరమేశ్వర, పరమదేవత యను బిరుదు నామములు గలవు. సామంతరాజులు మహారాజ, మహాసామంత, మహాప్రతీహార, మహాదండనాయక అను బిరుదునామములు పొందియుండిరి. శ్రీహర్షునకు మంత్రిపరిషత్తుగలదు. రాజ్యవర్ధనుడు చనిపోయినపిమ్మట హర్షవర్ధనుడు, మొదటిచంద్రగుప్తుడు సముద్రగుప్తునవలెనే మంత్రిపరిషత్తుచే నెన్నుకొనబడి సామ్రాజ్యపదస్థుడయ్యెను. భండి ప్రధానమంత్రిపదవినలంకరించియుండెను. మంత్రులున్ను తదితర యుద్యోగియులున్ను భూదానములుగా వేతనములు పొందుచుండెడివారు.

సామ్రాజ్యమంతయు కొన్ని రాష్ట్రములక్రిందను రాష్ట్రము భుక్తులక్రిందను, భుక్తులువిషయములక్రిందను, విషయములు కొన్ని గ్రామములక్రిందను విభజింపబడినవి. రాష్ట్రాధిపతులు రాజప్రతినిధులనియు, రాజస్థానీయులనియు పిలువబడుచుండెడివారు. భుక్తియొక్క అధిపతి గోప్త, భోజిక, భోగపతియనియు పిలువబడుచుండెను. విషయపతులు, కుమారామాత్యులు, (Councillors for a prince) అయుక్తకులు భోగపతిచే నియమింపబడుచుండిరి. ప్రభుత్వయుద్యోగియులందరు అయుక్తపురుషులనియు వినియుక్తకులనియు చెప్పబడుచుండెడివారట. విషయపతులు అధిష్టానము (towns) లలోనుండి వారిమండలమంతను పరిపాలించుచుండెడివారు. చక్రవర్తి యొక్క భూములలో నాల్గవవంతుభాగము ప్రభుత్వయుద్యోగియులకు వినియోగింపబడు చుండెను.

విషయపతికి సలహానిచ్చుటకు ఒకసభయుండెడిది. ఆసభలో నగరశ్రేష్ఠి, సార్థవాహ, ప్రథానకులిక, ప్రధానకాయస్థ, (Chief secretary) అను సభ్యులుండెడివారు. మహాప్రతిహార, ప్రతిహార, వినయసూరస్థపతి, శ్రీఅధ్యక్షమహామంత్ర, ప్రతినర్తక యనుఉన్నతో

ద్యోగియులుండిరి. శ్రీహర్షుడు అప్పుడప్పుడు స్వహస్తముతో వ్రాసి ఆజ్ఞలంపుచుండెడివాడని బంఖేరశాసనము (స్వహస్తో నామమహారాజాధిరాజశ్రీహర్షస్య) వలన తెలియుచున్నది. దూతయు, ఆజ్ఞపతులు మొదలగువారు శ్రీహర్షుని ఆజ్ఞలన్నిటిని (Orders) స్థానికప్రభుత్వమునకు గొనివచ్చెడివారని బాణుని హర్ష చరిత్రములో కన్పట్టుచున్నది. స్థానికప్రభుత్వములో మహామాత్రులు (Village elders) అష్టకులాధికరణులు, గ్రామికులు (Village headmen) సాల్కికులు, అగ్రహారికులు ధ్రువాధికరణులు (in charge of Revenue) భాండాగారాధికృతులు (Treasurers) తలవతికులు (Village accoutant) పుస్తకపాలురు లేక పుస్తకకృతులు, అక్షపటలికులు (Record keepers) అనుఉద్యోగస్థులు నియోగింపబడుచుండిరి. మహామహాక్షపటలుని యధికారము క్రింద అక్షపటల (Record office) యుండెడిది. కరణికులు (Documents) వ్రాయువారు లేఖకులనియు, ఈకరణములను సరిచూచు యుద్యోగులు కరణికుల (Registrars) నియు బిలువబడుచుండిరి. సైనికోద్యోగులలో మహాసేనాపతి, సేనాపతి మహాబలాధికృతుడు (Commander-in-chief) బలాధికృతుడు భటాశ్వపతి (పదాతిసైన్యములకు అధిపతి) కుతుకులు (Commanders of cavalry and elephantry) బృహదశ్వవారపతి గుఱ్ఱపుదండున కధిపతి (Head cavalry officer) మహాసంధివిగ్రహిక (Warofficer) సంధివిగ్రహిక మహాసర్వదండనాయక, సర్వదండనాయక, మహాదండనాయక యను వారు ముఖ్యులు శ్రీహర్షుని కాలమందు అవంతి అనువాతడు (Supreme minister of peace and war) సింహనాధుడు (సేనాపతి) కుతలుడు (Chief officer of Cavalry) స్కందగుప్తుడు (Chief officer of the elephant force) అనువారు గలరని రాధాకుముదముఖర్జీగారు హర్షునిగూర్చి వ్రాసినగ్రంథమందుగలదు. దండపాశికలు

Policemen వారిమీద అధికారము చలాయించుపతిపతులు, యామచేటికలు (Women watchers of the night) మొదలగువారుండినట్లుకూడ ఆగ్రంథమువలననే తెలియుచున్నది. శ్రీహర్షునికాలమందు రథగజతురగపదాతు లనుచతురంగబలముండెడిదని, తరచుయుద్ధమందు ఉపయోగింపబడుచుండెననికూడ తేటమగుచున్నది సిపాయీలు భూరూపముగాగాక ధనరూపముగా వేతనములు పొందుచుండెడివారు.

హర్ష చక్రవర్తికాలములో భూములుకొలిచి రాళ్ళుపాతుటకు పన్నులుగట్టుటకు నీటిప్రవసాయము గలుగజేయుటకు జనాభా లెక్కించుటకు ప్రత్యేకముగా యుద్యోగస్థులుండెడివారనుటకు బాణుడే సాక్ష్యము.

---

## అయిదవభాగము.

---

నాల్గవభాగములో ప్రాచీనభారతవర్ష మందలి రాజకీయోద్యోగీయులనుగూర్చి విపులముగా వివరించియుంటిని. ప్రస్తుతము పూర్వకాలమందలి న్యాయస్థానములను న్యాయపరిపాలననుగూర్చి తెలిసికొనుట ముఖ్యావసరమైయున్నది. పాపభూయిష్ఠమగు కృత్రిమనవనాగరికత యనువలలోదగుల్కొని భోగలాలసత్వమునకును, దాస్యమయాసక్తికిని దాసులై ఆధునికులుకొందరు పూజనీయులగుపూర్వులను నిందించుచు వారు న్యాయమననెట్టిదో యెరుగరనియు, న్యాయస్థానములు పూర్వమందు లేవనియు చెప్పుచుండుట వినుచున్నాము. విరిపలుకులు కేవలము అజ్ఞానజనకములనియే చెప్పవచ్చును. మను, యాజ్ఞవల్క్య, అంగీరస, అత్రి, అపస్తంబ, ఉశనస, కాత్యాయన, దక్ష, పరాశర, యమ, లిఖిత, విష్ణు, బృహస్పతి, వ్యాస, సాంఖ్య, సంవర్త, హారీత, గౌతమ, శాతాతప, వసిష్ఠ, నారద, విశ్వామిత్ర, శౌనక,

హిరణ్యాక్షుణి, నవస, కర్నపకక్షు, దేవళ, ప్రజాపతి, వృద్ధాదులు, స్మృత్యాదులనురచించి న్యాయసూత్రములను ప్రజలలో వ్యాపింప జేసి లోకప్రఖ్యాతిని పొందియుండిరి. రానురాను ఈమహర్షులయొక్క స్మృతిగ్రంథములమీద వ్యాఖ్యానములుగూడ బయలుదేరినవి. కుల్లూక, మేధాతిథులు మనుస్మృతిమీద వ్యాఖ్యానములువ్రాసిరి.

యాజ్ఞవల్క్యస్మృతిపై, విశ్వరూప, అపరార్క, విజ్ఞానేశ్వరులు ప్రసిద్ధవ్యాఖ్యాతలు. విజ్ఞానేశ్వరునిచే లిఖింపబడిన మితాక్షర యను వ్యాఖ్యానగ్రంథముపై మరల లక్ష్మీదేవియొక్క బాలంభట్ట, మదన పారిజాత, సుబోధని యనుగ్రంథములు వ్యాఖ్యాన గ్రంథములై యొప్పుచున్నవి. మితాక్షరగ్రంథము బంగాళాదేశమందు గాక తక్కిన భారతదేశమందంతట ప్రమాణగ్రంథముగా పరిగణింపబడుచున్నది. ద్రావిడదేశములో వాడుకలోనుండిన మాధవాచార్యుని మాధవీయము పరాశరస్మృతిమీద వ్యాఖ్యానగ్రంథము. జీమూతవాహనుని దయాభాగ, (తూర్పుబంగాళాదేశము) దేవానందభట్టుని స్మృతిచంద్రిక, ప్రతాపరుద్రదేవుని సరస్వతీవిలాసము, వరదరాజుని వ్యవహారనిర్ణయము, మాధవాయుని దయావిభాగ (మద్రాసు) నీలకంఠుని వ్యవహారమయూఖము, మిత్రమిశ్రుని వీరమిత్రోదయము (బొంబాయి) వాచస్పతిమిశ్రునివివాదచింతామణి, రత్నాకర, వివాదచంద్ర (మిథిల) కమలాకరుని నిర్ణయసింధు, కాశీనాథుని ధర్మసింధు అనంతదేవుని సంస్కారకౌస్తుభము, రఘునందనుని స్మృతితత్వము వివాదార్ణవసేతు, వివాదభంగర్ణవ, దత్తతకు సంబంధించు దత్తకచంద్రిక బంగాళా, దక్షిణదేశము) దత్తకమీమాంస (మిథిల, కాశీ) చంద్రేశ్వరుని అర్థశాస్త్రము, శుక్రనీతి మొదలగు గ్రంథములు పూర్వుల రాజనీతిని, వ్యవహారపరిష్కారమందలి నైపుణ్యమును, న్యాయపరిపాలనను వేనోళ్ల చాటుచుండ ధార్మికసాత్విక సంబంధములందు పర

మకిరాతకులగు మనము పూర్వులను నిందించుట హాస్యాస్పదమును, అవమానకరమునని వేరుగ వ్రాయుట యనవసరము.

స్మృతిగ్రంథములన్నిటిలో మనుస్మృతియే ప్రాచీనగ్రంథమని చరిత్రకారులు నిర్ణయించియున్నారు మనుస్మృతిలో చెప్పబడినట్లే మన మనుకాలమందు వ్యవహారములన్నియు న్యాయముగ పరిష్కరింపబడుచుండెనని చరిత్రవలన తెలియుచున్నది.

మనుస్మృతిలో అష్టాధ్యాయమందు రాజసభనుగూర్చియు, వ్యవహారనిర్ణయమునుగూర్చియు వివరింపబడినది ధర్మవేత్తలగు బ్రాహ్మణులతోకూడి రాజెచ్చట సభజేయునో అదియే రాజసభయని మనువుయొక్క అభిప్రాయము. శత్రురాజులవలన ప్రజలకు కలుగు బాధలను తొలగింపజేయుట, ప్రజలలో పరస్పరము ఋణాదానాది అష్టాదశవివాదులయందు వాదిప్రతివాదులయొక్క వాక్యములచే నిస్సందేహముగా కార్యమును నిర్ణయించుటయే వ్యవహారమని నిరూపింపబడినది. భూపాలుడు వినయవంతుడై సభను ప్రవేశించి సహాయము, సాధనోపాయము, దేశకాలవిభాగము, అనర్థప్రతీకారము, సిద్ధియనెడు పంచాంగములనుదెలిసిన మంత్రులతోను, ధర్మవేత్తలగు బ్రాహ్మణులతోను ఆలోచించి వ్యవహారనిర్ణయము జేయవలెనట. వాక్పారుష్యదండపారుష్యాభావమే వినయమని చెప్పబడినది. రాజు వ్యవహారనిర్ణయమున కసమర్థుడగునాడు ధర్మవిదులగు బ్రాహ్మణుల ముగ్గురనునియోగించి వారిచే వ్యవహారపరిష్కారము చేయించవలెను మంత్రులసభయందు పండితామాత్య, లేక ధర్మాధికరణ(Minister of Law) యనుసభ్యుడుండినట్లును లోకకల్యాణమునకుతోడ్పడు న్యాయచట్టములను నిర్మించుటయందు రాజును సహాయమొనరించుట యుతనివిధియనియు వెనుకటిభాగములో తెలిపియున్నాను.

బృహస్పతిస్మృతిలో యిట్లు కలదు:—

ప్రతిష్ఠితాఽప్రతిష్ఠితా ముద్రితా శాసితా తథా,
చతుర్విధా సభాప్రోక్తా సభ్యాశ్చైవ తథావిధాః.
ప్రతిష్ఠితా పురే గ్రామే చలా నామాప్రతిష్ఠితా,
ముద్రితాధ్యక్ష సంయుక్తా రాజయుక్తా చ శాసితా

ప్రతిష్ఠిత, అప్రతిష్ఠిత, ముద్రిత, శాసిత యని సభ నాలుగువిధములు పట్టణమందుగాని, గ్రామమందుగాని స్థాపితమైనది ప్రతిష్ఠితము. స్థిరముగానుండనిది అప్రతిష్ఠితము అధికారయుక్తమైనది ముద్రితము. రాజయుక్తమైనది శాసితము నారదస్మృతియం దిట్లు చెప్పబడినది.

కులానిశ్రేణయశ్చైవ గణాశ్చాధికృతోనృపః.
ప్రతిష్ఠావ్యవహారాణాం గురుభ్యస్తూత్తరోత్తరమ్.

కులసంఘములు, శ్రేణీసంఘములు (Corporations) గణములు (Village Assemblies) రాజుచే నియోగింపబడినది, రాజయుక్తమైనసభ, యివి న్యాయసభలనియు, కులముకంటె శ్రేణి, శ్రేణికంటె గణము, గణముకంటె రాజుచే నియోగింపబడినసభ, దానికంటె రాజసభ ఎక్కువఅధికారమును గలిగియున్నవని నారదుని అభిప్రాయము నారదస్మృతి గ్రంథముమీద వ్యాఖ్యానమురచించిన అసహాయు డిట్లు చెప్పియున్నాడు:—

గ్రామే దృష్టః పురే యాతి పురేదృష్టస్తురాజని,
రాజ్ఞాదృష్టః కుదృష్టో వా నాస్తిపౌనర్భవోవిధిః.

గ్రామసభాధికారియొక్క నిర్ణయము యసంతృప్తిగానుండు నెడల పౌరసభాధికారికి తెలుపుకొనవచ్చును. (appeal) పౌరసభాధికారితీర్పు బాగుండదని తోచినపక్షమున రాజసభకు తెలియజేయవలెను. యాజ్ఞవల్క్యమహర్షి యిట్లు నిశదీకరించియున్నాడు:—

నృపేణాధి కృతాః పూగాః శ్రేణయోథకులానిచ,
పూర్వం పూర్వం గురుజ్ఞేయం వ్యవహారవిధౌనృణామ్.

కులసంఘమే మొదటిన్యాయసభ. అందలిసభ్యులందరును బంధువులే. వారు స్వల్పవిషయములను పరిశీలించితీర్పు చెప్పుదురు. కులసంఘముకంటె ఎక్కువఅధికారము గలది శ్రేణిసంఘము. శ్రేణియనగా మితాక్షరగ్రంథములో నిట్లు వ్రాయబడినది:—'శ్రేణయో నానాజాతీనా మేకజాతీయకర్మోపజీవినాం సంఘాతాః' వివిధజాతులకు జెందినను ఏకవృత్తినియవలంబించుశిల్పు లనేక చిత్రకారులసంఘమునకు శ్రేణీసంఘమనిపేరు. శ్రేణికంటెను పైసంఘము 'పూగ.' మితాక్షరగ్రంథమందే యిట్లు 'పూగాః సమూహాః భిన్నజాతీనాం భిన్నవృత్తీనా మేకస్థాన నివాసినాం యథాగ్రామనగరాదయః' చెప్పబడినది. వివిధజాతులకుచెంది వివిధవృత్తుల నవలంబించుచు ఒకేగ్రామమందుగాని, ఒకేపట్టణమందుగాని నివసించుసభకు 'పూగసభ' యనిపేరు దీనివలన స్థానిక స్వపరిపాలనయందు పూగసభ ప్రాముఖ్యతవహించుచున్నదనియు, వివిధజాతులవారు వివిధవృత్తులవారు దీనిలో చేరియుండుటచేత శ్రేణిసంఘముకంటెను పెద్దదనియు తేలుచున్నది. క్రిందిన్యాయస్థానముయొక్క తీర్పు సంతృప్తికరముగా లేదని తోచి పైన్యాయస్థానమునకు అప్పీలు చేసినను తనవాదము వీగిపోయినయెడల క్రిందిన్యాయస్థానముచే వేయబడిన జుల్మానాకు రెట్టింపు అప్పీలుచేసినవాడు యిచ్చుకొనవలయునని నియమముగలదు. రాజుయొక్క తీర్పుతోనైనను సంతృప్తిపొందనియెడల వేరుమార్గము లేదు. రాజసభయే అన్నిసభలకంటెను పెద్దసభయై యొప్పుచుండెను.

శుక్రనీతియందు ఏవివాదమందైనను వివాదస్థలమునకు చెందిన మనుష్యులే న్యాయాధిపతులుగానుండుట మంచిదని వ్రాయబడినది. అరణ్యకులు అరణ్యకులవ్యవహారములు చేతను, వర్తకులు వర్తకులవ్యవహా

యము చేతను, సైనికులు సైనికుల సహాయము చేతను, గ్రామము మందు ఉభయపక్షముల వారిలోను తరుచు మెలగుచుండువారి సహాయము చేతను విచారింపబడవలెననికూడ కలదు.

శుక్రనీతి:—

అభియుక్తాశ్చయే తత్ర యన్నిబంధనియోజనాః,
తత్రత్యగుణాదోషాణాం త ఏవహి విచారకాః
ఆరణ్యాస్తు స్వకైః కుర్యుః సార్థికాః సార్థికైః సహ,
సైనికాః సైనికైరేవ గ్రామే ప్యుభయవాసిభిః

అడవిలో దిరుగువారిని అడవిలోను, సైనికులను కూడారమందును, వర్తకులను కారవాను బండియుందును విచారింపబడవలెనని బృహస్పతియభిప్రాయము. బృహస్పతిస్మృతియందిట్లు చెప్పబడినది:

కీనాశాః కారుకాః శిల్పి కుసీది శ్రేణినర్తకాః,
లింగినస్తస్కరాః కుర్యుః స్వేన ధర్మేణనిర్ణయమ్
తపస్వినాంతు కార్యాణి త్రైవిధ్యైరేవకారయేత్,
మాయాయోగ విదాంచైవ న స్వయం కోపకారణాత్.

వ్యవసాయదారులు, కార్మికులు, శిల్పులు, వడ్డీవ్యాపారము చేయువారు శ్రేణులు నర్తకులు (dancers) పాసుపతులు మొదలగు వారు దొంగలు (robbers) వారివారి వృత్తిధర్మములననుసరించి వివాదపరిష్కారము చేసికొనవలెను.

మునులయొక్కయు, మంత్రవేత్తలయొక్కయు వివాదములను త్రైవేదములతో పరిచయముగలవారు విచారించవలెననియు రాజు స్వయముగా విచారణచేయకూడదనియు బృహస్పతియొక్క అభిప్రాయము.

ఇక సాక్ష్యపద్ధతిని విచారింతము, స్వదేశమందుండు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు సాక్ష్యమివ్వదగినవారని మనువు తన

అష్టమాధ్యాయములో స్పష్టపరచియున్నాడు. సరిహద్దులవిషయమై కలుగు వివాదలలో సాక్షులు లేనినాడు సరిహద్దుగ్రామములరెంటియొక్క నాల్గువైపులనుండు వారిలో నలుగురుమనుష్యులు వివాదపరిష్కారము చేయవచ్చునట.

మనుస్మృతి:—

సాక్ష్యభావే తు చత్వారో గ్రామాః సామంతవాసినః,
సీమావినిర్ణయం కుర్యుః ప్రయతా రాజసన్నిధౌ.

పొలములయొక్కయు, నూతులయొక్కయు, చెరువులయొక్కయు, తోటలయొక్కయు, ఇండ్లయొక్కయు సరిహద్దుచిహ్నానిర్ణయము తత్ప్రాంతీయులసాక్ష్యముమీదనే ఆధారపడునని మనుస్మృతియందు లిఖించబడినది. అట్టిప్రాంతీయుల సాక్ష్యము లేనప్పుడు వివాదస్థలమునకు సమీపముగానుండు యరణ్యమందు వసించు వేటకాండ్రు, బోయవాండ్రు, గొల్లవాండ్రు, పల్లెవాండ్రు, పాములనుబట్టువారు మొదలగువారు సాక్ష్యమివ్వవచ్చునట. సాగుబడియగుభూమియొక్క సరిహద్దులతగాదాలలో సమీపగ్రామవాసులున్ను, వృద్ధులున్ను, గోవులను కాచువారున్ను, ఆపొలమును వ్యవసాయముచేయు రైతులున్ను వివాదపరిష్కారమునకుతోడ్పడి సరిహద్దును నిర్ణయించవలెనని యాజ్ఞవల్క్యమహర్షి చెప్పియున్నాడు. సమీపగ్రామస్థులు నలుగురుగాని, ఎనమండుగురుగాని, పదిమందిగాని కలసి సరిహద్దులను నిర్ణయించవలెను. కౌటిల్యుడుకూడ యించుమించుగా యిట్టియభిప్రాయమునే వెలిబుచ్చియున్నాడు. సమీపగ్రామవృద్ధులు వివాదమును పరిష్కరించి యుభయపక్షములవారికి తృప్తికరముగానుండునట్లు కార్యనిర్ణయము చేయవలెను. ఇట్టి న్యాయసభలో సగముకంటె ఎక్కువమందెట్లునిర్ణయింతురో అట్లే చెల్లుచుండునని కౌటిల్యుని యభిప్రాయము. స్మృతికర్తలందరు ప్రాంతవాసుల సాక్ష్యమే యధికముగా కార్య

నిర్ణయమునకు తోడ్పడవలెనని చెప్పుచున్నారు. వసిష్ఠుడు:—గృహ క్షేత్రవిరోధే సామంత ప్రత్యయః సామంత విరోధేపి లేఖ్యప్రత్యయః.' ఒక గృహమునుగురించిగాని, పొలమునుగురించిగాని కలహము సంభవించినపుడు తత్ప్రాంతవాసుల యభిప్రాయములమీద వ్యవహారనిర్ణయము ఆధారపడియుండునని వసిష్ఠుని యుద్దేశ్యమైయున్నది. దీనినే ఆంగ్ల భాషలో Jury systern అందురు.

మనుస్మృతియందిట్లు కన్పించుచున్నది:—

యథా నయత్యసృక్పాతై ర్మృగస్య మృగయుః పదమ్.
నయే త్తథానుమానేన ధర్మస్యనృపతిః పదమ్.
సత్యమర్థంచ సంపశ్యే దాత్మాన మథసాక్షిణః,
దేశం రూపంచ కాలంచ వ్యవహారవిధౌస్థితః.

(అష్టమాధ్యాయము.)

మృగయుడు పాదజాడలనుబట్టియు, రక్తజాడలను బట్టియు, మృగస్థానమును తెలిసికొన్నట్లు అనుమానము, యిష్టప్రమాణము (self proof) చేత రాజు న్యాయముయొక్క నిశ్చయమును గ్రహించవలెనట. సాక్షియొక్క దేశము, కాలము, రూపము మొదలగునవి గూడ నాలోచించి యథార్థనిర్ణయము చేయవలెను. ఏన్యాయాధిపతియైనను కలహమునకు కారణభూతుడుగాకుండ నుండవలెను. ఇతరులచే నివ్వబడిన ద్రవ్యాదిలంచములను పుచ్చుకొనకూడదను నియమముగూడకలదు. ధనాదిలోభము లేక కార్యము నుపేక్ష చేయగూడదు. ఇట్లు చేయున్యాయాధిపతి లోకప్రియుడని గణింపబడుచుండెను. రాజు వివిధజాతులయొక్కయు, వివిధవర్ణములయొక్కయు నియమములను, ధర్మములను గౌరవించి వాటిననుసరించి తీర్పుచెప్పుచుండవలెనని మనువులిఖించియున్నాడు.

ఉద్రేకపూరితులును, దురాగ్రహావివశులును నగువాదులు గాని, ప్రతివాదులుగాని, సాక్షులుగాని ఉద్దేశ్యపూర్వకముగానైనను, లేక పొరబాటుచేనైనను కఠినమైనమాటలు మాట్లాడిన న్యాయమూర్తియగు రాజు సహించుచుండవలెనట. ధర్మవిరుద్ధముగా తీర్పులను తీర్చగూడదనికూడ వ్రాయబడినది.

న్యాయమూర్తులు (Judges) సహాయులు (assessors) గాక యితరయుద్యోగులుకూడ యుండిరి. వారిలో లెక్కలువ్రాయువారు (accountants) లేఖకులు (scribes) ముఖ్యులు. ఈ లేఖకులు వ్యాకరణసూత్రములను, అకారాదినిఘంటువులను (lexicons శబ్దాభిధాన) పరిశీలించినవారై సత్ప్రవర్తనకలిగి, వివిధశాస్త్రములందు పరిజ్ఞానముకలిగియుండవలెనని వ్యవహారమయూఖమందు కన్పట్టుచున్నది. ఆలేఖకులు లెక్కలు వ్రాయువారు (accountants or auditors) వైశ్యులై యుండవలెనని కాత్యాయనుడు చెప్పుచున్నాడు. గణకుడు (accountant) జ్యోతిషశాస్త్రమందు పాండిత్యముకలిగి వేదముల నభ్యసించినవాడై యుండవలెననియు, లేఖకుడు సత్యనిరతుడై, ఆశ ఆగ్రహము లేనివాడై లంచములకుదూరుడై అక్షరములను ముత్యములవలె వ్రాయ నేర్పుగలవాడై విశేషమైన భాషాపరిచయము కలిగియుండవలెనని వ్యాసులవారు చెప్పినట్లు వీరమిత్రోదయమందుకలదు. ఈ యుద్యోగులుకాక న్యాయాధికారులకులోబడి, సాక్షులను, వాదిప్రతివాదులను పిలుచుట కొరకు నియమింపబడవలెనని బృహస్పతి యభిప్రాయము. ఇట్టివాడు శూద్రుడైయుండవలెనని వ్యాసుని యుద్దేశ్యము. ఇట్టిశూద్రుడు సాధ్యపాలుడని పిలువబడినాడు.

కౌటిల్యుని అర్థశాస్త్రమందు చోరుని, వ్యభిచారిని గ్రామమునుండి వెడలగొట్టునధికారము గ్రామాధిపతికే గలదని చెప్పబడినది.

II

ప్రాచీనభారతఖండమందలి దండనీతిని పరిశీలింతము. మనుస్మృతియందలి దండనీతి మనుకాలమందు వాడుకలోనున్నదని చెప్పవచ్చును శికలాంగునిగా జేయుట, హస్తమును ఛేదించుట, మొదలగు కఠినమైనదండన లుండినప్పటికి చిత్రవధమాత్రము కాన్పింపదు. మనుస్మృతియందు నవమాధ్యాయములో యిట్లు గలదు—

గురుతల్పే భగః కార్యః సురాపానే సురాధ్వజః,
స్తేయే చ శ్వపదం కార్యం బ్రహ్మహత్యే శిరః పుమాన్.

గురుదారను పొందినవానికి లలాటమందు తప్తలోహముచేత యోనిముద్ర వేయవలెను. సురాపాన మొనర్చినవానికి సురాధ్వజాకారముగా (తాడిచెట్టు) లలాటమందు ముద్ర వేయవలెను. సువర్ణాపహార మొనర్చిన వానికి తప్తలోహముచే లలాటమందు శునకపాద చిహ్న వేయవలెను. బ్రహ్మహత్యచేయువానికి తప్తలోహముచే లలాటమందు శిరోవిహీనమైన మొండెముచిహ్న వేయవలెను. నవమాధ్యాయమందే ౨౪౦ శ్లోక మిట్లున్నది—

ప్రాయశ్చిత్తం తు కుర్వాణాః సర్వవర్ణా యథోదితమ్,
నాంక్యా రాజ్ఞా లలాటే స్యుర్దాప్యాస్తూత్తమ సాహసమ్.

పైనిచెప్పబడిన మహాపాతకముల జేసినవారలకు తద్వర్ణమునకు దగినప్రాయశ్చిత్తమును జేసినయెడల తప్తలోహముచే పూర్వోక్తచిహ్నలు లిఖింపగూడదు. బ్రాహ్మణుడే యిట్టిమహాపాతకములు చేసినపక్షమున ప్రాయశ్చిత్తము చేసికొనినపిమ్మట సంఘమునుండి బహిష్కరింపబడక తనకు విధింపబడినజుల్మానాను చెల్లింపవలెనని కలదు. ఉద్దేశపూర్వకముగా జేసినయెడల ఆబ్రాహ్మణుని ధనధాన్యాదులనపహరించి అతనిని దేశమునుండి వెడలగొట్టవలెనట. క్రింది శ్లోకములో బ్రాహ్మణులుగాక క్షత్రియాదు లీమహాపాతకముల ను

ద్దేశపూర్వకముగా జేసినచో వారిని వధించవలెనని గలదు. మూలములో "ప్రవాసనమ్" అనిగలదు. వ్యాఖ్యలో 'ప్రవాపనమ్' వధ పర్యాయ మనియున్నది.

అష్టమాధ్యాయములో యిట్లు కాన్పించుచున్నది.

పరదారాభిదర్శేషు ప్రవృత్తాన్నౄన్మహీపతిః,
ఉద్వేజనకరై ర్దండై శ్ఛిన్నయిత్వా ప్రవాసయేత్.
పరస్త్రియం యోఽభివదే త్తీర్థేఽరణ్యే వనేఽపివా,
నదీనాం వాపి సంభేదే స సంగ్రహణమాప్నుయాత్.
ఉపచార క్రియా కేలిః స్పర్శోభూషణవాససామ్,
సహఖట్వాసనం చైవ సర్వం సంగ్రహణం స్మృతమ్.

పరదారా ప్రవృత్తులైన మనుష్యులకు ముక్కు, చెవులు కోయుట మొదలగు శిక్షలొనర్చి పరదేశములకు దోలి వేయవలెను. తీర్థములందు, అరణ్యమందు, నదీసంగమ స్థలములందు నిర్జనప్రదేశములందు, పరస్త్రీ నెవ్వడు సంభోగాభిలాషతో పలుకరించునో వానికి సంగ్రహణము (సహాప్రపణదండము) విధించవలెను పుష్పమాలికలు మైపూతము మొదలగువానిని బంపుట, పరిహాసాలింగనాదులొనర్చుట, వస్త్రాద్యలంకారస్పర్శ మొనర్చుట, ఒకేమంచముపై కూర్చుండుట, మొదలగు నేరములకు సహాప్రపణదండము విధించవలెనని మనువు యొక్క యభిప్రాయము. 371-వ శ్లోకములో ఏస్త్రీ తన పిత్రాది బంధువులు ప్రబలులు, ధనికులని గర్వించి భర్తను లక్ష్యము చేయదో, ఏస్త్రీ తానధికసౌందర్యవతి ననితలచి భర్తను లెక్క చేయదో, ఏస్త్రీ పరపురుషవాంఛచే భర్తను లక్ష్యము చేయదో ఆస్త్రీని విశేషజనసమూహములోనికి రప్పించి వేటకుక్కలచే పీకింపబడు (చంపింపబడు) శిక్ష వేయవలెను పురుషునికిదగ్ధమొనరింపబడు శిక్ష విధించవలెను. మరల వ్యభిచారమునకు శిక్ష 500 మొదలు 1000

వణములవరకు జుల్మానా చేయుటకూడ కలదని క్రిందిశ్లోకములవలన గ్రాహ్యమగుచు నిరపరాధియొక్క స్థితిని (Position or dignity) బట్టి శిక్ష మారుచుండును. సుగుణవతియగు బ్రాహ్మణస్త్రీతో వ్యభిచరించు సైనికుని ఎండుగడ్డిమీదగాని ఎండుపుల్లలమీదగాని పరుండబెట్టి జీవముండగనే దహింపబడుశిక్ష వేయవలెనట. పూర్వులు వ్యభిచారవృత్తి యెంతనీచమని, యెంతనీతిబాహ్యమని, యెంతదోషభూయిష్ఠమని తలచెడువారో ఆయాశిక్షలవలన తెలియబడుచున్నది.

హత్యకు మరలహత్యయే శిక్షగా నిర్ణయింపబడవలెనని అక్కడక్కడ కన్పడుచున్నది. స్వల్పధనమును దొంగిలించినయెడల జుల్మానా వేయవలెననియు, విశేషధనాపహారణమునకు హస్తమును ఛేదింపవలెననియుకలదు. దొంగిలింపబడిన ధనమును దాచినవారుకూడ పైన చెప్పబడిన శిక్షకే యర్హులగుదురనికూడ గలదు. శూద్రుడు చేసిన నేరము (దొంగతనము) నే బ్రాహ్మణుడు చేసినయెడల, శూద్రుడివ్వవలసినజుల్మానా కెనిమిదిరెట్లు యివ్వవలెనని నిర్ణయింపబడుచుండెను. రాజు, తనమీదనే యట్టిదోషమారోపింపబడి ఋజువైననాడు సామాన్యమానవుడిచ్చు జుల్మానాకన్న వేయిరెట్లధికముగా యివ్వవలెను.

రాజశాసనములను తారుమారుజేయుట, మంత్రులలో కలహమును బెంచుట, రాజుయొక్క శత్రువుల ననుసరించుట, బ్రహ్మహత్య, స్త్రీ హత్య, బాలహత్య మున్నగు నేరములకు సర్వసాధారణముగా మరణదండనే విధింపబడుచుండెను. రాజద్రోహులు, రాజధనాగారమును కొల్లగొట్టువారు రాజుయొక్క ఏనుగులుగాని గుఱ్ఱములుగాని యపహరించువారు, దొంగిలించుటకై దేవాలయమును ప్రవేశించువారు విశేషమైన కఠినశిక్షకు పాత్రులగుచుండిరి. తప్పుసాక్ష్యమిచ్చువారు జుల్మానా వేయబడి దేశమునుండి వెడలగొట్టబడుచుండిరి. ఒకపట్టణమును కొల్లగొట్టువారిని, రాజబాటయందు బందిపోటుజరు

పువారిని తరిమి వేయుటకు ప్రయత్నించువారలకు సహాయముజేయుక యూరకుండువారుకూడ శిక్షార్హులట. తస్కరుల నష్టదగులని వానిని పాలకులుగూడ శిక్షకుపాత్రులై యుండెడివారు. జూదమాడువారు ను జూదగృహాధికారులును దండింపబడుచుండిరి. గౌరవనష్టప్రకర ముచేయువారు శిక్షనుపొందవలసినదే. ప్రతిజ్ఞాభంగకరమును దుర్భాషలాడిన వర్ణభేదమునుబట్టి శిక్షలువిధింపబడుచుండెడివి. ఇరుగుపొరుగువారు నిజముగా కుష్ఠి, కుంటి వారైనను వారి ననవసరముగా కుష్ఠివారనియు, కుంటివారనియు నిందించిన రాజశిక్ష విధింపబడవలెను. బండ్లు తోలునపుడు మనుష్యుడుగాని జంతువుగాని బండిక్రిందబడి చనిపోవుపక్షమున బండితోలువాడు తగురీతిని శిక్షనుపొందవలసినవాడగుచుండెను రాజమార్గములను చెరచువానికి, చెరచినస్థలమును బాగుచేయుటయేగాక కొంతధనమును జుల్మానారూపమున చెల్లింపవలెనట అంతరంగిక వ్యవహారములో లంచమురూపమున ధనము గైకొను మంత్రులుగూడ తమయావదాస్థి కోల్పోవుచుండెడివారు. వైద్యులుకూడ యనుభవజ్ఞానము లేక రోగుల కధిక బాధను కలుగజేయునప్పుడు, 250 పణములు మొదలు 500 పణములవరకు జుల్మానావిధింపబడుచుండిరి. తల్లిదండ్రులను, కుమారుని, భార్యను విడిచి తనకు దోచినచోప్పున దిరుగువారికి 600 పణములజుల్మానా విధింపబడవలెనని గలదు మత్తుపదార్థములనమ్మువారు తక్షణమే పట్టణమునుండి తరిమి వేయబడుచుండిరి.

మౌర్యవంశస్థాపకుడైన చంద్రగుప్తునికాలమందుకూడ కఠిన శిక్షలు విధింపబడుచుండెడివి. వికలాంగునిగా జేయుట, హస్తమును ఛేదించుట, నేరస్థునితలగొరిగించుట, (shaving) దేశమునుండి తరిమి వేయుట మొదలగు దండనలు విధింపబడుచుండునట్లు తెలియుచున్నది. తప్పుసాక్ష్యమిచ్చినందులకు కఠినదండన యివ్వబడుచుండుట కల

ము. ¼ వెండిపణము మొదలు ½ వెండిపణమువరకు విలువగలవస్తువు దొంగిలించినయెడల నేరస్థునికి 1. ఆరుపణములజుల్మానాగాని 2. తలగొరిగించుటగాని 3. ప్రవాసనము (exile) శిక్ష వేయవలెనని కౌటిల్యుని అర్థశాస్త్రము చెప్పుచున్నది చిన్నదొంగతనమునకైనను విశేషమైన దండనవిధించుట వాడుకలోనుండెను. ఇట్టి శిక్షలువిధించుట నాగరికతయొక్క లక్షణములుగావని మన మూహింపవచ్చును కాని ఇట్టిశిక్షలు వేయబడునను భయముచేతనే నేరములు తరుచు జరుగుచుండుటలేదని చరిత్రకారులు వ్రాయుచున్నారు గ్రీకు రాయబారియైయున మెగాస్థనీసు, చంద్రగుప్తుని గుడారమందు 400000 మనుష్యులుండినను యేదినమందైనను 200 డాక్మాలు (eight pounds sterling) కంటె దొంగతనము ఎక్కువజరిగియుండలేదనియు, హిందువులు నీతిబద్ధులనియు వ్రాసియుండుట లోకవిదితము.

బౌద్ధచక్రవర్తియగు అశోకునిపరిపాలనయందు జంతుహింసచేసినవానికి కఠినశిక్ష వేయబడుచుండెను. మాంసము భక్షించువారు కూడ శిక్షకు పాత్రులగుచుండిరి. మరణదండన విధింపబడిన నేరస్థులకు మృత్యువును సమీపించుటకు మూడుదినములు గడువియ్యబడుచుండెను.

శ్రీహర్షునికాలమందు కారాగారమునకు పంపుట తరుచు కాన్పించుచున్నది. జుల్మానావేయుట మొదలగుశిక్షలు చిన్నచిన్ననేరములకు విధింపబడుచుండెను పెద్దనేరములుచేసినవారు ముక్కు, చెవులు, హస్తములు కాళ్ళుఛేదింపబడి వికలాంగులుగా చేయబడుచుండిరి. ఇట్టిశిక్షకు మారుగా దేశాంతరము పంపబడుట తరుచు కనబడుచున్నది.

దక్షిణభారతదేశమందు చోళరాజ్యములోని దండనీతిని కొద్దిగా పరిశీలింతము. ఒకచోళశాసనము (No 64 of 1900) లో యీ

ట్లున్నది. ఒకవ్యక్తిపొరబాటున తనగ్రామస్థుని బాణముచేఁగొట్టెను. అప్పుడు ఆమండలాధిపతియు ఆమండలవాసులును సమావేశమై అజాగ్రత్తచే నేరముచేయబడినదని నిర్ణయించి మరణదండన వేయఁగూడదనిరి. ఆగ్రామమందుండిన దేవాలయములో దీపారాధనకై నేరస్థుఁడు గ్రామసభకు పదునారుగోవులను సమర్పించుకొనవలెనని తెలియఁజేసిరి. పన్నుచెల్లించలేదని బాధపెట్టగా యొకస్త్రీ ఆత్మహత్యగావించుకొనుటచే పన్ను వసూలుచేయు నధికారి జుల్మానాశిక్ష వేయబడినట్లు No 80 of 1906 శాసనమువలన ద్యోతితమగుచున్నది. No 77 of 1900 No 223 of 1902, No 188 of 1906, Nos 257 and 352 of 1909, No 148 of 1906 చోళశాసనములన్నియు యిట్టి నేరములు యుద్దేశపూర్వకముగా గాక పొరబాటువశమున జేయబడినపుడు నేరస్థులు కొన్నిగోవులు, మేకలు, గొఱ్ఱెలు యిచ్చుకొనవలెనని యాజ్ఞాపింపబడుచుండిరి. (No 91 of 1906) చోళశాసనములోకూడ ఒకడు తనభార్యను త్రోయగా యామెపడిపోయి చనిపోయినందున యిట్టిదోషమునకు దేవాలయములో ఒకదీపము నిత్యము వెలుగుటకై కావలయుధనము యివ్వవలెనని నిర్ణయించినట్లు కనబడుచున్నది. ఇట్టిశిక్షలనుబట్టి చోళదేశమందు దండనీతిని మనము గ్రహింపగల్గుచున్నాము.

ఇంక ప్రాచీనభరతఖండమందలి ఆస్తిశిక్షకి (Civil Law) విచారింతము న్యాయస్థానమునకు పోక పూర్వము అప్పిచ్చినవాడు బాకీదారునివలన తనసొమ్మును రాబట్టుకొనుటకు కొన్నికొన్నిహద్దులకులోనైప్రయత్నముచేయవచ్చునని కలదు. ఈవాడుకిప్పటికిని సామంతరాజ్యములలో అక్కడక్కడ కానవచ్చుచున్నదని చరిత్రకారులు వ్రాయుచుండుట మనమెరుగుదుము బాకీదారుని ఒకగదిలోనుంచి భోజనమిడక ఒకటి రెండుదినములవరకు తాళమువేయుట మొదలగు

పనులు చేయుచుండెడివారట. ఋణమునిచ్చువాడు వడ్డీని యాశింప వచ్చును. అట్టి అసలువడ్డీ క్రమముగా వసూలుకానిపక్షమున న్యాయస్థానముద్వారా రాబట్టుకొనబడుచుండెను. వర్తకముకొరకుగాని సముద్రయానముకొరకుగాని ఋణము దీసికొన్నపుడు దానికి తగిన నియమములు గలవు. మోసముతో కూడిన ఒడంబడికలు (contracts) అన్యాయవృత్తులకొరకై ఒడంబడికలు చెల్లుచుండుట లేదు. యజమాని గ్రామాంతరముగాని దేశాంతరముగాని పోయినపుడు వానిబానిస లేక సేవకుడు యజమానియొక్క కుటుంబసంరక్షణకై చేయు ఋణమునకు యజమాని బాధ్యతవహించి తీర్చుకొనవలెను. వాగ్దానము చేసి మరల దానిని భంగమొనర్చు వర్తకుడు జల్మానాకు అర్హుడగుచుండెను. ఏవస్తువైనను విక్రయింపబడినపుడు, ఆవిక్రయము సరియైనదికాదని నిర్ణయించుకొనుటకు పార్టీలు పదిదినములలోపున తగిన ప్రయత్నములు జేకొనవలెను. గ్రామములయొక్క సరిహద్దులవిషయమై తగాదావచ్చినపుడు సాక్ష్యము సరియైనదికాదని తోచినప్పుడు రాజు తనయిష్టమువచ్చినట్లు నిర్ణయము చేయువచ్చునట

మనుకాలమందు ఆరువిధములవివాహములు శాస్త్రసమ్మతమై యుండెను. బ్రాహ్మణులు యిందులో నాల్గింటికి సమ్మతులైయుండెడివారు. క్షత్రియులు యుద్ధానంతరమున జయముసంభవించిన యెడల శత్రుపక్షమందలి స్త్రీనిగొనివచ్చి ఆమె యంగీకరించకపోయినను పెండ్లియాడుట తప్పుగా నిర్ణయింపబడుట లేదు. స్త్రీ పురుషులిద్దరకు ఒకరికొకరు పెండ్లియాడు కుతూహలముతోనుండిన మంత్రములుగాని పురోహితులుగాని లేకుండా పెండ్లియాడిన దోషముగా పరిగణింపబడుట లేదు దీనినే గాంధర్వవివాహమందురు. రెండువిధములవివాహము న్యాయబద్ధమని యంగీకరింపబడుట లేదు. మొదటిది కన్యయొక్క తండ్రి వరునిచే ధనముగైకొని వివాహము చేయుట. రెండవది మత్తుకలుగజే

యు పదార్థమును దీసికొని స్మృతిదప్పి వివాహమునకిష్టపడక యుండు స్త్రీని బెండ్లియాడుట. అగ్రవర్ణమునకు జెందినవాడు తక్కువస్త్రీని పెండ్లియాడవచ్చునుగాని అగ్రవర్ణస్త్రీని తక్కువవర్ణమునకు చెందిన వాడు పెండ్లియాడగూడదని నియమముగలదు. జాత్యంతరవివాహములుగాని, సగోత్రమునకు చెందినవారినిగాని వివాహమాడకూడదు. వివాహము విచ్ఛేదింపబడక భార్యాభర్తలిద్దరు పరస్పరానురాగముతో కూడియుండవలెను. ప్రథమభార్య చనిపోయినప్పుడు రెండవ భార్యను పెండ్లియాడవచ్చును. ఎనిమిదిసంవత్సరములలో పుత్రసంతానము కలుగనిపక్షమున భర్త మఱియొక స్త్రీని బెండ్లియాడుట దోషభూయిష్టముగాదని మనువుయొక్క యభిప్రాయము. త్రాగుబోతులై, నీతిబాహ్యములగుమార్గముల ద్రొక్కు భార్యను విడిచి మఱియొక స్త్రీని పెండ్లియాడుట న్యాయసమ్మతమైయుండెను. భార్య భర్తను విడిచి ఒక సంవత్సరము వేరుగాయుండినపక్షమున భర్త యామెను విడిచివేయావచ్చునట. మనుస్మృతియందు తండ్రియొక్క ఆస్తిపయిని వారసత్వపుహక్కు అనేకమందికియున్నట్లు చెప్పబడినది. కాని రానురాను బయలుదేరినస్మృతులలో యిట్టిహక్కు ఒక్క కన్నకుమారునికిని లేదా దత్తపుత్రునికిని గలదని చెప్పబడినది. దత్తపుత్రుడు తనజనకతండ్రియాస్తిలో భాగమును స్వీకరించునధికారమును పొందియుండలేదు. తాను దత్తతయయినపిమ్మట దత్తతతండ్రికి కుమారులుజన్మించిన అతనియాస్తిలో ఆరవభాగమునకుహక్కుగలిగియుండెను. కొడుకులు లేనిపక్షమున తమ్మునికొడుకులను బెంచుకొనవచ్చును. కొడుకులుగాని, మనుమలుగాని దత్తపుత్రులుగాని సోదరునికొడుకులుగాని లేనిపక్షమున ఆస్తికి తల్లిదండ్రులధికారులగుదురు. వారులేనిపక్షమున సోదరులు, తాత, తండ్రి తల్లియు నధికారులు. వారును లేనినాడు ఒకే ఋషిసంతతివారు ఆస్తిని పొందుదురు. వారును లేనినాడు గురువు

గాని, సహాధ్యాయునుగాని, శిష్యునుగాని పొందుహక్కుగలవారు. వారును లేనిసమయమున బ్రాహ్మణులకు చెందవలెను. చనిపోయిన వాడు బ్రాహ్మణేతరుడైనయెడల రాజుకు చెందవలెనట.

తండ్రి తానుజీవించియుండగనే కుమారులకు ఆస్తి పంచిపెట్ట వచ్చును కాని వీల్లువ్రాయగూడదను నియమముగలదు. తండ్రి చని పోయినతరువాత సమిష్టికుటుంబముగానుండునంతకాలము జ్యేష్ఠుడు ఆస్తిని వశపరచుకొని కుటుంబసంరక్షణ చేయవలెను.

మనుస్మృతిలో తొమ్మిదవఅధ్యాయమందిట్లు చెప్పబడినది:-

యత్కించిత్పితరిప్రేతే ధనం జ్యేష్ఠో ధిగచ్ఛతి,
భాగోయవీయసాం తత్రయది విద్యాను పాలితః.
అవిద్యానాంతు సర్వేషా మీహాతశ్చేద్ధనంభవేత్,
సమస్త్రతభాగః స్యా దపిత్ర్యఇతి ధారణా.

వేరువేరు మార్గములచే సంపాదించు ధనమునుగూడ కుమారులు సమిష్టికుటుంబమునకు పెట్టవలెనని మనువు చెప్పుచున్నాడు. విడిపోవునప్పుడు పెద్దకుమారునకు సగము (1/2) భాగమును, కనిష్ఠకుమారునకు (1/8) ఎనిమిదవభాగమును, మధ్యవారలకు (1/4) నాల్గవభాగమునుపొంది మిగిలినయాస్తిని అందరు సమముగా పంచుకొనుచుండెడివారు. పెండ్లికాని పిల్లలు పిత్రియపుఆస్తిలో భాగస్తులు కారు కాని మాతామహార్జితమగు యాస్తిలో భాగముపొందుయధికారము గలిగియుండెడివారు. బ్రాహ్మణస్త్రీచే కల్గినపుత్రుడు నాల్గు భాగములు, క్షత్రియస్త్రీచే కల్గినపుత్రుడు మూడుభాగములు, వైశ్యస్త్రీచే కల్గినపుత్రుడు రెండుభాగములు, శూద్రస్త్రీచే కల్గినపుత్రుడు ఒకభాగమును పొందవలెనని నియమముగలదు. గ్రుడ్డి, కుంటి, మూగ, చెవుడు, పిచ్చివారు, నపుంసకులు వారసత్వపుహక్కుకలిగి యుండరాదని మనువుయొక్క యుద్దేశ్యమైయున్నది.

## ఆరవ భాగము

ప్రాచీనభారతఖండమందలి స్థానికసంస్థలు పూర్వుల ప్రజాపరిపాలనసూత్రమును, స్వయంనిర్ణయసూత్రమును వెల్లడిచేయుచున్నవి. ఈస్థానికస్వపరిపాలనసంస్థలమీదనే ప్రజాబాహుళ్యముయొక్క కష్టసుఖములు విశేషముగా నాధారపడియుండెను. గ్రామమే భారతదేశముయొక్క ప్రాణము. విదేశస్థులు ఒకరితరువాతనొకరు మనదేశముపై దండెత్తివచ్చినను ఎన్నెన్ని మత, రాజకీయ ప్లవములు భీకరాకృతిని దాల్చి దేశమునంతటిని తారుమారుచేయ ప్రయత్నించినను, గ్రామముమాత్రము చలనములేక తనజీవితమందు మార్పుజెందక, దేశకట్టుబాట్లను వేనోళ్ళ చాటుచున్నది. ఈసంగతినే సర్: జార్జి బర్డువుడ్ (sir George Bird wood) గారు మృదుమధురశైలితో వ్రాసియుండిరి.

'India has undergone more religious and political revolutions than any other country in the world but the village Communities remain in full Municipal vigor all over the Peninsula'

సర్: చార్లెస్ మెట్కాఫ్ (Sir Charles Metcalfe) గారి యభిప్రాయము 'The village Communities are little republics having nearly every thing they can want within themselves and almost independent of foreign relations.'

ఈస్థానికసంస్థలవిషయమై పరిశోధనలుసల్పుటకు రెండే ఆధారములు 1. గ్రంథములు, 2. శాసనములు. ఈయాధారములనుబట్టి విచారింపగా ఈసంస్థలు పారిశ్రామిక, వాణిజ్య, రాజకీయ, సాంఘిక (including civic educational and religious) విషయములందు ప్రా

ముఖ్యతవహించి పాటుబడుచుండినట్లు ద్యోతితమగుచున్నది. ఈసంస్థలు కుల, గణ, జాతి, పూగ, వ్రాత, శ్రేణి, సంఘ, నైగమ, సమూహ, సమూహానముత్థాన, పరిషత్తు, చరణ యను వేరు వేరు పేర్లచే వేరు వేరు స్థలములలో పిలువబడుచుండినట్లు చరిత్రవలన గ్రహింపగలుగుచున్నాము. మను, నారద, బృహస్పతి, యాజ్ఞవల్క్య, కౌటిల్య, పాణిని, మేధాతిథి, గోవిందరాజ, నందన మొదలగువారు వారివారిగ్రంథములలో వైశబ్దమును వాడియున్నారు.

మనువు—

జాతి జానపదాః ధర్మాన్ శ్రేణీ ధర్మాంశ్చ ధర్మవిత్,

మేధాతిథి —

ఏక కార్యాపన్నా వణిక్కారు కుసీద చాతుర్విద్యాదయః

ఏకవృత్తినవలంబించు వర్తకుల, కార్మికుల, వడ్డీవ్యాపారస్థుల, చతుర్వేదులగు బ్రాహ్మణులసంఘమే శ్రేణి యనబడుచున్నది.

పాణినిచే ప్రయోగింపబడిన 'శ్రేణీ'శబ్దమిట్లు వ్యాఖ్యానము చేయబడినది. 'ఏకేన శిల్పేన పణ్యేనవా యే జీవన్తి తేషాం సమూహాః శ్రేణిః'

మితాక్షరః —

శ్రేణయో నానాజాతీనా మేకజాతీయకర్మోపజీవినాం సంఘాతః.

వివిధజాతులకు చెందినను ఏకవృత్తి నవలంబించుసంఘమును శ్రేణియందురు. 'శ్రేణీ' సంఘమునకు సైనికవృత్తిగూడ జేర్చుచు వ్యవసాయ, వర్తక, సైనికవృత్తులనవలంబించు కాంభోజ, సురాష్ట్ర, క్షత్రియులు 'శ్రేణులని' కౌటిల్యుని యర్థశాస్త్రమందు కనబడుచున్నది.

'కుల'మన జ్ఞాతిసమూహము, బంధుసమూహము, మిత్రసమూహమనుటకు మితాక్షరగ్రంథమే సాక్ష్యము. గోవిందరాజ, కుల్లూకభట్టాచార్య, మను, నారదులు 'గణ' శబ్దమునకు బ్రాహ్మణసంఘమని అర్థము చెప్పియున్నారు. మహాభారతమందు గణమొక రాజకీయస్వపరిపాలనాసంస్థయని వాడబడినట్లు తెలియుచున్నది. యౌధేయుల నాణెములమీద 'యౌధేయగణస్య' యనియు, కుమారగుప్తుని మందసర్ శాసనమందు 'మాలవ గణ-స్థితి' యనియు కన్పట్టుచున్నది.

మితాక్షర.—

పూగాః సమూహాః భిన్నజాతీనాం భిన్నవృత్తీనా
మేకస్థాన నివాసినాం యథాగ్రామ నగరాదయః॥

వివిధజాతులకు చెందినను, వివిధవృత్తుల నవలంబించినను ఏకస్థానమందు (గ్రామము లేక నగరము) నివసించు సంఘమునకే 'పూగ' యని పేరు.

'నానాజాతీయ అనియతవృత్తయోర్థ కామప్రధానాః సంఘాః పూగాః' అనేకజాతులకు చెందుచు నియతవృత్తులు లేక అర్థకామప్రధానులుగానుండు సంఘమునకే 'పూగ' యని పేరట. వివిధజాతుల వారు వివిధవృత్తుల నవలంబించుచు శరీరపరిశ్రమచేతనో, లేక ద్రావ్యసంపాదనమార్గముల చేతనో జీవనముగడపు సంఘమును 'వ్రాత' యందురు.

పైని పేర్కొనబడినసంఘములకధిపతిని 'శ్రేష్ఠి' యనియు 'సేనిపముఖ' యనియు 'జెట్ఠక' యనియు పిలుచుచుండెడివారు. బౌద్ధజాతకములలో సెనిపముఖ, నియ్యామకజెట్ఠకో (leaders of mariners) మాలకారజెట్ఠకస్స (leaders of garland makers) సత్థవాహజెట్ఠకో (merchant leaders, Caravanchief) మొదలగునామములు కనబడుచున్నవి. గౌతమబుద్ధునకు బహుమానరూపమున జీవ

నమునిచ్చిన అనాథపిండికుడు మహాశ్రేష్ఠి యని పిలువబడెను. ఈఅధిపతులకు (Presidents) ను ఆమండలమునుగాని, దేశమునుగాని పరిపాలించు రాజునకును రాజకీయసంబంధముండెడిది

ప్రాచీనభరతవర్షమందు వర్తకసంఘములు, వ్యవసాయదారులసంఘములు, శిల్పులసంఘములు, బ్రాహ్మణసంఘములు, సైనికసంఘములు, నటకుల, గాయకులసంఘము లుండినట్లు గ్రంథములే ప్రమాణము. ఉత్తరహిందూస్థానములో యీక్రింద బేర్కొనబడిన సంఘములుగలవని శాసనములవలన గోచరమగుచున్నది

1 నేతగాండ్రు, 2. పట్టునేతగాండ్రు, 3. తైలికులు, (Oilmen) 4. తిలపిశకులు, (Oil-millers,) కుమ్మరవాండ్రు, 6. కంచరవాండ్రు, 7. వెదుళ్ళపనిచేయువారు, 8. దంతపుపనివారు, 9 గొల్లలు, 10. యంత్రకారులు (ఉదయంత్రికులు)

చిత్రకారులసంఘములలో మరల ఉపసంఘములు గలవు.

1. బంగారపుపనివారు, 2. వెండిపనివారు, 3 తగరము మొదలుగాగల యితరలోహములతో పనిచేయువారు, 4. వజ్రకారులు, 5. సంస్కర్తలు (stone-dressers,) 6. తోళ్ళపనివారు.

ఈసంఘములలో జేరుటకు అర్హతలున్నవి. వర్తకసంఘములో జేరుటకు currency, Accountancy (గణనము) జ్ఞానము ముఖ్యము. వ్యవసాయసంఘములో జేరుటకు గణనజ్ఞాన మవసరము, శిల్పులసంఘములో జేరుటకు ఆయాకళల కవశ్యకమగుప్రవీణతను కలిగియుండవలెను. పాండిత్యము, సత్యము, న్యాయము బ్రాహ్మణసంఘములో ప్రవేశించుట కర్హతలు. శరీరదారుఢ్యము సైనికసంఘప్రవేశమునకు ముఖ్యార్హతయై యున్నది. మంచివంశమందు జన్మించుట, అనుభవ, అభ్యాసప్రాప్తమైనశక్తి, అన్నిసంఘములకు ముఖ్యము. రోగపీడితులు, సంఘాభివృద్ధికి ధనసహాయము నుపాయమునను జేయలేనివారు

సభ్యులు కానేరరు. ఏసభ్యుడైనను అన్యాయముగా ప్రవర్తించినట్లు ఋజువయినపక్షమున సంఘమునుండి బహిష్కరింపబడుటయేగాక సంవత్సరాంతమున లాభములో భాగస్థుడు కానేరడు.

ఈసంఘములు ధర్మశాస్త్రములకు విరుద్ధముగాని నియమములచే పాలింపబడుచుండెను. రాజు దేశధర్మములను, కులధర్మములను, జాతిధర్మములను, శ్రేణీధర్మములను పాటించుచు తనధర్మమును నిర్వర్తించుకొనుచుండవలెను. దేశధర్మములనగా కురు, కాపిశ, కాశ్మీరాది దేశములయొక్క ధర్మములని మేధాతిథి వ్రాసియున్నాడు. శ్రుతిప్రమాణములేనినాడు దేశ, జాతి, కులధర్మములు నిర్వర్తింపబడవచ్చునని వసిష్ఠునివాక్యమైయున్నది. (దేశధర్మ జాతిధర్మ కులధర్మాన్ శ్రుత్యభావా దబ్రవీన్మనుః) యాజ్ఞవల్క్యస్మృతియందు ప్రథమాధ్యాయములో యిట్లున్నది. "కులానిజాతీః శ్రేణీశ్చ గణాన్ జనపదాంస్తథా, స్వధర్మ చరితాన్ రాజా వినీయ స్థాపయేత్పథి." కులములుగాని, జాతులుగాని, శ్రేణులుగాని, గణములుగాని, జానపదులుగాని వారివారిధర్మములను తప్పి నడచిన, రాజు వారిని మరలించి ధర్మమార్గమునకు దీసికొనిరావలెను.

నారదస్మృతిలో దశమాధ్యాయమం దిట్లు కనబడుచున్నది.

"పాషండ నైగమ శ్రేణీ పూగావ్రాతగణాదిషు,
సంరక్షేత్సమయంరాజా దుర్గేజనపదేతథా."

రాజు దుర్గమందును, బహిర్దేశమందునుగల పాషండ, నైగమ శ్రేణీ, పూగ, వ్రాత, గణములయొక్క ఆచారములను (usages) మన్నించవలెను. ఇందలి సమయ అనుపదమునకర్థము సంఘనియమములే "(పాషండ నైగమాదీనాం స్థితిః సమయఉచ్యతే" నారదః) వీనిని బట్టి స్వపరిపాలనాసంస్థలలో నియమములుండినట్లును, అవి ధర్మబద్ధ

ములై భూపాలునిచే మన్నింపబడుచుండినట్లును గ్రహించుచున్నాము గదా?

ప్రాచీనస్వపరిపాలనా సంస్థలు మన మాంగ్లభాషలో వ్యవహరించు Public works departments ను కలిగియుండెడివి. వాటిని సమూహము లందురు- ఈసమూహములు చేయు పనులు,—

1. సభామండపములు, 2, దేవాలయములు, 3. చెరువులు, 4. ఆరామములు, 5. ప్రయాణికులకొరకై శాలలు, 6, పూజాగృహములు, 7. నీటిపారుదలకువలయు సౌకర్యములు, 8 కాటకము మొదలగునవి సంభవించినప్పుడు బీదలకు సహాయము, 9. బీదలు చనిపోయినప్పుడు వారికి దహనసంస్కారములుచేయుట 10 మతాచార్యులకుసహాయము, 11. దీనఅనాథులకు సహాయము, 12 వృద్ధ, కుంటి, రోగపీడితులకు సహాయము.

బృహస్పతివాక్యము.—

సభాప్రపాదేవ గృహతడాకా రామసంస్కృతిః,
తథానాథ దరిద్రాణాం సంస్కారో యజనక్రియా,
కులాయన నిరోధశ్చ కార్యమస్మాభిరంశతః,
అత్రైతల్లిఖితం సమ్యక్ ధర్మ్యా సా సమయక్రియా.

నీటిపారుదలకొరకై (irrigaticn) చెరువులు, కాలువలు త్రవ్వబడుచుండెడివని పైన చెప్పియుంటిని. వీటిలో ప్రయాణము చేయుటకు నావలుగూడ సప్లయి చేయబడుచుండినట్లు చెప్పబడుచున్నది. ఉత్తరమల్లూరులోనున్న వయిరమేగ తటాకము ఆగ్రామసభ చేతనే త్రవ్వించబడినది. ఏగ్రామవాసుడైనను తాను చెలించవలసినకప్పమును చెల్లించకపోయినయెడల నాని భూమియంతయు వేలము వేయబడి, వచ్చుధనమును తటాకముకొరకు వ్యయపరుపబడవలెనను నియమముగలదు భూమి వేలము వేయబడుటేగాక అతడు గ్రామకంటకు

డుగా పరిగణింపబడును. తటాకములు త్రవ్వించుటలోగాని, వాటిలో నుండి నాచు మట్టిని తీసివేయుటలోగాని, ప్రత్యేకవ్యక్తులు బంగారమురూపమునను, భూరూపమునను సహాయము చేయుట శాసనములమూలమున చూచుచున్నాము. మొదటిపరాంతకుని శాసనము బ్రాహ్మణపోషణార్థమై ఒక రాజకీయోద్యోగియనిచే యియ్యబడిన బంగారమును కావేరిపాక్ గ్రామసభవారు ఆగ్రామతటాకమును బాగుచేయుటకు ఖర్చుపెట్టినట్లు కనబడుచున్నది.

షిమోగజిల్లాలోని తాళగుండసరస్సు, కోలారుమండలములోని చికబల్పూర్ తటాకము, మైసూరుమండలములోని సింధువల్లి తటాకము ప్రాచీనుల నీటిసప్లయివిషయములో గల ప్రవీణతను వెల్లడిచేయుచున్నవి. స్థానికపరిపాలనాధికారులు Tank-supervision-Committee లను, Garden Supervision Committee లను నియమించి ప్రజలసౌభాగ్యమునకు తోడ్పడుచుండెడివారు.

వర్తకసంఘములనుగూర్చి శాసనములమూలమున దెలియునంతవరకు ముచ్చటింతము. రాజరాజ 1 కాలములోని వీరలూరుశాసనము (No 349 of 1912) నానాదేశీవర్తకసంఘమునుగూర్చి తెలుపుచున్నది. బేనకొండశాసనమువలన నాడు, నగర, నానాదేశిసంఘములు 1500 ప్రతినిధులతో సిరిఃల్లిలో సమావేశమై సిరిఃల్లిని నానాదేశీయ దశమది ఎరివీరపట్టణమని ప్రకటించుటకును ఆపట్టణమునకు వలయుసౌకర్యములు కలుగజేయుటకును నిర్ణయించిరి. ఈ నానాదేశీయులు మయిలాపురమందు సమావేశమై కాటూరుపట్టణమును వీరపట్టణము క్రిందమార్చవలెనని నిర్ణయించి కొన్నినిబంధనలు చేసిరి. అప్పర్ బర్మా (Upper Burma) లోని పాగన్ పట్టణమందలి వైష్ణవదేవాలయము నానాదేశీవర్తకసంఘముచే కట్టబడినట్లు తేలుచున్నది. ఖలిగాదిా శాసనము, యీసంఘమువారందరు వీరులనియు,

కృతయుగమారంభమునుండియు దేశదేశములనుదిరుగుచు, గుఱ్ఱము
ల, ఏనుగుల, మణుల, వాసనద్రవ్యముల వర్తకము చేయుచుండినట్లు
స్పష్టపరుచుచున్నది. జతావర్మయను వీరపాండ్యుని కాలమునాటి
శాసనమొకటి, ఒకవర్తకసంఘము ఒకదేవాలయమరమ్మత్తుకొరకై
వారి రాబడిని ఖర్చుపెట్టుటనుగూర్చి నిర్ణయించుటకు సభచేసినట్లు
ఋజువుచేయుచున్నది.

పైనిచెప్పబడిన సంఘములేగాక యింకను యితరసంఘము
లనేకము లుండినట్లు కనబడుచున్నది.

1. చిత్రైకార్కారులసంఘము. వీరి అధికారముక్రిందొకదేవాల
యముండినట్లును, ఆదేవాలయమునకుచెందిన గ్రామములు, ఆస్తిమొ
దలగువాటిని రక్షించుచుండినట్లును తెలియుచున్నది.

2. ఇదంగైసంఘము. ఇందులో 98 ఉపజాతులున్నవట వీరు
కులోత్తుంగచోళు (111) ని కాలములో ఒకసభచేసి కొన్నితీర్మాన
ముల నామోదించిరి.

3. వాలంగైసంఘము.

4. పల్లీలసంఘము. వీరు, ద్వారసముద్రునిచే గొనిపోబడు
చున్న దేవవిగ్రహములను 63 నాయన్మారుల (devotees) విగ్రహము
లను అడ్డపెట్టి రక్షించిరి.

5. అయ్యపాలీలసంఘము:—500 సభ్యులు.

6 కుబేరవంశమునకుచెందిన వైశ్యులు:—శివభక్తులు, విష్ణు
భక్తులు. దేవాలయములుకట్టుట, చెరువులు, నూతులు, త్రవ్వించుట,
చలిపందిరులు నిర్మించుట, ఉద్యానవనములు నిర్మించుట, కవీశ్వరు
లనురావించి గౌరవించుట మొదలగు పనులెన్నియో వీరిచే చేయ
బడుచుండెనట.

7. కుబేరవంశస్థులైన దేశవర్తకులసంఘము. దీనులకు, అనాథులకు అన్నదానము చేయుటే వీరి ముఖ్యాశయము. దేశీశ్వరాలయమునకు గొప్పధన, వస్తుసహాయము చేసిరి.

8 నాగికులసంఘము. వీరినిగురించి కాకతీయవంశస్థుడైన గణపతిదేవమహారాజు కాలమునాటి శాసనము చెప్పుచున్నది.

ఈసంఘములన్నియు ఒక చిన్నఉపసంఘముచే పాలింపబడును. ఆసంఘములో 2 మొదలు 5 వరకు సభ్యులుండినట్లు బృహస్పతిస్మృతియే సాక్ష్యము. వీరు సత్యవాదులును, వేదవిదులును, మంచికులమందుద్భవించినవారునై యుండిరి.

శుచయో వేదధర్మజ్ఞాదక్షా దాన్తాః కులోద్భవాః,
సర్వకార్యే ప్రవీణాశ్చ కర్తవ్యాశ్చ మహోత్తమః.

ఈసభ్యులు సమూహహితవాదులనియు, కార్యచింతకులనియు చెప్పబడినది వీరు మతధర్మములన్నియు దెలిసికొని పవిత్రమైనచరిత్రగలవారె, ఆశాపీడితులుగాకయుండెడివారు. వీరిని సంఘమువారందరు గౌరవించుచుందురు వీరిలో వివాదలు సంభవించినప్పుడు రాజు వాటిని తగురీతిని పరిష్కరించుచుండును ఏసంఘసభ్యుడైనను నేరము చేసిన, వానిని శిక్షించునధికారము యీఉపసంఘమువారిదై యుండెను.

సంఘబహిష్కారమే గొప్పశిక్షగా పరిగణింపబడుచుండెను. ఈ విషయమునుగురించి Sir Henry Maine గారిట్లు వివరించిరి. 'in the almost inconceivable case of disobedience to the award of the Village Council the sole punishment or the sole certain punishment would appear to be universal disapprobation' గ్రామద్రోహులుకూడ రాజద్రోహులవలెనే శిక్షింపబడుచుండిరి. ఈసంఘములలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ప్రాతినిధ్యము వహించుచుండిరి.

బ్రాహ్మణోపసంఘములను పరిషత్తులనెడివారు. పరిషత్తులో పదుగురు సభ్యులుందురు.

1 ఋగ్వేదము నుపఠించిన సభ్యుడు.

2. సామవేదము నుపఠించిన సభ్యుడు.

3 యజుర్వేదమునుపఠించిన సభ్యుడు.

4. తార్కికుడు.

5 మీమాంసకుడు.

6. నిరుక్తశాస్త్రమును దెలిసిన సభ్యుడు.

7. ధర్మపాఠకుడు

8. 9. 10 మొదటి మూడు ఆశ్రమములకు చెందినవారు. వీరు తమధర్మమునుపాలించుకొనుచు నైతిక, ఆధ్యాత్మికవిషయములను చర్చించుచుందురు.

ప్రస్తుతము మనలోనున్న Teachers' Guild, Railway Employees' Union, Non-Brahmin Association, Co-operative Stores Society, Co-opertive Credit Society, Trading Company అను పోలియుండు సంఘములు పూర్వకాలమందున్నవా లేవా యనుసంగతిని, ఉన్నయెడల ఏయేరూపమును దాల్చియున్నవి అనువిషయమును పూర్తిగ చర్చించితిమి. ఇప్పుడు మన పంచాయతీబోర్డు, తాలూకాబోర్డు, జిల్లాబోర్డులను పోలియుండుసంఘములు ప్రాచీనభారతవర్షమందున్నవా లేవా యనువిషయమునుచర్చించు టావశ్యకము. ప్రతిగ్రామమందును గ్రామసభయు, ప్రతిపురమందును పురపాలకసంఘమును, ప్రతిమండలమునకు మండలసభయున్నట్లు గ్రంధములవలనను, శాసనములవలనను తెలుచున్నది. గ్రామసభకు ప్రత్యేకించి యొకసభామండప ముండును సభ్యులందరు నామండపము నొద్దకు జేరి గ్రామమునకు కావలయు సౌకర్యములన్నిటిని తీర్మానించు చుందు

రు. దక్షిణఇండియా శాసనముల (South Indian Inscriptions, Madras Epigraphy Reports) ను, ఉక్కూల్ శాసనములను, చదివి జూచిన గ్రామములందుగల సభలెట్టివో వాటివ్యవహార పరిష్కార మెట్లో స్పష్టముగా తెలియగలదు. ఉక్కూల్ శాసనములవలన సభావ్యవహారములను 'మధ్యస్థ' యను గ్రామోద్యోగి (ఇతనే ఒకప్పుడు కరణట్టాణ accountant అని పిలువబడుచుండెను.) ఒకపుస్తకములో వ్రాసియుంచునని record తెలియుచున్నది. గాంగపల్లవరాజైన కంపవర్మను (9 th Cen. A. D.) యిట్టిగ్రామసభను గ్రామాభివృద్ధికై పెద్దధిరాశి మొసంగెనని అతనిశాసనమువలన తెలియబడుచున్నది.

పురపాలకసంఘములుండినట్లు మెగాస్థనీసు గ్రంథమే సాక్ష్యము. మెగాస్థనీసు చంద్రగుప్తుని పాటలీపుత్రపట్టణ పాలకసంఘమునువర్ణించుచు, భారతీయుల స్వపరిపాలనాచాతుర్యమును విశేషముగా కొనియాడియున్నాడుగదా ! ఒక్కపాటలీపుత్రనగరమే కాదు. యింకను యనేకపట్టణములు యిట్టి పాలకసంఘములచే పాలింపబడుచుండినవని చరిత్రవలన గ్రహింపనగును.

గ్రామపరిపాలకసంఘమును ఊరార్ అందురట. అందులో అన్నిజాతుల అన్నివర్ణముల ప్రతినిధులుందురు. కొన్నిగ్రామముల (తాలూకాబోర్డువంటిది) పరిపాలకసంఘమును కూర్రమ్ అనియందురు. నగరపాలకసంఘమును నగరత్తార్ అనియందురు. No 40 South Indian Inscription vol I., మామల్లపురమందలి పాలకసంఘమును గూర్చి చెప్పను. ఈసంఘములకన్నను పెద్దది జిల్లాసంఘము. దీనిని నత్తార్ అందురు. దీనికంటెను పెద్దసంఘము నాడుసంఘము. నాడుఅనగా రాష్ట్రము Province or division of a province or 12 No. 521 శాసనమువలన ఉత్రిత్తూరు నాడులోని నాడు నగరసంఘములు ఒకే దేవాలయములోని ఉత్తమ సోలమండపములో జేరి ఒక గ్రామమును

వాణిజ్యమునకు వీలుగానుండు పట్టణము క్రింద మార్చుటకు నిశ్చయించిరి. ఇట్టి నాడు సంఘములనుగూర్చి అనేక శాసనములలో కనబడుచున్నది.

చోళవంశస్థుడైన రాజరాజుని సామ్రాజ్యము తొమ్మిది మండలముల Provinces క్రింద విభజింపబడినది. ప్రతిమండలము కొన్ని నాడుల క్రింద విభజింపబడెను. ఏమండలములోను 12 నాడులకంటె నెక్కువలేవు. మొత్తము సామ్రాజ్యమంతటను 45 నాడులుగలవట. నాడు మరల కొన్ని చిన్ననాడులుగను, లేక కూర్రములుగను విభాగింపబడెను. ఆచిన్ననాడు అందలి ముఖ్యగ్రామము పేర వ్యవహరింపబడుచుండెను. (అమలాపురంతాలూకాలో అమలాపురమే పెద్దగ్రామము గనుక ఆతాలూకాకు అమలాపురం తాలూకా యని పేరువచ్చినదిగదా) South Indian Inscription No 73 (Part III) వలన మండలమునకు రాష్ట్రమని నామాంతరముగలదనియు, ప్రతిమండలము యిరువదినాలుగుకొట్టముల లేక విషయముల క్రింద భాగింపబడినదనియు, ప్రతికొట్టము మరల నాలుగునాడుల క్రింద విభజింపబడినదనియు తెలియుచున్నది No. 82 (Part IV) లో గ్రామము ఉరుఅనియు, తాలూకా కూర్రమనియు, జిల్లా నాడు అనియు వ్యవహరింపబడునట్లు కనబడుచున్నది. ఈశాసనములవలన మొదట గ్రామము దానిపైన కూర్రము దానిపైననాడు (కొట్టము లేకవిషయ) దానిపైనమండలము లేక రాష్ట్రము, ఇట్టిరాష్ట్రములు కలిసి సామ్రాజ్యమగుచున్నదని గ్రాహ్యమగుచున్నది. కేవలము బ్రాహ్మణులే నివసించు గ్రామములను అగ్రబ్రహ్మదేశములని పిలుచుచుండెడివారు.

పైని పేర్కొనబడిన స్థానిక సంస్థలవిధులను విచారించి తము రాధాకుముదముఖర్జీగారు వీటినిగురించి వ్రాయుచు యిట్లు చెప్పిరి. "One of the primary duties of all government is to ensure the security of the life and property of its people. That

the assembly made itself mainly responsible for the moral and material welfare of the people committed to its administration" శత్రువుల బారినుండి తమ అధికారముక్రింద యుండు గ్రామ నగరవాసులకు రక్షణకలుగ జేయుటయే ప్రతిసంఘముయొక్క ముఖ్యాశయమైయుండెను. ఎవరైనను శాంతికిభంగము కలుగ జేసిన, వానిని శిక్షించునధికారము యీసంఘము వారిది. గ్రామద్రోహులు లేక గ్రామకంటకులు కాఠిన్యమైన శిక్షలకు పాత్రులగుచుండిరి.

పల్లూరుసంఘముయొక్క తీర్మానము (నెం. 342 ఆఫ్ 1910) గ్రామముయొక్కగాని, దేవగృహముయొక్కగాని తదితర సర్వజనోపయోగకరమగు సంస్థలయొక్కగాని అభివృద్ధికి అడ్డుతగులు గ్రామద్రోహులు దేవాలయములో పూజలు చేయరాదు. వారిఆస్తి స్వాధీనము చేసికొనబడును. ఏనేరస్థులనైనను తాము శిక్షించలేనినాడు, ప్రజలయొక్క మానప్రాణములను రక్షించలేనినాడు, యీసంఘములు రాజుయొక్క సహాయము కోరుచుందురు. రాజప్పుడు వారిని తగురీతిని నిక దండించుచుండును. సుందరపాండ్య అనురాజు ద్రోహులనిట్లే శిక్షించి, వారివలన రాబట్టబడినద్రవ్యమును దానధర్మములకు వినియోగింపబడవలెనని ఆజ్ఞాపించెను. ఇట్టిసంఘములకు సైనికభటులు కొందరు (military force) గలరనియు వారిసహాయమువలననే శాంతి, రక్షణలు గలుగుచుండుననియు కౌటిల్యుని అర్థశాస్త్రమందు వ్రాయబడినట్లు కనబడుచున్నది. సైన్యము (army) శ్రేణిబలమని చెప్పబడినది.

గ్రామద్రోహులభూములును, పన్ను చెల్లించనివారిభూములును గ్రామసంఘముక్రిందనేయుండి గ్రామాభివృద్ధికి ఖర్చుచేయబడుచుండెను. దేవతాపూజకు దానధర్మములకుగూడ కొంతవ్యయపరుపబడుచుండెను. స్వాధీనముచేసికొనబడినఆస్తి వేలమువేయబడుచుండె

ను. currency విషయమై నిర్ణయించుటకు ఈ స్థానిక సంఘముచే నియోగింపబడిన ఒక (Gold committee) బంగారు సభ గలదట. ఇందులో తొమ్మండుగురు సభ్యులుండెడివారట. Land transfers యొక్క accounts ను revenue receipts ను ప్రత్యేకించి తిరై క్కలమ్ అను department యొకటిగలదట.

గ్రామసంఘము వారు రాజుకు గ్రామమందు వసూలు కావలసి నధనమును వసూలు చేసి పంపుచుందురు. ఈ సంఘముయొక్క accounts ను రాజు audit చేయుంచును.

కేంద్రప్రభుత్వమందు Local Government Board ఒకటి అధికారణయనుమంత్రియొక్క అధికారముక్రింద యుండెడిదని చరిత్ర కారుల యభిప్రాయము South Indian Insciptions no. 57 Vo. III లో అధికారణమంత్రియు సేనాపతి కాంచీపురమందు సమావేశమై తిరువల్లమ్ దేవాలయమునకు చెందిన గ్రామముల accounts అన్నియు దెప్పించినట్లు కనబడుచున్నది.

గ్రామములందు వసూలు చేయబడు పన్నులో కొంత భాగము స్థానిక సంస్థలకు పోవుచుండెడిది.

---

## ఏడవ భాగము

ప్రస్తుతము మన ప్రాచీనులు సముద్రయాన మెరుగుదురా, వర్తక వ్యాపార మెప్పుడెప్పు డేయే దేశములతో సాగించెడివారు అను విషయములు స్పష్టముగా చర్చించుట ముఖ్యము. పురాణముల నాధారముగా గైకొని కర్నల్ విల్ ఫర్డుగారు ప్రాపంచిక పటము నొకదానిని గీచి యున్నారు. కర్నల్ స్పీకుగారు మొట్టమొదట ఆఫ్రికాఖండములోని నైలునదీ యుత్పత్తిస్థానము ను కనుగొనదలచి పలుకష్టము

కులోనై మెట్టకేలకు విఫలమనోరథులై రన్న సంగతి మనకందరకు విదితమే. తరువాత ఆయన విల్ ఫర్డుగారిచే గీయబడినపటము ననుసరించి పరిశోధనచేయగా నైలునదీ యుత్పత్తిస్థానము కనుగొనబడెను. ప్రాచీనకాలమందు భారతీయులు ఆఫ్రికాఖండమును కుశద్వీపమనియు, నైలునదిని నీలకృష్ణయనియు చంద్రస్థాన మను పేరుతో వెలయు గొప్ప సరస్సే నైలునదీయుత్పత్తిస్థానమనియు పిలుచుచుండిరని విల్ ఫర్డుదొరగారు వారిభూగోళపటమందు స్పష్టీకరించియున్నారు దీనిని బట్టి చూడగా కొన్ని వేలసంవత్సరములకుపూర్వమే భారతీయులు ఆఫ్రికా ఖండము నెరుంగుదురనియు, అట్లెరుంగుటకు సముద్రయానము ముఖ్యమనియు మనము గ్రహింపవచ్చును. మనుస్మృతియందు దిట్లు వ్రాయబడినది.

సముద్రయానకుశలా దేశకాలార్థదర్శినః,
స్థాపయంతితు యాం వృద్ధిం సా తత్రాధిగమం ప్రతి.

(8-వ అధ్యాయము.)

సముద్రప్రయాణము చేసినవారును, దేశకాలపరిస్థితులను గుర్తెరింగినవారును వృద్ధినిర్ణయము చేయవలెనని మనువుయొక్క యభిప్రాయము. మనుకాలమునాటికే భారతీయులు సముద్రయానమెఱుగుదురని పైశ్లోకమును బట్టి ఊహింపవచ్చును గదా!

చంప, కాంబోడియా, బోర్నియో, జావా, సుమత్రా (సువర్ణద్వీప,) బాలి, మలేద్వీపకల్పము మొదలగువాటితో హిందూదేశమునకు రెండుమూడు వేలసంవత్సరములకుపూర్వమే సంబంధముండెనని నవీనపరిశోధకులలో ముఖ్యులగు కాళిదాసునాగ్ గారు తన గ్రేటర్ యిండియా (Greater India) పుస్తకములో తెలిపియున్నారు. ఆయాద్వీపములలో విష్ణ్వాలయములు, రామాలయములు, హిందూవిగ్రహములు, బౌద్ధవిగ్రహములు, వారివారిభాషలలో వ్రాయబడిన

రామాయణాది పవిత్రగ్రంథములు, శాసనములు పలుతావుల కా న్పించుచున్నవి. రెండవ సూర్యవర్మన్ చే కట్టబడిన కాంబోడియా ద్వీపములోని అంకోర్ వాట్ విష్ణ్వాలయము, జావాలోని బౌద్ధవిహారములు, విగ్రహములు, కొన్నికొన్ని శిలలపై చెక్కబడిన రామాయణశ్లోకములుచూచిన హైందవులు పూర్వము యితర దేశములకు బోయి తమతమ మతసిద్ధాంతములను వెదజల్లినారనియు, అట్లు వెదజల్లుటకు సముద్రపరిచయముండవలెననియు స్పష్టపడగలదు.

గుడివాడలో కనబడిన నాణెములమీద అర్ధచంద్రాకారము గల ఒకఓడయు రెండు తెరచాపలు ఒకలంగరు గలవు. చరిత్రకారులు యీనాణెములు ఆంధ్రవంశపు రాజైన యజ్ఞశ్రీ శాతకర్ణివని నిర్ణయించియున్నారు. ఆయోడ యవన, రోమన్ యోడను బోలియున్నదనియు చెప్పుదురు. అందుచే పూర్వము ఆంధ్రులు నావికానైపుణ్యము గలవారని గ్రీసు, రోమన్ సామ్రాజ్యములలో వర్తకసంబంధముకలదనియు చెప్పుటకు వీలగుచున్నది. ఏరియన్ తనఇండికా గ్రంథములో భారతదేశనావికులను, ఓడలనిర్మించువారినిగూర్చియు వర్ణించియున్నాడు.

మనుకాలమునకు పూర్వమే హిందూదేశమునకును మధ్యధరాసముద్రప్రాంతమందుండు దేశములకు వర్తకవ్యాపారము జరుగుచుండెననుట కొకనిదర్శనము గలదు. 'సాలమన్' కాలమున ఫోనీషియనులు, జ్యూతెగవారు యిండియానుండి అనేకవస్తువులను తమతమఓడలలో గొనివచ్చిరని హెబ్రూభాషలో వ్రాయబడినది. నెల్లూరు సమీపమున ఒకశూద్రుడు పొలముదున్నుకొనుచుండగా నాగలికేదో గిట్టిగా తగిలినదని అనుమానముతట్టెను. త్రవ్విచూడగా ఒకదేవాలయము బయలుపడెను. అందులో అనేకరోమన్ నాణెములు కనబడెను. ఏడ్రియన్, పౌస్టినాయన్ మొదలగుపేర్లుగలవు. కొన్ని

నాణెములు ట్రోజనులవని నిర్ణయింపబడెను. ఈనాణెముల నాధారముగా జేసి భారతదేశమునకును రోమనుదేశమునకు వర్తకవ్యాపారముండెనని తెలియవచ్చెను. అలెగ్జాండరుదండయాత్రతరువాత హిందూదేశమునకును గ్రీకుదేశమునకు వాణిజ్యవ్యాపారము జరుగుచుండెననుటకు కౌటిల్యుని అర్థశాస్త్రము, గ్రీకులచేవ్రాయబడిన గ్రంథములే తార్కాణము.

అరబ్బులు సింధూతీరమునుండి బయలుదేరి అరేబియాగుండా ఈజిప్టు, సిరియా మున్నగుదేశములతో వ్యాపారముచేసిరని తెలియుచున్నది. భూమార్గమున బేబిలను పారశీకదేశములతో వర్తకము జరిగించిరనియు కూడ విశదమగుచున్నది. ఇతరదేశములమాట యటుండ ఉత్తరహిందూస్థానమునకును దక్షిణదేశమునకు మధ్య పలువిధములవస్తువులలో వర్తకము జరుగుచుండెనని అర్థశాస్త్రమువలన గ్రాహ్యమగును. అంగ, కళింగ, కురుదేశములలో గొప్పగొప్ప యేనుగులు దొరకుచుండెడివనియు, బుందేల్ ఖండములోను, యింకను పశ్చిమమునను సాధారణవన్నెగల యేనుగులు దొరకుననియు, సౌరాష్ట్ర, పంచజనదేశములలో తక్కువరకముగల ఏనుగులుగలవనియు చెప్పబడినది దక్షిణదేశములో బంగారము, వజ్రములు, ముత్యములు, మాణిక్యములు, శంఖపుచిప్పలు ఎగుమతి యగుచుండెడివనియు, ఉత్తరహిందూస్థానమున కంబళ్ళు, తోళ్ళు, గుర్రములు దొరకుచుండెడివనియు, కాశీ, మధుర, కొంకణమునుండి నేతసంబంధమైన వస్త్రములు కొనబడుచుండెడివనియు వ్రాయబడినది. వంగరాష్ట్రమున మృదువయిన తెల్లనిదుకూలములు, పాండ్యదేశములో యింద్రనీలమణివలెనున్నని నల్లగుడ్డలు యుత్పత్తియగుచుండెను. మధుర, అపరాంత, కళింగ, కాశి కౌశాంబి, మాహిష్మతి అను పట్టణములు నూలువస్త్రములకు ప్రసిద్ధికెక్కియుండెనని అర్థశాస్త్రము చెప

చున్నది భారతమున సభాపర్వములో యుధిష్ఠిరచక్రవర్తికి భరత ఖండములో వివిధభాగములనుండి వచ్చిన సామంతరాజులు బంగారపు పనిగంచులుగల ఉన్నివస్త్రములు కానుకలిచ్చినట్లు వ్రాయబడినది గుజరాతునుండి ఆభీరులు అనేకరకముల శాలువలును, కర్ణాటకులు పలువిధముల ఉన్నిగుడ్డలును, దూదివల్లను పట్టుపురుగుల వలను చేయబడినవస్త్రములును సన్నని మజ్లినులును, చోళపాండ్య దేశీయులు అపరంజి జరీఅంచులుగలనూలువస్త్రములును సమర్పించిరట మనదేశమునుండి వర్తకమునకై వెళ్లునప్పుడుగాని, లేక యిక్కడకువచ్చునప్పుడుగాని నిరాటంకముగా బోవుటకు అధికారపత్రిక (Pass port) లుండెడివనియు కానవచ్చును. క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమునాటి గ్రంథకర్తయొకడు హిందూదేశమునకున్ను ఈజిప్టు అరేబియాలకున్ను వర్తకము జరుగుచుండెనని వ్రాసియున్నాడు. ఇండియానుండి ఆదేశములలో దిగుమతియగునరకులలో లవంగపట్ట, దాల్చిని, ఆకుపత్రి మొదలగునవి ముఖ్యమనియు, అరబ్బులు యిండియానుండి అరబియా (Mo-dern yemen) మొదలగు రేవుపట్టణములకు సరకులు పంపుచుండిరనియుకూడ చెప్పియున్నాడు. హిందూదేశవర్తకమంతయు అరబ్బులచేతిలోనే యుండెననిన్ని, వారు లంకాద్వీపముయొక్క పశ్చిమతీరమందున్ను, మలబారుతీరమందున్ను యుండిరనిన్ని విన్సెంటుయొక్క కామర్సు అండు నావిగేషను ఆఫ్ ది ఏనషంట్సు (vin-cents commerce and Navigation of the Ancie-nts) అను గ్రంథమునకలదు.

అనుభవనీయుడగు నావికుడొకడు వ్రాసిన 'periplus of the Erythraean Sea' గ్రంథమం దిట్లున్నది. ఎర్రసముద్రము, అరేబియా ఆగ్నేయమూల, సింధునదీముఖ ద్వారము మొదలు కన్యాకుమారీఅగ్రమువరకు గలతీరము మధ్యహిందూదేశ వర్తక

సంబంధమైన ఓడలు తిరుగుచుండెడివనియు అప్పుడప్పుడు ఎఱ్ఱసము ద్రమును గూడ దాటి యుత్తర దేశములకు బోవుచుండెడివనియు తెలియవచ్చును. అరబ్బులు గ్రీకులతో వ్యాపారమునంతను నిర్వహించెడివారట. మనహిందువులుగూడ వారితో గలసి సాకోట్రా ద్వీపమందప్పుడప్పుడు వ్యాపారమధ్యమున నాగుచుండెడివారు. సింధునదీముఖద్వారమునుండి లోపలికి ఓడలురాలేవు. కాబట్టి ఓడల లోని సరకులను గొనివచ్చుటకు చిన్నచిన్నపడవలుండెడివి. కెంబే జలసంధివద్ద బరుకచ్ఛ రేవుపట్టణమునకువచ్చు ఓడలకు సహాయము గా నుండుటకు చిన్ననావలుపోవుటకూడ కలవు. బరుకచ్ఛ రేవు పట్టణమునకు క్రిందుగా అనేక రేవుపట్టణములుండుటచేత వారికి Local emporia అను పేరుకూడవచ్చెను. కోరమండలతీరముయొక్క యుత్తరభాగమునందు ప్రజలు నిర్భయముగా సముద్రప్రయాణము చేయుచుండిరి. కళింగదేశమునుండి కొందరు క్రీస్తుపూర్వము జావా ద్వీపమునకుబోయి అక్కడక్రొత్తశకమును ప్రారంభముచేసిరి ఆద్వీప మున వారు కాలుపెట్టిన సంవత్సరమే శకప్రారంభము. ఆశకము క్రీస్తు పూర్వము 75-వ సంవత్సరమని జావాచరిత్రవల్ల నిర్ణయింపబడుచున్నది

ఈజిప్టుదేశములకు హిందూదేశవస్త్రములు కప్పబడుచుండెడి వని ఒకచరిత్రకారుడు వ్రాయుచున్నాడు. నూలుగుడ్డలకు గ్రీకుభాష లో సిండో యనుటవలన యాశబ్దము సింధుశబ్దమునుండి యుత్పత్తి యయినదని చెప్పవచ్చును. గ్రీకులు మజ్లినువస్త్రములను 'గాంగెటికా' యని పిలుతురు. ఈగుడ్డలను బిడారువర్తకులు 'సమరఖండు' మార్గమునను 'హిందూఖుష్' పర్వతకనుమలమార్గమునను 'బఖోరా' ఖైబరు దేశములగుండా తురుష్క తార్తార దేశములకును ఆవలనున్న రషియాదేశమునకును ఈజిప్టుమార్గమున మధ్యధరాసముద్రతీర మునయున్న దేశములకు గొనిపోవుచుండెడివారు.

పెరిప్లసు కాలమున నూలుగుడ్డలు, రవశెల్లాలు, నానాధరకముల గు కలంకారీగుడ్డలు, పట్టుబట్టలు, పట్టుదారము, నీలిమందు, దాల్చిని, లవంగపట్ట మొదలగు వాసనద్రవ్యములు, పంచదార, రత్నములు, ముత్యములు, పచ్చలు, తక్కువవస్త్రగలరాళ్ళు, ఉక్కు, మందుదినుసులు, అప్పుడప్పుడు బానిసస్త్రీలు యుండియూచుండి ఎగుమతి అగుచుండెను మనదేశమునుండి ఎగుమతి అగువస్తువులలో కొన్నిటిని పూర్వమందు పాశ్చాత్యులు లేటిన్ భాషలో ఏమనుచుండిరో క్రిందవ్రాయుచున్నాను.

| Latin | Indian |
| --- | --- |
| కార్బాసస్ | కార్పాసం |
| సచ్చారన్ | శర్కరా |
| పిపర్ | పిప్పలీ |
| జింగిబేరి | శృంగవేరు |
| అగల్లోచమ్ | అగరు |
| సేన్డలమ్ | చందనము |
| మలోబాత్రమ్ | తమాలపత్రం |

భారతదేశములోనికి దిగుమతిఅగువస్తువులు ముతక, సన్నని నూలుబట్టలు, ఇత్తడి, తగరము, సీసము, పగడములు, అద్దములు, మనదేశములో నెరుగని పరిమళద్రవ్యములు, మత్తుపదార్థములు (ఇటలీనుండివచ్చువవి ఎక్కువ యిష్టముగాయుండెడివి) మొదలగునవి. క్రీస్తుపూర్వము ఐరారాజుకు చెందిన ఖాండ్‌గిరి శిలాశాసనమునుబట్టి ఒకానొకప్పుడు కళింగదేశము నాణ్యమైనరవశెల్లాలకు ప్రసిద్ధికెక్కెనని తెలియుచున్నది.

హిందూదేశపు మజ్లినులను ధరించినయెడల లోపలిశరీరము ప్రకాశించుచు బయటికిగనబడుచుండెనని ప్లినీవ్రాసియున్నాడు. తొమ్మి

దవశతాబ్దమునవచ్చిన ఆరబ్బీదేశీయుడు మజ్లినులు హిందూదేశమున దక్క మరెక్కడను దొరకవనియు, ఒకమనుష్యునకు సరిపోవు వస్త్రము తనయుంగరముగుండ దూరిపోవునంతటి సన్ననినూలుతో జేయబడుచున్నదనియు దానిని దూదితో చేయుగా తానుజూచితిననియు వ్రాసియున్నాడు. పిరార్డువచ్చిచూచిన కాలములో నూలుగుడ్డలు కొన్ని ధరించినప్పుడు శరీరముమీదగుడ్డ ఉన్నదా లేదా యను శంక బొడమునంత సన్నముగానున్నవట. రాల్ఫుఫిచ్చిగారు హిందూదేశములోనెల్ల సన్నినిగుడ్డ ఢక్కాసమీపమునవున్న సోనర్గోనులో చేయబడుచున్నదని వ్రాసినాడు. చక్రవర్తులు తమఆస్థానములకు పరరాజ్యములనుండివచ్చురాయబారులకు సగౌరవముగనిచ్చు మేలిబహుమతులీ మజ్లినులే. ఒక పారశీకరాయబారి తన రాజును సందర్శింపవచ్చి నిక్కా కోడిగుడ్డంత పరిమాణముగలిగి ముత్యములు తాపిన కొబ్బరిబొంకను కానుకగా సమర్పించెననియు, దానిని తెరచిచూడగా లోపల 60 మూరలపొడవుగల తలగుడ్డ యిమిడియుండెననియు సంతోషముతో నుప్పొంగుచు ట్రవెర్నియరు వ్రాసియున్నాడు.

దక్షిణహిందూదేశమునగల తమిళదేశమునకు యితరదేశములకు నగలవ్యాపారసంబంధమును తెలిసికొనుట యావశ్యకమైయున్నది. తమిళవర్తకులు లంకాద్వీపముతోను, ఆసియామైనరుతోను, ఈజిప్టు రోము మొదలగు దేశములతో వ్యాపారముజరుపుచుండిరని గ్రంథములు ఋజువుచేయుచున్నవి.

రోమనుచరిత్రకారులు హిందూదేశమునుండి దిగుమతియగు పట్టుబట్టలకు, మిరియాలు, వాసనద్రవ్యములకు, రత్నములకు యింకను యితరవస్తువులకు రోమను సామ్రాజ్యమునుండి అమితమైనబంగారమును హిందూవర్తకులు గొనిపోవుచుండిరని నిందించుచున్నారు.

రోమునుండి బంగారము యిండియాకు వర్తకమూలమున వచ్చుచుం డెనని వారియభిప్రాయము.

రోమనులు హిందూదేశవస్త్రములయొక్క సౌందర్యమును వ్యామోహములో బడి మజ్లినులను, దుకూలములను, బంగారు సరి గంచువస్త్రములను యెంతవెలకైనను గొని కోట్లకొలది ధనమును యిండియాకు బంపుచుండుటచే ఎలర్డ్ప్లినీ యను రోమన్ చరిత్రకా రుడు తనదేశమునకు గలుగుచున్న ఆర్థికనష్టమునకు చింతించుచు తమదేశమునుండి సంవత్సరమునకు పదికోట్ల సెపిరులు పోవుచున్నవని వ్రాసియున్నాడు. "అరీలియన్" యను చక్రవర్తికాలములో పట్టు బం గారమున కెత్తున కెత్తుగా నమ్మబడుచుండెను. క్రీస్తు శకము 55వ సంవత్సరమున జస్టినియనుఅను రోమకచక్రవర్తి చేసిన చట్టములలో హిందూదేశమునుండి వచ్చు వస్త్రములమీద శాహరీ (పన్ను) విధిం చబడినట్లును, ఒడలు పైకి కనబడునంతటి సన్నని పట్టువస్త్రములు జను లు ధరించుచుండుటచే నీతికి భంగమని టైబీరియసు చక్రవర్తి వానిని నిషేధించుచు నొకచట్టము చేసినట్లును తెలియుచున్నది.

హిందూదేశమందలి ముఖ్యరేవుస్థలములు. సింధునదీసాగర సంగమందుగల బార్బరికము, అపరాంతకదేశములోని కాంబే, బ్రోచి, సూరతు, నవసారి, ముజీరిస్, పైఠాణదేవగిరి, కన్యాకుమారి, కావేరిపట్టణము మొదలయినవి ఎగుమతి దిగుమతిపలనవచ్చు సుం కములు రాజుయొక్క రివెన్యూలో ఒకభాగమైయుండెను పట్టినప్పాలై అను తమిళపద్యకావ్యము కరికాలచోళుని రాజ్యపరిపాలన వర్ణించు, ఆకాలమునాటి రేవుపట్టణములు, సుంకములు మొదలగు వాటినిగూడ పేర్కొనును.

పైరార్డు, బార్బోసా, నికొలోకొంటి, ఠెర్షోటరు మున్నగు యాత్రికుల సాక్ష్యమువలన హిందూదేశమునకు తూర్పునను

పశ్చిమమునను గల దేశములన్నిటియందును దక్షిణాఫ్రికాయందును, హిందూ దేశవస్త్రములు వ్యాపించుచుండెనని ద్యోతితమగుచున్నది.

ఇక మన ఆంధ్ర దేశముగూర్చి తెలిసికొందము. ఆంధ్రదేశము అరేబియా, ఈజిప్టు, రోము, గ్రీస్ పరసుకాము దేశములతో వర్తక వ్యాపారము జరుగుచుండెడిది ఈదేశమునుండి వచ్చుఓడలు పశ్చిమతీరమునగల బరుకచ్ఛ, సింహపుర, సూర్పారాగ రేవుపట్టణములకు చేరును. ఆరేవులనుండి ఓడలు లంకాద్వీపమునకున్ను, అక్కడనుండి బంగాళములోని తామ్రలిప్తివద్దకు వచ్చిచేరును. తామ్రలిప్తినుండివచ్చు ఓడ మొదట కళింగదేశమునకు చెందిన అజీత అను రేవుపట్టణమునకును, మరియొక రేవుపట్టణమునకున్ను వచ్చి పిమ్మట ఆంధ్రదేశమునకు వచ్చిచేరును. బర్మీస్ కథలవలన తప్పక, పాలికట్ అను యిద్దరు వర్తకులు అజీత రేవుపట్టణమును చేరి అక్కడనుండి మగధదేశమునొక్క సువర్ణపురి వెళ్లిరని తెలియుచున్నది. ఆంధ్రదేశములో మసేలియా మండలము రవశిల్లాకు (fine Muslins) ప్రసిద్ధియని సులీమాన్ అను ఒకవర్తకునివలన స్పష్టపడుచున్నది మార్కోపోలో పదునా(ల్గ)వశతాబ్దమందు మసులమండలమందు ముతఫిలి యను రేవుపట్టణముగలదనియు అది రత్నములకు, సాలిపట్టువలె మెత్తనైనగుడ్డలకు ప్రసిద్ధికెక్కెననియు వ్రాయుచున్నాడు. చైనా, జపాను, బర్మా, సుమత్రా, జావా, బోర్నియో, శిలన్, బెంగాల్ నుండి వచ్చుయోడలు మసేలియాకువచ్చి చేరుచుండెనట. పినాకిని నదీముఖద్వారమువద్ద ఒక రేవుపట్టణముండెను. ఈప్రాంతమందు తయారగుబట్టలు ధాన్యకటకమునుండి ప్రతిష్ఠానపురముద్వారా బరుకచ్ఛ రేవుకు పోవును. నెల్లూరువద్దకనబడిన నాణెములు ఆంధ్రదేశమునకున్ను రోముదేశమునకున్ను వాణిజ్యవ్యపారము జరుగుచుండెనని తెలుపుచున్నవి. ఆంధ్రదేశమునకున్ను చైనా దేశమునకున్ను వర్తకము జరుగునని చెప్పుటకు చైనాదేశ

పుష్కరణలో తార్కాణము. చైనాదేశచరిత్రకారులు ఆంధ్రదేశపురాజైన యజ్ఞశ్రీని యజ్ఞైయనియు, పులమాయిని పౌలిమోయిన్ అనియు వ్రాసియున్నారు.

ఇంక కుషాణచక్రవర్తులకాలమునాటి భారతదేశపు వాణిజ్య స్థితి యెట్లుండెనో విచారింతము. భూమార్గమున రోమకసామ్రాజ్యముతో పారసీక, మెసపొటోమియా, ఆసియామైనరు దేశములగుండా వర్తకము జరుగుచుండెననుటకు సందియము లేదు. క్రీస్తుశకము 105 మొదలు 273-వ సంవత్సరమువరకు సిరియాదేశములోని పాల్మైరా లేక టాడ్మోర్ ప్రధానవర్తకస్థానమైయుండెను. క్లాడియస్ యను రోమన్ చక్రవర్తికిపూర్వము ఈజిప్టుద్వారా ఐరోపాభూమండలముతో వర్తకమంతగా సాగినట్లు కన్పింపదు. రోమన్ వర్తకులు మన్సూను గాలులకు విశేషముగా భయపడిరిగాబోలు! అగస్టస్ చక్రవర్తియొద్దకు మధురను, తత్ప్రాంతమును నేలుచుండిన పాండ్యవంశపురాజు పాండియన్ యనునాతడు క్రీస్తుపూర్వము 20-వ సంవత్సరమున రాయబారమును పంపియున్నాడు ఈరాయబారము వర్తకసంబంధమైయుండనోపునని చరిత్రకారు లూహించుచున్నారు. క్రీస్తుతరువాత ఒకటి రెండుశతాబ్దములలో రోమన్ వర్తకులు అరేబియా రేవునుండి మలబారుతీరమున గల ముజిరిస్ (Cranganore) చేరుటకు జూలై, ఆగస్టు నెలలోపలుబడి రోజులలో రాగలుగుచుండిరి. వ్యాపారాంతమున మరల డిసెంబరు లేక జాన్యువరి నెలలో తిరిగిపోయెడివారు. క్రీస్తుశకము 215-వ సంవత్సరమున అలెగ్జాండ్రియా జనసంహారమైనతరువాత యీవర్తకము కొద్దిగాక్షీణించుట మొదలుపెట్టెను. భారతదేశనరకులు అవుశైఅను నాణెములలో కొనబడినట్లు కనబడుచున్నది. ఈకాలము నాటి రేవుపట్టణములు, ఎగుమతియగుసరకులు తెలిసికొనుట ముఖ్యావశ్యకము. తిన్నవెల్లిలోని తామ్రపర్ణినదీప్రాంతమందు దొరకుముత్యా

ములు, మైసూరు, కోయంబత్తూరులోని కచ్చులు మొదలైనవి, ఆప్రాంతములలోనేయుండు కురువిందము, లంకాద్వీపమునుండి రత్నములు, మణులు, మాణిక్యములు, మలబారుతీరమునుండు, మిరియాలు మొదలగునవి యెగుమతియగుచుండెడివి. తామ్రపర్ణినది తీరమునున్న కోర్కాయి ముత్యములవర్తకస్థానమై యొప్పుచుండెను. కావేరీనది ముఖద్వారమునగల కావేరీపట్టణము ఒక పెద్ద రేవుపట్టణము.

రానురాను గుప్తవంశజులకాలమున హిందువులకును యితరదేశీయులకును గల వర్తకసంబంధమెట్టిదో చూతము. క్రీస్తుశకము 357 మొదలు 571 వరకు యిండియానుండి చైనాదేశమునకు పదిరాయబారములు పంపబడినవి. ఇందులో కొన్ని వర్తకమునకు సంబంధించినవైయుండెను. కుమారజీవ అనునాతడు చీనాదేశమునకు 383 A. D లో వెళ్లియున్నాడు. ఈకాలములోనే చీనాయాత్రికులుకూడ యిండియానుదర్శింపవచ్చిరి. నాల్గవశతాబ్దాంతమున వచ్చిన చీనాయాత్రికుడు ఫాహియాన్ అనునాతడు హిందువులే గంగాతీరమునుండి లంకాద్వీపమునకును, అక్కడనుండి జావాద్వీపమునకును వచ్చిరనియు, తాను జావాలో హిందువులను పెక్కుమందిని జూచెననియు ఓడలను నడపువారు చాలమంది బ్రాహ్మణులను తోవలంబకు లీయనియు వ్రాసెను. క్రీస్తుశకము 336, 361, 530 సంవత్సరములలో రోమను చక్రవర్తులయొద్దకు హిందూరాయబారులు ముగ్గురు పంపబడిరని తెలియుచున్నది

పశ్చిమహిందూదేశమును జయించినపిమ్మట రెండవచంద్రగుప్తుడు (విక్రమాదిత్యుడు) భారతదేశమునకును అలెగ్జాండ్రియా మున్నగు రేవుపట్టణములకును వర్తకసంబంధము కల్గించియుండెను. పారశీకదేశముగుండాకూడ వర్తకముజరిగెను.

# ఎనిమిదవ భాగము.

I

మదోన్మత్తులగు ఆధునికులు కొందరు మనపూర్వులు విద్యా విహీనులని దూషించుట లోకవిదితము. దీనికి కారణము ప్రాచీనభారతదేశచరిత్రజ్ఞానశూన్యత్వమే యని చెప్పకతప్పదు. పలుభాషలందు వ్రాయబడిన ప్రాచీనగ్రంథములను, శాసనములను పరిశీలించిచూచిన పూర్వు లెట్టి ఆధ్యాత్మిక లౌకికవిజ్ఞానసంపన్నులో, యెక్కడెక్కడ ఎట్టెట్టి విద్యాలయములుగలవో విశదముగా తెలియగలదు. ప్రారంభములో తండ్రియే కుమారునిచే వేదములనభ్యసింపజేసి ఆధ్యాత్మిక విషయజ్ఞానసంపన్నునిగా జేయుచుండినట్లు కానవచ్చుచున్నది. తండ్రియే గురువుగా పరిగణింపబడుచుండెను. రానురాను విదేహ, కాశీ, కురు, పాంచాలరాజులచే వేదపాఠశాలలు స్థాపింపబడి అందు దీక్షా గురువులచే పారలౌకికవిద్య గరపబడుచుండెను. కొలదికాలమయిన తరువాత శిక్షాగురువులుగూడ నియోగింపబడి శాస్త్రముల నుపదేశించుచుండెడివారు. వేదాంగములు వృద్ధియైనకొలది వేదపాఠశాలలు రెండువిధములుగా పరిగణింపబడవలసివచ్చెను. వేదపాఠశాలయందు కేవలము వేదములే పఠింపబడుచుండెడివి. శాస్త్రపాఠశాలయందు ధర్మశాస్త్రములు, జ్యోతిషము, వ్యాకరణము మొదలగుశాస్త్రములు అభ్యసించు నాచారము ప్రారంభమయ్యెను. జీవితమునంతను పవిత్రముగా జేయువిధులు, క్రియలు నేర్పబడుచుండెడివి.

ప్రాచీనభారతవర్షమందు పరిషత్తులు (Brahminic Colleges answering to the residential Universites of today) విద్యావిషయములో ప్రాముఖ్యతవహించినవనుటలో సందేహము లేదు. ఈపరిషత్తులు, పలువిధములగుధ్వనులతో నిండియుండుపట్టణ

ములకు దూరముగా నిర్మింపబడుచుండెడివి విద్యార్థులు ఉచితభోజన వసతులు పొందుటయే గాక, ఉచితముగా విద్యనభ్యసించుచుండెడి వారు. చక్రవర్తులు, మహారాజులు, తత్ప్రాంతమందు నివసించు ధని కులు, పరిషత్తులకు కావలయు ధనమునిచ్చుచు తగురీతిని పోషించి పాలించుచుండినట్లు చరిత్రవలన ద్యోతితమగుచున్నది. లోకప్రఖ్యాతి చెందిన రమేశచంద్రదత్తు యిట్లు వ్రాయుచున్నాడు.

"From the most ancient times there was to be found in India Brahmin settlements, and in connection with them Parishads, or assemblies of learned Brahmins existed."

అభిప్రాయభేదమునుకల్గించి ప్రజలమనస్సును కలవరపెట్టు మత విషయములు యీపరిషత్తులలో చర్చింపబడి నిర్ణయింపబడుచుండెను. పాంచాలపరిషత్తుకు శ్వేతకేతు వెళ్ళినట్లు బృహదారణ్యకోపనిషత్తు వలన తెలియుచున్నది. స్వతంత్రబుద్ధి నుపయోగించి ప్రతివిషయమును విమర్శించి పరిశోధనలుజరపు విద్వాంసు లనేకులు రాజులవలనను, నాయకులవలనను ధనసహాయముపొంది యట్టిపరిషత్తులలో ప్రవేశిం చి క్లిష్టసమస్యలనుగూడ యెక్కువనైపుణ్యముతో పరిష్కారముచేయు చుండెడివారు. వేదవేదాంగములందు సంపూర్ణజ్ఞానముకల్గిన ముగ్గురు, లేక అయిదుగురు బ్రాహ్మణులసభయే పరిషత్తని పిలువబడుననియు, యీపరిషత్తు తద్దేశమునుపరిపాలించు రాజుచే నాహ్వానింపబడుననియు పరాశరుడు వ్రాసియున్నాడు. చతుర్వేదవిదులగు బ్రాహ్మణులు నలుగురు, వేదాంగములందు విశేషపాండిత్యముగల బ్రాహ్మణుడు, ధర్మశాస్త్రోపదేశకుడు, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమముల మూడింటనుండి మాగ్గురును మొత్తము పదుగురుసభ్యులచే నలంకరిం పబడుసభయే పరిషత్తుకాగలదని వసిష్ఠుని యభిప్రాయము. గౌతమ స్మృతిలో యిట్లు లిఖింపబడినది:—

"చత్వారశ్చతుర్ణాంపారగా వేదానాం ప్రాగుత్తమాస్త్రయ
ఆశ్రమిణః పృథగ్ధర్మ విదస్త్రయ ఏతాన్దశావరాన్పరిషదిత్యాచక్షతే"
చతుర్వేదవిదులగు సభ్యులు నలుగురును, మొదటిమూడు ఆశ్రమము
లకు చెందిన సభ్యులు ముగ్గురు, ధర్మశాస్త్రవిధానములు సంపూర్ణ
ముగా గ్రహించిన సభ్యులుముగ్గురును మొత్తము పదుగురు సభ్యుల
చే విరాజిల్లెడుసభయే పరిషత్తని నిరూపింపబడినదిగదా! మనువిట్లు
లిఖించియున్నాడు:—

త్రైవిద్యోహేతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా.

త్రైవేదవిదులు ముగ్గురు, తార్కికుడు, మీమాంసకుడు,
నిరుక్తశాస్త్రము దెలిసినవాడు, ధర్మపాఠకుడు మూడుఆశ్రమములకు
ను ముగ్గురు మొత్తముపదుగురు సభ్యులుగలసభయే పరిషత్తని పిలు
వబడునని మనువుయొక్క యుద్దేశ్యమైయున్నది

బౌధాయనుని యభిప్రాయము:—

చాతుర్వేద్యంవికల్పీ చ అంగవిద్ధర్మపాఠకః
ఆశ్రమస్థాస్త్రయో విప్రాపర్షదేషదశావరా.

చతుర్వేదవిదులు ముగ్గురు, ఒకమీమాంసకుడు, వేదాంగ
పరిజ్ఞానముగలవాడు ధర్మపాఠకుడు మొదటిమూడు ఆశ్రమములకు
చెందిన ముగ్గురును మొత్తము పదుగురుసభ్యులచే నిండియుండుసభ
యే పరిషత్తని చెప్పబడినది. త్రయివేదవిదులగు ముగ్గురుబ్రాహ్మ
ణులు చేయు క్లిష్టవిషయనిర్ణయమే ధర్మనిర్ణయమనియు, న్యాయసమ్మతమగు నిర్ణయమనియు, ఆనిర్ణయము క్రియారూపము దాల్చవచ్చు
ననియు మనుస్మృతిలో కానవచ్చుచున్నది. సుప్రసిద్ధచరిత్రకారుడును
విద్వాంసుడునగు మాక్సుముల్లరు (Prof. Maxmuller) యిట్లు
వ్రాసియున్నాడు.

"A Parishad ought to consist of twentyone Brahmins well acquainted with theology, philosophy and law But in early times it seems that a smaller number was sufficient''

స్మృతికర్తలు వ్రాయువ్రాతలనుబట్టి పూర్వము వేదములు వేదాంగములు వేరు వేరుగా అధ్యయనింపబడుచుండినట్లు గోచరమగుచున్నది ఈపరిషత్సభ్యులు విద్యావిభాగముల నేర్పరచి తద్విధానానుసారముగా విద్యార్థులకు విద్యగఱపుచుండినట్లు గ్రహింపవచ్చును.

పాణినియొక్క జన్మస్థానమగు తక్షశిలానగరము క్రీస్తుపూర్వము నాలుగైదుశతాబ్దములందు బ్రాహ్మణవిద్యావిషయములో మిక్కిలి ప్రఖ్యాతివహించినది. గ్రీకుదండయాత్రికులు తక్షశిలానగరమందలి బ్రాహ్మణులతత్త్వజ్ఞానము, మునివృత్తి (Ascecticism) నిజూచి మిగులాశ్చర్యపడిరట. తక్షశిలానగరము విద్యావిషయచర్చలకు ప్రసిద్ధియనుటకు మహాభారతమే తార్కాణము శంకరాచార్యులు తక్షశిల, వారణాశి, కనూజ్, ఉజ్జయిని, నాడియ (నవద్వీప) నగరములు దర్శించెనని దిగ్విజయమువలన తెలియుచున్నది. వైద్యశాస్త్రపఠనమునకు తక్షశిల, జ్యోతిశ్శాస్త్రమునకు ఉజ్జయిని, వేదాంతమునకు వారణాశియు పేరుపొందెనని గూడ తెలియుచున్నది కాశీ, తక్షశిలానగరములందలి విద్యాలయములు ప్రస్తుతపు విశ్వకళాపరిషత్తులతో పోల్చవచ్చును పాటలీపుత్ర, కాశీ, తక్షశిల కళాశాలలకు మహారాజులును ధనాఢ్యులగు వర్తకులును ధనసహాయముజేసి పోషించుచుండెడివారు. అయిదువందలవిద్యార్థులకు వేదములనుజెప్పు సుప్రసిద్ధపండితుడొకడు కాశీయందుండెనట. ఈయనపట్టణమందలి అల్లరులతోకూడిన జనసమూహమునుండి తప్పించుకొనుటకై విద్యార్థులను వెంటబెట్టుకొని అరణ్యమున కేగెననియు, ప్రస్తుతపు శాంతినికేతనమునబోలు అరణ్యకళాశాలలు పూర్వమందుకలవనియు, ఆయాకళాశాలలకు వి

ద్యాభోగమను పేరుతో ధనికులు సహాయమొనరించుచుండిరనియు చరిత్రవలన బోధపడుచున్నది. ఎనిమిదవశతాబ్దమందు బాహారు లోనికళాశాలకు మూడుగ్రామము లివ్వబడినట్లు తెలియుచున్నది. భాసుడు క్షాత్రవంశస్థులయాస్థానమందుండి సంస్కృతములో స్వప్నవాసవదత్తయను నాటకము రచించినాడు. రఘువంశము, కుమారసంభవము, మేఘదూత, శాకుంతల, మాలవకాగ్నిమిత్ర, విక్రమోర్వసీయ గ్రంథకర్తయగు కాళిదాసు ప్రవరసేనమహారాజుయొక్క ఆధిపత్యము క్రింద సేతుబంధమహాకావ్యమును రచించియున్నాడు గంగావంశీయుడైన దుర్వినీతుని, పల్లవవంశీయుడైన సింహావిష్ణుని ఆస్థానములందు భారవిమహాకవియుండెనని అవంతీసుందరీకథవలన దెలియుచున్నది. బీరారులోని భవభూతి, మలబారుయందలి శంకరాచార్యులు గొప్ప విద్వాంసులని చెప్పవచ్చును భోజరాజుయొక్క సంస్కృతకళాశాలయు అతనురచించిన జ్యోతిషగ్రంథములు, శిల్పగ్రంథములు, కావ్యములును హర్షచక్రవర్తియొక్క నాటకములు పశ్చిమచాలుక్యరాజ్యములో రచింపబడిన మితాక్షరయను ధర్మశాస్త్రగ్రంథము మొదలగునవి పూర్వుల విద్యాసంపద విద్యాభివృద్ధినిచాటుచున్నది పైనిపేర్కొనబడిన గ్రంథములేగాక, యింకాయితరగ్రంథము లనేకములు వారణాశిపట్టణమునందు పఠింపబడుచుండెడివి.

ఉజ్జయిని విశ్వవిద్యాలయము జ్యోతిషశాస్త్రపఠనమందు గొప్పప్రఖ్యాతివహించినదని పైనజెప్పియుంటిని. ఇక్కడినక్షత్రగణితశాలలు(Observataries) మేఘములనుగూడ దాటునంతటి ఎత్తుగానిర్మింపబడినవని ప్రతీతిగలదు. పర్వతశిఖరములనుగూడ ధిక్కరించు యీ విశ్వవిద్యాలయసౌధగోపురములలో మనోహరములగు సంగీతాదిశృంగారవిద్యలు చెప్పబడుచుండెడివట. సుప్రసిద్ధచైనాయాత్రికుడగు

హాలుయాంగ్ త్సంకియాంగు యీ విశ్వవిద్యాలయమునుగూర్చి యిట్లు ముచ్చటించియున్నాడు.

"The outside courts had four stages with dragon-like projections and coloured caves' pearl-red pillarsand richly ornamented belustrades and roofs covered with tiles that reflect light in a thousand shades."

గోడలయొక్క యిటికకట్టడమునుగూర్చి విశేషముగా పొగడుచు వ్రాసియున్నాడు. కాళిదాసు ఉజ్జయినినిగూర్చి అదియొక సుందరమైనట్టియు, మనోహరమైనట్టియు స్థలమని వర్ణించియున్నాడు. బాణుడుగూడ ఉజ్జయినీపట్టణమునుగూర్చి తనహర్ష చరిత్రలో వ్రాయుచు, విశాలమైన అంగడివీధులను, చిత్రవిచిత్రములైన రంగుపూయబడినచావళ్లను, సభామండపములును, బంగారు కెంపులు మాణిక్యరాసులును, చిత్రకళా ప్రవీణులసంఘములునుకలిగి కన్నులపండువు జేయుచుండెనని చెప్పియున్నాడు. పట్టణవాసులు విదేశభాషలనుగూడ నేర్చి బహువాక్చాతుర్యముగలవారని వ్రాసియున్నాడు. ఈనగరము ప్రాచీనభారతదేశము యొక్క గ్రీన్‌విచ్ (Greenwich) యని చెప్పవచ్చును. విదిశానగరములో వలెనే యిక్కడగూడ సాహిత్యశాస్త్రము, అలంకారశాస్త్రములు అభ్యసింపబడుచుండెను.

నవద్వీపము క్రీస్తుశకము 1063-వ సంవత్సరమున వంగదేశములోని సేనావంశపురాజుచే నిర్మింపబడినది. ఇంతకుపూర్వముకూడ యిక్కడ అనేకపండితులువచ్చి విద్యార్థులకు శాస్త్రబోధ చేయుచుండెడివారట. మొదటితార్కికసంస్థ స్థాపించిన అభిహోధయోగియు, తర్కశాస్త్రవిశారదుడగు వాసుదేవసార్వభౌముడును యిక్కడి విద్వాంసులలో ముఖ్యులు. ఇక్కడ తర్కము ప్రధానశాస్త్రముగా చెపబడుచుండెను. వ్యాకరణముగూడ ప్రధానశాస్త్రముకాకపోయిన రెండవస్థానమియ్యబడి బోధింపబడుచుండెను. విద్యాసక్తిగల

ద్ధులుగూడ యీనవద్వీపవిశ్వవిద్యాలయమునకువచ్చి తర్కశాస్త్రము నభ్యసించెడివారని తెలియుచున్నది.

కాంచీపురపట్టణము (Conjeevaram) సంగీత శాస్త్రమునకు, నాట్యశాస్త్రమునకు ప్రఖ్యాతిపొందియున్నట్లు మత్తవిలాసప్రహసనమువలన గ్రాహ్యమగుచున్నది. ఇక్కడనే తమిళసంగీతము వ్రాతరూపముదాల్చినది కాంచీయొక్క ధర్మపాలుడు హీనయానశాఖకు చెందిన నూర్వురుబౌద్ధవిద్వాంసులతో ఏడుదినములు చర్చసలిపి చివరకు వారినందరిని యోడించెనట. ఈపట్టణములో శంకరాచార్యులు ఒక విద్యాపీఠమును స్థాపించియున్నాడు.

వంగదేశమందు చతుష్పతులను పేరుతో కళాశాలలు (Call-eges) విరాజిల్లుచుండెడివి. ఇక్కడ వ్యాకరణశాస్త్రము, ధర్మశాస్త్రము, పురాణములు, దర్శనములు (philosophy) అభ్యసింపబడుచుండెను.

ప్రాచీనకాలమందలి మఠములనుగూర్చి కొద్దిగావిచారింతము. 788 A. D. వ సంవత్సరములో జన్మించిన అద్వైతమతస్థాపకుడగు శంకరాచార్యులు యీమఠములకు మూలపురుషుడు. ఈమఠములలో ప్రసిద్ధికెక్కినది మైసూరురాజ్యమందలి శృంగేరీమఠము. ఈమఠములలో సమస్తశాస్త్రములు (అందులో ముఖ్యము వేదాంతశాస్త్రము) పఠింపబడుచుండెడివి. ఈమఠముల పోషణార్థము మహారాజులు, సామాన్యజనులు ధనసహాయము చేయుచుండెడివారు హిందూమతమునకు సంబంధించిన మఠములేకాక బౌద్ధ, జైనమతములకుసంబంధించిన మఠములుగూడ పూర్వమందు కానవచ్చుచున్నవి. బౌద్ధమఠములను గుహా (Monasteries) యని పిలుచుటవాడుకయైయుండెను. ఈ మఠములందు విద్యాబోధజేయు పండితులు, విశాలహృదయముగలిగి, సంకుచితాభిప్రాయములు లేక, వారివారి మతాభివృద్ధికి పాటుబడు

చుండిరి. తిరువలీశ్వరములో మూడుమతములకు చెందిన మూడుమత ములు ఒకదానిప్రక్క నొకటి నిర్మింపబడినవి. మతపరిశీలనేగాక వేదములు, తర్కము, వ్యాకరణము, ధర్మశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము సాహిత్యశాస్త్రము, వేదాంతశాస్త్రములబోధకూడ జరుగుచుండును కొన్నికొన్ని మఠములలో వేదములు, వేదాంగములు, పురాణములు, కావ్యములు, నాటకములు, వ్యాకరణము, ధర్మశాస్త్రములు, యోగశాస్త్రములు, దర్శనములు, పఠింపబడుచుండెను మఠవిద్యార్థులకు భోజనవసతిసౌకర్యములు కలుగజేయబడినవి. దీనజనులకు, అనాథులకు అన్నదానము యీ మఠాధిపతులచే చేయబడు వాడుకకూడ యుండినట్లు తెలియుచున్నది ఈమఠములు సాధారణముగా దేవాలయమునకు చేరియుండెడివి. కాంచీపురములోని అండాయు సుందరపెరుమాళుని మఠము వేదపాఠమునకు పేరుపొందినది No. 202 of 1912 Mad. Ep. Rep. 1912-13) శాసనములవలన తిరువారైయూరు దేవాలయములో ఒక వ్యాకరణ-దాన-వ్యాఖ్యానమండపము Goam-dras hall) నిర్మించుటకును, వ్యాకరణ-దాన-పెరుమాళుని (శివ) పూజకును, ఉపాధ్యాయులయొక్కయు, విద్యార్థులయొక్కయు జీవనోపాధికిని ఒకధనికునిచే ధనసహాయము జేయబడినట్లు తెలియుచున్నది ఆమండపములోనే వ్యాకరణదాన పెరుమాళు, పాణినికి వరుసగా పదునాల్గుదినములు దర్శనమిచ్చి మహేశ్వరసూత్రములను బోధించినట్లు గూడ తెలియుచున్నది. మూడవకులోత్తుంగ చోళునిరాజ్యకాలమందు యీమండపపోషణార్థమై తిరువారైయూరు గ్రామవాసి యొకడు బహుమాన మొసంగెనని No 120 శాసనము చెప్పుచున్నది.

మాధవ్రడను వైశ్యపుంగవు డొకడు జననాథమండపమను పేరుతో వెలయు మండపమొకదానిని నిర్మించినట్లును 1062 A. D. కాలము నాటి వీరరాజేంద్రదేవునిచే వేదములు, శాస్త్రములు, వ్యాకరణము,

రూపావతారము బోధించుట కొకపాఠశాల నిర్మింపబడినట్లును, విద్యార్థులకు భోజనశాల (Hostel) యు, వైద్యశాలయు నిర్మింపబడినట్లును No 182 of 1915 శాసనమువలన గ్రహింపవచ్చును విద్యార్థులు ప్రతిశనివారమువాడు అభ్యంగనస్నానమునకై నూనెయివ్వబడుచుండెనని కూడ వ్రాయబడినది. వైద్యశాల వీరచోలయని పిలువబడినట్లును, అందు రోగులకు పదునైదుమంచములు (Beds) ఏర్పాటు చేయబడినట్లును కాన్పించుచున్నది ఈవైద్యశాలయందు ఒకవైద్యుడును, మందు దినుసులను గొనివచ్చు యిద్దరుసేవకులు, రోగుల సంరక్షణార్థమై యిరువురుపరిచారకులును నియోగింపబడిరట వైద్యశాలయందలి ఓషధులలో ఆహారీతకి, గోమూత్రహారీతకి, బల్లాతకహారీతకి, బిల్వాదిఘృత, వజ్రకల్ప, కల్యాణలవణ మొదలగునవి పేర్కొనబడినవి. అనేకతైలములుగూడ యున్నట్లు వ్రాయబడినది.

ఒకధర్మసత్రము నిర్మించుటకును, వ్యాఖ్యాతయొక్కయు, పౌరాణికునియొక్కయు, విద్యార్థులకు ఋగ్వేద యజుర్వేదములు చెప్పు గురువుయొక్కయు, పోషణార్థమై ఒకచాళుక్యవంశపురాణి చే బహుమాన మివ్వబడెనని No 518 of 1915 శాసనములో వ్రాయబడినది. ఒకదేవాలయములో ప్రాభాకరగ్రంథమునకు (ప్రభాకరుని మీమాంసగ్రంథము) వ్యాఖ్యానముజేయు పండితుల జీవనోపాధికై భట్టవృత్తిరూపమున కొంతభూమి, యొక ఉదారస్వభావునిచే దానమియ్యబడెనని ఒకచోళశాసనములో లిఖింపబడినది. మొదటి రాజరాజచోళుని కాలములో విద్యాభివృద్ధికై యివ్వబడినభూమికై పన్ను చెల్లింప నవసరము లేదని శాసింపబడినది. ఇట్టిభూమిని పరిగ్రహించు విద్వాంసుడు అప్పుడప్పుడు మహోపాధ్యాయయని పిలువబడుచుండెనట. వ్యాఖ్యానమండప మనుపేరుతో నొప్పు విద్యాలయపోషణార్థమై యివ్వబడు గ్రామమందలి పన్నులను వసూలుజేయుబాధ్యత

గ్రామసభ్యులు వహించుచుండినట్లు Nos. **110, 136, 146** of **1912** శాసనములమూలమున స్పష్టపడుచున్నది. సన్యాసులకు, మతోపదేశకులకు, వేదవిద్యార్థులకు భోజన, వస్త్ర సౌఖ్యములు కలుగజేయుటకు నలుబదినాలుగు గ్రామములు బహుమానరూపమున యివ్వబడినట్లు No **259** of **1905** (About **1112** A. D.) శాసనమే సాక్ష్యము గుంటూరుతాలూకాలోని మాల్కాపుర శాసనమువలన, గౌడదేశీయ విద్వాంసుడగు విశ్వేశ్వర-శివాచార్యునకు పూర్వమున్న పాశుపతగురువుల యొక్క చరిత్ర వెల్లడియగుచున్నది. ఈమతాచార్యుడు ప్రజోపకారబుద్ధిగలిగి ఒకదేవాలయమును, భోజనశాలను, ద్రవిడబ్రాహ్మణగృహములును, శైవపురాణవిద్యార్థులకు పాఠశాలలను, రోగులకు చికిత్సజేయుటకై వైద్యశాలలను నిర్మించినట్లు ఋజువగుచున్నది. వేదపండితులు ముగ్గురును, తర్కము, సాహిత్యము, ఆగమశాస్త్రములు జెప్పుటకు అయిదుగురుపాధ్యాయులును నియమింపబడినట్లుకూడ తెలియుచున్నది చికిత్సజేయుట కొకవైద్యుడును లెక్కలువ్రాయుటకు ఒకగణికుడును (కాయస్థ Accountant) నియోగింపబడిరట. మొదటి రాజేంద్రచోళునిరాజ్యకాలమందు (Not later than A. D. 1023) రాజరాజ-చతుర్వేది-మంగళమను గ్రామసభవారిచే వేదపాఠశాలకొరకును, విద్యార్థులభోజనశాలకొరకును ధనసహాయము చేయబడినట్లు No **333** of **1917** శాసనములో కనబడుచున్నది. విద్యార్థులసంఖ్య యీదిగువరీతిగా నుండినట్లు తేలుచున్నది.

75 ఋగ్వేద విద్యార్థులు.
75 యజుర్వేద విద్యార్థులు.
20 ఛాందోగ్యసామ విద్యార్థులు.
**20** తలవకారసామ విద్యార్థులు.

20 వాజసనేయ విద్యార్థులు.
10 అథర్వవేదవిద్యార్థులు.
10 బౌధాయనీయ గృహ, కల్ప, గణ విద్యార్థులు.
40 రూపావతార విద్యార్థులు.
25 వ్యాకరణ విద్యార్థులు
35 ప్రాభాకర విద్యార్థులు.
10 వేదాంత విద్యార్థులు.

---

340

ఈసంస్కృతశాఖలలోని విద్యార్థులసంఖ్య 340. ఉపాధ్యాయులసంఖ్య యీ దిగువరీతిగా కనిపించుచున్నది.

3 ఋగ్వేదోపాధ్యాయులు.
3 యజుర్వేదోపాధ్యాయులు.
1 ఛాందోగ్యసామోపాధ్యాయుడు.
1 తలవకారసామోపాధ్యాయుడు.
1 వాజసనేయోపాధ్యాయుడు.
1 బౌధాయనీయ గృహ కల్ప, కాథకోపాధ్యాయుడు.

---

10

ఉపాధ్యాయులకును, విద్యార్థులకును భోజనసదుపాయములు చేయబడెను. ఊర్వారీయమనుసంఘము (The village supervision Commitee) న్ను, గ్రామమందలి బ్రాహ్మణవర్తకులున్ను, భోజనశాలకు కావలయు సరకులనన్నిటిని సమకూర్చుచుండిరట

Epigraphica Inaica, Vol. IV. లో పల్లవవంశీయుడైన విజయనృపతుంగవర్మయొక్క తామ్రశాసనము లయిదు కాన్పించుచు

న్నవి. అవి సంస్కృతభాషలో వ్రాయబడినవి. బహుగ్రామ (Identified with Batur in French India) మందు విద్యాస్థాన మనుపేరుతోనున్న కళాశాల పోషణార్థమై మూడుగ్రామము లియ్యబడినట్లు ఆతామ్రశాసనములవలన గ్రహింపవచ్చును. ఈకళాశాల యందు వేదములు 4, అంగములు 6, మీమాంస 1, న్యాయ 1, పురాణ 1, ధర్మశాస్త్ర 1, మొత్తము పదునాలుగు గణములు అభ్యసింపబడుచుండినట్లు తెలియుచున్నది. No 176 of 1919 శాసనము వలన 1048 A. D. కాలమునాటి సంస్కృతకళాశాలయొక్క చరిత్ర బయల్వెడలుచున్నది.

వేదశాఖోపాధ్యాయులసంఖ్య.

3 ఋగ్వేదోపాధ్యాయులు.

3 యజుర్వేదోపాధ్యాయులు.

1 ఛాందోగ్యసామోపాధ్యాయుడు.

1 తలవకారసామోపాధ్యాయుడు.

1 అపూర్వఉపాధ్యాయుడు.

1 వాజసనేయ ఉపాధ్యాయుడు.

2 బౌధాయనీయ, సత్యాషాఢసూత్రోపాధ్యాయులు.

—

12

శాస్త్రశాఖోపాధ్యాయులసంఖ్య.

1 వేదాంతశాస్త్రోపాధ్యాయుడు.

1 వ్యాకరణశాస్త్రోపాధ్యాయుడు.

1 రూపావతారోపాధ్యాయుడు.

1 శ్రీభారతోపాధ్యాయుడు.

1 రామాయణోపాధ్యాయుడు.

1 మనుశాస్త్రోపాధ్యాయుడు.
1 వైఖానసశాస్త్రోపాధ్యాయుడు.

---

7

కళాశాలవిద్యార్థులసంఖ్య 190 (ఋగ్వేదము 60, యజుర్వేదము 60, ఛాందోగ్యసామము 20, ఇతరశాస్త్రములు 50).

పైని పేర్కొనబడిన శాస్త్రములేగాక సైన్సు (Science) కు సంబంధించినవిద్యలుకూడ అభ్యసింపబడుచుండెడివి. రస, రసాయన, పాదాంజన, ఖడ్గయోగ, ఘుటిక (Magic) కన్యకావాద (Crotics) మంత్రవాద (Spells), ధాతువాద (Metallurgy), ధూమ్రవాద (Art of producing optical illusions in smoke) గరుడవాద (Science of birds రసవాద (Chemistry) మొత్తము పదునెనిమిదువిద్యలును అభ్యసింపబడుచుండినట్లు నెల్లూరుశాసనమువలన స్పష్టపడుచున్నది అప్పటివిద్వాంసులయొక్క పాండిత్యముచూచిన ఆశ్చర్యపడక తప్పదు.

జ్యేష్ఠపాదసోమయాజి యనువిద్వాంసుడు సామగానములో నసమానప్రజ్ఞగలవాడని వ్రాయబడెను వేదములు, వేదాంగములు, వ్యాకరణము, కర్మకాండజ్ఞానకాండలు, శ్రుతిస్మృతులు, కావ్యములు, నాటకములు, పురాణములు యిత్యాదిగ్రంథములలో విశేషపరిచయము గలదనియు, సర్వజ్ఞానవిజ్ఞానధురీణుడనియు లిఖించబడినది.

అద్వైతమతాచార్యుడగు శంకరాచార్యునిచే విద్యాపీఠములు (Seats of learning) స్థాపింపబడినవి. శృంగేరి, బదరి, ద్వారక, పూరి, కాంచినగరములందలి పీఠములు పేరు ప్రఖ్యాతివహించినవి. ఈవిద్యాపీఠములు గురుకులాశ్రమములకంటెను పెద్దవని చెప్పవచ్చును. అద్భుతమైన పాండిత్యము, మేధాసంపద, వాక్చాతుర్యముగల

గొప్పమతాచార్యులే విద్యాపీఠాధిపతులుగా నుండెడివారు. మతవిష యములలో జగద్గురుని వాక్యమే ధర్మవాక్యముగా పరిగణింపబడు చుండెను ఈవిద్యాపీఠములందు వ్యాకరణము, తర్కము, వేదములు, వేదాంతము ఉచితముగా చెప్పబడుచుండెను. అవసరమైనప్పుడు పీఠా ధిపతులుగూడ దేశప్రచారము జేసి ప్రజలను ధర్మమార్గావలంబకులు గా జేయుచుండిరి.

కేవలము విద్యార్థులకు విద్యాబోధ జేయుకళాశాలలే విద్యాల యములని తలంపరాదు. విమర్శ, పరిశోధనలు జేయు బ్రాహ్మణోత్త ములచే నిండియుండు ఘటిక, అగ్రహార, బ్రహ్మపురులుగూడ విద్యా లయములని చెప్పవలెను. పూర్వకాలమున దిట్టివి అసంఖ్యాకములుగా కానవచ్చును. ఘటిక లేక ఘటికాస్థానమని పెక్కుచోట్ల యుదాహ రింపబడినది. దీనినే ఆంగ్లభాషలో (Educational colony) యని పిలువవచ్చును దీనిని ధర్మరక్షణస్థలమని చెప్పుటలో నాశ్చర్య మిసు మంతయు లేదు. షికార్పూరు తాలూకా (Mysore State) లోని బెల్గామియందు 7 బ్రహ్మపురులును, మూడుపురములున్ను, అయిదు మఠములున్ను, అనేకఅగ్రహారములున్ను యుండినట్లు తెలియుచు న్నది. ఒకరాజు దక్షిణాపథమందు ఒకవిప్రకులమైనను లేదని ఉత్తర హిందూస్థానమునుండి ముప్పదిరెండు బ్రాహ్మణకుటుంబములను దీసి కొనివచ్చి బెల్గామికి సమీపముగానున్న తాల్గుండఅగ్రహారములో నివసింపజేసినట్లు ఒకశాసనములో వ్రాయబడినది మూడవశతాబ్దమం దలి కాదంబవంశస్థునిచే నియ్యబడిన అగ్రహారమని చరిత్రకారులు నిర్ణయించినారు. ఈఅగ్రహారములందు చతుర్వేది, త్రివేది, సోమ యాజి, సప్తాంగవిద్, భట్ట, క్రమవిద్, సర్వక్రతు, యాజి, వాజ పేయి మొదలగు బిరుదునామములు విద్యావిశేషముచేతను వారు చేయుయాగాదికర్మలచేతను సంపాదించిన బ్రాహ్మణులు నివసించుట

ఆచారముగా నుండెను ఇక్కడ సర్వకాలములందును వేదాధ్యయనము జరుగుచుండును రాజులు, మహారాజులు యీపండితులకు ధనసహాయము చేసి పోషించుటయు కలదు. బేగూరిలో 1300 బ్రాహ్మణులుగలరని వ్రాయబడినది. అంగ ఉపాంగములతో కూడిన చతుర్వేదములును, మీమాంస, లోకాయత, బౌద్ధ, సాంఖ్య, వైశేషిక మొదలగు శాస్త్రములును, ఆగమములును, పదునెనిమిదిస్మృతులును, పురాణములు, కావ్యములు, నాటకములును కరింపబడునట్లు కూడ లిఖించబడినది. నామశక్తి యను నాతడు వ్యాకరణమందు పాణినిని, నాటకములందును, సంగీతమందును భరతుని, కావ్యరచనయందు సుబంధు లేక మాఘుని, సిద్ధాంతమందు నకులీశ్వరుని పోలియుండెనని ఒకశాసనములో వివరింపబడినది.

ఇంతవరకును ప్రాచీనకాలమందలి హిందూవిశ్వవిద్యాలయములను, హిందువుల వేదశాస్త్రపఠనమునుగూర్చియు వివరించియుంటిని.

## II

ప్రాచీనభరతవర్షమందు బౌద్ధమతము విస్తారముగా వ్యాపించియుండుకాలమున విద్యావిధాన మెట్టిరూపముదాల్చెనో దెలిసికొనుటవసరము. సుప్రసిద్ధచీనాయాత్రికుడగు ఫాహియాను రెండవచంద్రగుప్తుని రాజ్యకాలమున భారతదేశమును దర్శింపవచ్చి దక్షిణదేశమును పాలించురాజొకడు అయిదంతస్తులును, పంద్రెండువందల గదులునుగలిగి రాయితో కట్టబడిన విద్యాలయమునకు బహుమానరూపమున ధనసహాయము చేయుచుండెనని వ్రాసియున్నాడు. కనూజ్ రాజుచే నిర్మింపబడిన ధర్మసత్రములో పదివందల బౌద్ధవిద్యార్థులును, అయిదువందల బ్రాహ్మణవిద్యార్థులును బసచేసి రాజుచే పలురూపముల పారితోషికములనందుచు విద్యాభ్యాసము చేయుచుండిరని హూ

యూన్ త్సియాంగ్ లిఖించియున్నాడు. లౌకికవిద్యార్థులు విద్యాభ్యాసానంతరమున ప్రభుత్వోద్యోగములో ప్రవేశించుచుండిరని ఇట్సింగు చెప్పియున్నాడు రుద్రదమనుని శాసనములవలన, రుద్రదమనుడు విద్యాపోషణ జేయుచుండెనని తెలియుచున్నది. రాష్ట్రకూటవంశస్థులు నాగార్జునునివంటి బౌద్ధపండితులను, సైనిక, రసాయనశాస్త్రజ్ఞులను రావించి గౌరవించుచుండెడివారని మహమ్మదీయచరిత్రకారుడగు ఆల్బరూని యభిప్రాయమైయున్నది. బ్రాహ్మణసన్యాసమఠములందు హిందూ యోగులును, బౌద్ధభిక్షువులును ఉచితముగా భోజనవసతిసౌకర్యములు కలుగజేయబడుచుండిరనియు, బౌద్ధసంఘారామములకిచ్చ్య బడుచుండిన భూములవలన వచ్చునాదాయము విద్యార్థులకొరకును, గురువులకొరకును ఖర్చుచేయబడుచుండెనని ఫాహియాన్, ఇట్సింగు యాత్రికులు సాక్ష్యమిచ్చుచున్నారు.

గౌతమబుద్ధుని కాలమునుండియు భారతదేశమందు విహారములు కానవచ్చుచున్నవి. ఇందు బౌద్ధసన్యాసులు పారమార్థికచింతగలిగి, బౌద్ధవేదాంతము నభ్యసించెడివారు. రానురాను ఈవిహారములందు వేదాంతశాస్త్రములేగాక లౌకికశాస్త్రములుగూడ నభ్యసింపబడుచుండినట్లు దెలియుచున్నది. ధనాఢ్యులగు వైశ్యులనేకులు యిట్టివిహారములనిర్మించి వాటిపోషణకై భూములను, ఉద్యానవనములను, ఫలవృక్షములతోటలను యుచితముగానిచ్చి వాటిని సంఘారామములక్రింద మార్చుచుండిరి. ఇందలి సన్యాసులు దేశమంతటను సంచారముచేసి అజ్ఞానమును నంధకారమును బారద్రోలి ప్రజలకు జ్ఞానమార్గమును జూపించుచు బౌద్ధమతమును విస్తరింపజేయుచుండెడివారు. హుయాన్ త్సికియాంగ్ తాను హిందూదేశమును దర్శించినకాలమున అయిదువేల సంఘారామములుగలవనియు, అందు కొన్ని యొకేనగరమందు కలిసియుండెడివనియు వర్ణించియున్నాడు. అశోకునిశాసనములు

లమూలమున అశోకునిగురువులలో బ్రాహ్మణులును, అజీవకులును గలరని గ్రహింపవచ్చును బౌద్ధవిద్యాలయములన్నియు కేవలబౌద్ధమ తపీఠములై బ్రాహ్మణవిద్యార్థులనుగాని బ్రాహ్మణమతాచార్యులను గాని చొరనివ్వకుండెడివని తలంపరాదు. బౌద్ధగురువులపట్టణముల కును, పల్లెలకును దూరముగా ఏకాంతస్థలమున విద్యాలయముల నేర్పరచి, బౌద్ధమతసంబంధమైన విద్యగఱపుచు బౌద్ధవాఙ్మయమును విస్తరింపజేసిరి.

బౌద్ధమతావలంబకులగు రాజులనేకులు ప్రాచీనకాలమందు తమ తమవిద్యావసతు (Halls of discussion) లందు కావ్యగోష్ఠికొరకై పండితసభలను గావించుచుండెడివారు ఇట్టిసభలందు పండితులచే వ్రాయబడు గ్రంథములనుగూర్చి చర్చచేయబడుచుండెనట. ఈసభలు వేదకాలమందలిసభలను, పరిషత్తులను బోలియుండెను. మహమ్మదీయ చక్రవర్తియగు అక్బరుయొక్క ఇబాదత్ ఖానాయిట్టిసభయేయని చెప్పవచ్చును రాజశేఖరుడు యిట్టిసభనేవర్ణించుచు పదునారు స్తంభ ములును, నాలుగువైపులను నాలుగు సింహద్వారములునుగలిగి యుం డెనని చెప్పియున్నాడు. సభామధ్యమున రాజుకూర్చుండుననియు, సభామండపమునకుత్తరమున సంస్కృతవిద్వాంసులును కవీశ్వరు లును, తూర్పున ప్రాకృతపండితులును, పశ్చిమమున అపభ్రంశకవు లును, చిత్రకారులును, దక్షిణదిక్కు పైశాచకవులును కూర్చుండుర నియు వ్రాసియుండెను.

భీమసేనజాతకమువలన జీవకుడు, బుద్ధునకు, బింబిసారమహారాజు నకు చికిత్సజేసెననియు, తక్షశిలానగరమందు కొన్నివత్సరములు ఆత్రే యునిక్రింద వైద్యశాస్త్రము నభ్యసించెననియు ద్యోతితమగుచున్నది తక్షశిలావిశ్వవిద్యాలయము ఒకేపెద్దవనమందు నిర్మింబడినదట ఈవ నమందు పలువిధములగు వృక్షములును, లతలును పెంచబడుచుండె

డివి. ఇందలిఫలములు, దుంపలు, ఓషధులు విద్యాభ్యాససందర్భమున వాడబడుచుండెడివి (Experimentation) పాఠముమంత్రముకూడ విద్యార్థులకు ఉపదేశింపబడుచుండినట్లు చంపయ్యజాతకములో వ్రాయబడినది. దేశదేశములనుండి విద్యార్థులు యీతక్షశిలావిశ్వవిద్యాలయమునకువచ్చి అందలి యధ్యాపకులశిక్షకులోనై విద్యాభ్యాసము చేయుచుండిరి.

ఫాహియాను పాటలీపుత్రనగరమందు మూడేండ్లు నివసించి సంస్కృతవిద్యలనభ్యసించెను. పాటలీపుత్రలో హీనయాన, మహాయాన సంఘారామములు రెండుగలవనియు, అం దేడువందల బౌద్ధసన్యాసులు విద్యగఱపుచుండిరనియు వ్రాసియున్నాడు. తామ్రలిప్తియందు వేయిసన్యాసులతో కూడిన పదిసంఘారామములుగలవని హుయాన్ త్సాంగ్ వ్రాసెను. హిరణ్యపర్వతమందు నాలుగువేల బౌద్ధసన్యాసులతోనిండిన సంఘారామములు గలవనికూడ లిఖించియున్నాడు.

పాటలీపుత్రమున కనతిదూరముననే జతవనసంఘారామము గలదు. రాజులును, ధనవంతులను వర్తకులును యీసంఘారామమునకు ధనసహాయము జేసి తగురీతిని పోషించుచుండెడివారట. ఆ ప్రాంతవాసులుకూడ యీవిద్యాలయమునకు కావలయువస్తువులు సమకూర్చుచు విద్యాభివృద్ధికి తోడ్పడుచుండెడివారు. ఈవిశ్వవిద్యాలయసభామండపమున భిక్షువులందరుజేరి వివిధమతసిద్ధాంతములను చర్చించుచుందురు. ఈచర్చ అప్పుడప్పుడు మూడుదినములవరకు జరుగుచుండెడిదని వ్రాయబడినది. ఈవిశ్వవిద్యాలయములో మతోపదేశముకొరకు ముఖమండపములును, ప్రార్థనాగారములును, ఏకాంతస్థలములును, పుస్తకభాండాగారములును, పఠనమందిరములును (Reading Rooms) భోజనశాలలును, స్నానమున కుపకరించుగదు

లును, కన్నులపండువు జేయు యుద్యానవనములును, ఒకవైద్యశాలయును గలిగి ప్రకాశించుచుండెను. పుస్తకభాండాగారమందు కేవలము బౌద్ధగ్రంథములేగాక బౌద్ధేతరగ్రంథములుగూడ కానవచ్చును.

బౌద్ధవిశ్వవిద్యాలయములలో నలందవిశ్వవిద్యాలయము ముఖ్యము. బీహారులోని రాజగృహకయిదుమైళ్ళదూరములోగల బేరగాను పూర్వమీవిశ్వవిద్యాలయముండు స్థలమని చెప్పవచ్చును. ఇక్కడ నెన్ని సంవత్సరములు విద్యాభ్యాసము జేసినను తృప్తిచెందరట. కేవలము గ్రంథములు వల్లెవేయుటయే యిక్కడివిద్యార్థుల యాశయముగాదు. గ్రంథవిమర్శ, గ్రంథపరిశోధన తన్మూలమున జ్ఞానసంపాదన వీరియాశయములు. 399 A. D. 414 A. D. మధ్యకాలమున ఫాహియాన్ యీవిద్యాలయమును దర్శించెను.

ఆసమయమున నీవిద్యాలయములో ఒకబౌద్ధమఠమైనను, ఒక్క బౌద్ధసన్యాసియైనను కాన్పించలేదట 450 A. D. తరువాతనే యీ విశ్వవిద్యాలయము విశేషమైన ప్రఖ్యాతివహించెను విక్రమాదిత్యుని (రెండవ చంద్రగుప్తుడు) వంటి మహారాజులచే సంఘారామములు నిర్మింపబడినవి. శక్రాదిత్యుడు (శ్రీహర్షుడు) యీవిద్యాలయభవనములను కట్టించెననియు, వాటిపోషణార్థమై ధనసహాయము జేయుచుండెననియు హుయాన్‌త్సియాంగు వ్రాసియున్నాడు. బుద్ధగుప్త, తథగుప్తుడు బాలాదిత్యుడు దివ్యభవనములను నిర్మించి యీవిశ్వవిద్యాలయమునకర్పించెనని చెప్పబడినది. ఈవిశ్వవిద్యాలయభవనములు నిర్మింపబడినస్థలము పూర్వము మామిడితోటయనియు, దానిని అయిదు వందల వర్తకులు పదికోట్ల బంగారునాణెములకు కొని బుద్ధునకు కానుకరూపమున నొసంగెనని హుయాన్‌త్సియాంగు చెప్పియున్నాడు. నలందవిద్యాలయము, బోధగయ, సారనాథవిద్యాలయములను పోలియుండెననుటలో నాశ్చర్యము లేదు. ఎనిమిదిసభామండపములును,

మూడువందలగదులును గలవట. నక్షత్రగణితశాలలు (Observatories) గూడగలవని తెలియుచున్నది. విశ్వవిద్యాలయపుస్తకభాండాగారము ధర్మగంజియని పిలువబడినట్లును, ఆభాండాగారముకొరకై రత్నసాగర, రత్నదధి, రత్నరంజక యనుపేర్లతో యొప్పు మూడుదివ్యభవనములు నిర్మింపబడినట్లును టిబెట్టుగ్రంథములవలన బుజువగుచున్నది. తొమ్మిది యంతస్తులు గల రత్నదధిసౌధమందు ప్రజ్ఞపరమితసూత్రిగ్రంథములు, సమాజగుహ్యము మొదలుగాగల తాంత్రికగ్రంథములు తదితర బౌద్ధగ్రంథము కానవచ్చుచుండెనట. బౌద్ధమతమంతరించి, శైవమతము తిరిగి ప్రజలలో వ్యాపింపబడుకాలమున, ధర్మపాలుడు యిక్కడ ఆరుకళాశాలలను కట్టించెను. తురకలదండయాత్రానంతరమున యిక్కడి దేవాలయములు, చైత్యములును ముదితభద్రునిచే మరమ్మత్తు చేయించబడెనని గ్రంథములవలన తెలియగలదు. మగధరాజ్యమంత్రియగు కుకుతసిద్ధుడు యిక్కడొక విద్యాలయము నిర్మించెనట. ఈవిశ్వవిద్యాలయమునకు మూడువందలగ్రామములు గలవనియు, వాటివలన వచ్చువాదాయము విద్యాలయమునకే ఖర్చుచేయబడుచున్నదనియు చెప్పబడినది. విక్రమాదిత్యుడు నలబది విద్యార్థులకు యుచితముగా భోజనమిడుచుండెను. పదునెనిమిది విధములగు హీనయానమతమునకు సంబంధించిన పండితులనేకులిక్కడనే నివసించియుండిరి. ఈవిశ్వవిద్యాలయముయొక్క పండితబృందమునుగూర్చి హుయాన్‌త్సాంగీరీతిగా వర్ణించెను.

"There were Dharmapala and Chandrapala who gave fragrance to the Buddha's teaching; Gunamathi and Sthiramati of spotless reputation among contemporaries; Prabha Mithra of clear argument, Jinamitra of elevated conversation; Jnanachandra of perspicacious intellect and exemplary character; and Principal Silabhadra whose per-

fect excellence as a versatile genins was buried in obscurity.

యూరపుఖండవాసులు నామరూపములు లేక అడవులందును కొండలందును దిరుగుచు అనాగరికులై యుండు సమయమునకే యీనలందవిశ్వవిద్యాలయము మహోన్నతస్థితికి వచ్చెననుటలో సందేహమిసుమంతయును లేదు. టిబెట్టు, చైనా, మధ్యఆసియా, బొఖారా, కొరియా దేశములనుండి యనేకసన్యాసు లీవిశ్వవిద్యాలయమునకు వచ్చి ఉచితముగా భోజనవసతి సౌకర్యము లనుభవించుచు జీవితమంతను విద్యనభ్యసించుటయందే గడుపుచుండిరి. హుయాన్‌త్సికియాంగిట్లు వ్రాసియున్నాడు.

"Mouks from Tibet, China, Central Asia, Bokhara and Korea found free board, lodging and Instruction here. Foreign students flocked to Nalanda, in response to the kind invitation of king Baladitya, and with a view to clear their honest doubts."

ఈవిశ్వవిద్యాలయమందు పదివేలవిద్యార్థు లుచితముగా విద్యనభ్యసించుచుండిరనియు, 1510 యధ్యాపకులుగలరనియు దీనియొక్క కీర్తి దూరదేశములకుకూడ వ్యాపించెననియు వ్రాసియున్నాడు. వేదములు, హేతువాదవిద్య, శబ్దవిద్య, చికిత్సవిద్య, సాంఖ్య, న్యాయయోగశాస్త్రము లిక్కడ చెప్పబడుచుండెడివి. ప్రధానాధ్యాపకుడగు శీలభద్రునికడ యీచైనాయాత్రికుడు యోగశాస్త్రము నభ్యసించెను. 673 మొదలు 6×7 A. D. వరకు హిందూదేశములో సంచారముచేసిన ఇట్సింగు యను చీనాయాత్రికుడు నలందవిశ్వవిద్యాలయమందు పదిసంవత్సరములుండి విద్యనభ్యసించి విద్యాలయమునను విశేషముగా పొగడియున్నాడు. ఈవిశ్వవిద్యాలయము 850 A. D. వరకు మంచిస్థితిలోనున్నదని చెప్పుటకనేకసాక్ష్యములు గలవు. అనంతరము యిద్దరుతీర్థికసన్యాసు లిక్కడయజ్ఞము జేసిరనియు, విద్యాలయమునకు

నిష్పంటించిరనియు, అందుమూలమున రత్నదధిలోని గ్రంథములుకొన్ని కాలిపోయెననియు నొకకథవలన దెలియుచున్నది. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను తొమ్మిదవశతాబ్దములో యీవిద్యాలయము అదృశ్యమయ్యెనని చెప్పవచ్చును నలందవిశ్వవిద్యాలయమునకు పశ్చిమముగా యిరువదియొక్క మైళ్ళదూరములో తిలదక విశ్వవిద్యాలయముగలదు. బింబిసారమౌర్యుని వంశమందలి కడపటివానిచే నిర్మింపబడినది ఇందు వేయిమంది విద్యార్థులు మహాయానమతగ్రంథములు చదువుచుండిరట. హుయాన్ త్సెంగ్ యీవిశ్వవిద్యాలయమునుగూర్చి యిట్లు లిఖించినాడు.

"It has four walls, three storied belvederes, lofty towers connected at intervals with double gates which open inwards. It was built by the last scion of the family of king Bimbsara Maurya; learned men from different countries and cities gravitated here There are a thousand students engaged in the study of the great Vehicle (the Mahayana)".

వాయువ్యమూలనున్న కూచి సంఘారామము వివిధ దూరదేశములనుండి వచ్చిన పండితకోటికి ఆశ్రయస్థానమై యొప్పుచుండెను. వృక్షములోని బుద్ధసోదరులనుగూర్చి హుయాన్ త్సెంగ్,

"Lucid expounders of abstract philosophical doctrines who solved the doubts of distinguished brethren from other places."

కామరూప (Assam) కర్ణ సువర్ణ (Bengal) ఓఢ్ర (Orissa) మాళవదేశములలోగూడ గొప్పగొప్ప విద్యాలయములుండినట్లును, అసంఖ్యాకులగువిద్యార్థులీదేశములు పోయి విద్యను సంపాదించుచుండినట్లును చరిత్రవలన బోధపడగలదు విజయవాడనుగూర్చి ఒకచరిత్రకారుడిట్లు చెప్పియున్నాడు.

"At Vijayavada (Bezwada) was the school of Bhairveka, which outwardly displayed the Sankhya garb but inwardly propagated the doctrines of Nagarjuna."

ఓదంతపురి (Uddandapura) సంఘారామము మగధరాజ్యాధిపతియగు గోపాలుని (లోకపాల) చే 730 A. D. వత్సరప్రాంతమున స్థాపింపబడినది. ఇందు బ్రాహ్మణబౌద్ధగ్రంథము లనేకములున్నవి. 1197 A. D. సంవత్సరములో మహమ్మదీయు లీపురమును ముట్టడించి యీసంఘారామమును పాడొనరించి, అందలిసన్యాసులను చిత్రవధ గావించిరి. మహమ్మదీయులదండయాత్ర బౌద్ధమతమంతరించుటకు కొంతవఱకు హేతువగుచున్నదని చెప్పకతప్పదు.

బీహారులోని విక్రమశీలవిశ్వవిద్యాలయము గంగాతీరమున 800 A. D. ప్రాంతమున ధర్మపాలునిచే నిర్మింపబడినది. ఇందలి నూటఎనమండ్రు బౌద్ధభిక్షువులయొక్కయు, అసంఖ్యాకులగు యాత్రికులయొక్కయు పోషణార్థమై ధర్మపాలుడు ధనసహాయ మొనరించుచుండెను. విశ్వవిద్యాలయావరణలో నూటయేను దేవాలయములును, ఆరుకళాశాలలును కలవని తెలియుచున్నది. లోకప్రఖ్యాతివహించిన పండితుడు విశ్వవిద్యాలయాధికారిగా నియమింపబడుచుండెను. ఈవిద్యాలయమందలి అధ్యాపకులందరును సంపూర్ణస్వతంత్ర్యము గలవారైయుండిరి. హర్షచక్రవర్తి సభను ప్రవేశించునప్పుడయినను యీఅధ్యాపకులు నిలబడలేదని వ్రాయబడినది. ఈయుదాహరణ వారియొక్కస్వతంత్ర్యమును వెల్లడిచేయును. నలందవిశ్వవిద్యాలయముతో సంబంధముకలిగి నాలుగు శతాబ్దములు తాంత్రికబౌద్ధమతపీఠమై వెలసెను. 1203 A. D. వ సంవత్సరములో భక్తియారుఖిల్జిచే ముట్టడింపబడి నాటినుండియు క్షీణింపనారంభించెను.

కృష్ణాతీరమందు ధాన్యకటక విశ్వవిద్యాలయము సిద్ధనాగార్జునుని కాలమున బ్రాహ్మణ, బౌద్ధగ్రంథపఠనమునకు ప్రసిద్ధికెక్కెను.

ఈవిశ్వవిద్యాలయము ననుసరించియే టిబెట్టు ముఖ్యపట్టణముగు లాసాలో విశ్వవిద్యాలయము కట్టబడినది.

జలంధరులోని నాగరధనవిహారము, కన్యాకుబ్జములోని భద్రవిహారము వైశాలిలోని శ్వేతపుత్రపీఠము, మహాబోధి, రక్తామృతపీఠములు విద్యాలయములై వెలయుచుండెను.

విద్యారంభమునకు పూర్వము హిందువులయుపనయన కర్మవలెనే విద్యాభ్యాసములకై భిక్షుసంఘప్రవేశమునకు పూర్వమే ప్రవ్రాజకర్మ నాచరించవలెను వినయపీఠికలో ప్రవ్రాజకర్మ మిట్లు వర్ణింపబడినది.

"Let him who wishes to receive ordination, first shave his hair and beard put on yellow dress, adjust his upper robe so as to cover one shoulder, salute the feet of the Bikshus with his head, sit down squatting on the floor, stand with joined and uplifted hands and say "I take my refuge in the Buddha, the Dharma and the Samgha."

ఈకర్మ ఇట్సింగు చెప్పినట్లు ఆరవసంవత్సరముననో లేక హుయాన్ త్సికియాంగ్ వ్రాసినట్లు ఏడవసంవత్సరముననో లేక యితర చరిత్రకరులు చెప్పినట్లు ఎనిమిదవసంవత్సరముననో ఆచరింపబడుచుండెనట విద్యార్థి సంఘప్రవేశకాలమున యేవిధమైనరోగము చేతను బాధపడనివాడై యుండవలెనను నియమముగలదు విద్యార్థి యిరువది సంవత్సరములువచ్చిన తరువాత, ఉపసంపదయను కర్మనాచరించవలెను. ముప్పదిసంవత్సరములు వచ్చువరకు విద్యనభ్యసించుచుండవలెను విద్యాభ్యాసానంతరమున గురుదక్షిణనిచ్చి తోచినవృత్తినవలంబించి జీవితము గడుపుకొనవచ్చును ఇట్సింగు యిట్లు వ్రాసియున్నాడు

"After getting rewards in debates, the students may follow whatever occupation they liked"

ఉదయమున, సాయంకాలమున పాఠములు చెప్పబడుచుండెను. అష్టమి, చతుర్దశి, పౌర్ణమి లేక అమావాస్య అనాధ్యయనపుదినములుగా పరిగణింపబడుచుండెను.

---

## తొమ్మిదవ భాగము.

ప్రాచీనభరతవర్షమందలి విశ్వవిద్యాలయములనుగూర్చి ఎనిమిదవ భాగములో సవిస్తరముగా ముచ్చటించియున్నాను. ప్రాచీనశిల్పోన్నతినిగూర్చియు, చికిత్సవిద్య, యుద్ధవిద్య, సంగీతవిద్య, అంకవిద్య, సాముద్రికాదిగుప్త జ్ఞానశాస్త్రములు, జ్యోతిశ్శాస్త్రము, పదార్థవిద్యలను గూర్చియు విపులముగా చర్చించుట ప్రస్తుతము మనముఖ్యకర్తవ్యము అయావిద్యలకు భారతవర్షమెట్లు జన్మస్థానమయ్యెనో, అవి భారతదేశమునుండి యెప్పుడెప్పుడేయే దేశములకు గొనిపోబడెనో, అవి యూరపుఖండ విజ్ఞానమున కెట్లు సహాయపడెనో దెలిసికొన వలసియున్నది

మొదట చికిత్సవిద్యను పరిశీలింతము. మానవహితకారియగు చికిత్సావిజ్ఞానములో భారతవర్షము తక్కినప్రపంచమునకు గురువై అగ్రస్థాన మలంకరించియుండెను. ప్రప్రథమమున గ్రీకులీవిద్యను భారతదేశమునుండి గొనిపోయిరనియు, గ్రీకులవలన రోమనులు, వారివలననే యూరోపియనులందరు యీవిద్యల నేర్చిరనియు పాశ్చాత్యపండితులే ధృవపరచుచున్నారు. విల్సను అధ్యాపకుడు ప్రాచీనకాలమందలి హిందువుల రోగనిదానమును, శస్త్రచికిత్సను విశేషముగా గొనియాడుచ, వారి నిదానశాస్త్రము పూర్ణశాస్త్రమని లిఖించియున్నాడు. (Wilson's Works Vol III) విలియంహంటరు ఇంపీరియల్ యిండియన్ గెజెటీరు (Imperial Indian Gazetteer) లో యిట్లు

వ్రాసియున్నాడు. "చికిత్సాశాస్త్రమందలి యన్ని విభాగములలోను గానబడు ఔషధములను ప్రాచీనహిందువులు యెఱిగియేయుండిరి. శరీరమందలి ప్రతియంగమును నాడి, పేశి, స్నాయువయితము వారికిదెలియును" వీబరు యను పాశ్చాత్యఖండితుడు వేదయుగమందలిహిందువుల పశుచికిత్స జ్ఞానమును విశేషముగా కొనియాడినట్లు యాతని Indian Literature యను గ్రంథమే సాక్ష్యము. ఈచికిత్సవిద్యను హిందువులనుండి అరబ్బులును, అరబ్బులనుండి గ్రీకులును యభ్యసించిరనియు, ప్రారంభమున భారతభూమే దీనికి పుట్టినిల్లనియు విలియం హంటరు స్పష్టీకరించియున్నాడు. 1905-వ సంవత్సరములో ఫిబ్రవరి మాసములో మద్రాసుగవర్నరు Lord Ampthill తన యుపన్యాసమం దిట్లు చెప్పియున్నాడు. "ఈచికిత్సవిద్య భారతదేశమునుండి అరేబియాకును, అక్కడనుండి యూరపుఖండమునకును బోయెను. ప్లేగును (పేచకరోగము) నాశనముజేయుటకు యూరపువైద్యశాస్త్రజ్ఞులు హిందూచికిత్సశాస్త్రము ననుసరించి వైద్యముజేయుదురు."

ఆయుర్వేదము హిందువుల చికిత్సాశాస్త్రమునకు మూలగ్రంథము. శస్త్రవిద్య, రసాయనవిద్య, ధాతుప్రయోగవిద్య, కాష్టాదిభేషజప్రయోగవిద్య ఇత్యాదివిద్యలన్నియు ఆయుర్వేదమువలన గ్రహింపవచ్చును. జలచికిత్స (Trydropathy) శస్త్రచికిత్స, అర్కచికిత్స మొదలగునవన్నియు ఆయుర్వేదమందు కానబడుచున్నవి. డాక్టరు హేనిమనుని హోమోపతిక్ చికిత్సయొక్క 'విషస్యవిషమౌషధమ్' సిద్ధాంతముకూడ ఆయుర్వేదమందు వివరింపబడినది. ఆయుర్వేదము ఎనిమిదితంత్రములక్రింద విభజింపబడినది 1 శల్య, 2 శాలక్య, 3. కాయ, 4 చికిత్స, 5. భూతవిద్య, 6 కౌమారభృత్య, 7. అగద, 8 రసాయన, వాజీకరణ. ఈయెనిమిదివిధములైన చికిత్సాతంత్రములందు శరీరవిజ్ఞానము, దేహవిజ్ఞానము, శస్త్రవిజ్ఞానము, ధాత్రివిజ్ఞాన

ము, చికిత్సావిజ్ఞానము, భేషజవిజ్ఞానము, రోగనిదానము, యిట్టివిషయము లనేకములు వర్ణింపబడినవి. మనుష్యులయొక్క చికిత్సయే గాక పశువులచికిత్స ప్రణాళికకూడ వర్ణింపబడినది. చరక, సుశ్రుత, వాగ్భట్టుల ఆయుర్వేద గ్రంథపఠనమువలన సర్వవ్యాధివినాశనోపాయముల నుగ్రహింపగలుగుదుము. ఆయుర్వేదశాస్త్రమహిమవలననే దారుణమైన రోగములన్నియుపోయి విశ్రాంతియు ఆరోగ్యముకలుగునని తెలియుచున్నది మనోరమ ఘోరమైన కుష్ఠురోగముచే పీడింపబడుసమయమున అశ్వినీకుమారులామెకు ఆయుర్వేదసహాయమున రోగవిముక్తిగలుగజేసిరిగదా! నిషధపుత్రునిచెవుడును, వధ్రిమతిపతియొక్క నపుంసకత్వమును ఆయుర్వేదవైద్యమువలననే నివారింపబడినవని గ్రంథములలో కాన్పించుచున్నది ఆయుర్వేదోక్త చికిత్సాశాస్త్రముయొక్క ఘనత నాడీశాస్త్రపఠనమువలన తెలియవచ్చును నాడీపరీక్షమూలమున సర్వరోగములు గుర్తింపబడి నివారణచేయబడుచున్నవి. నాడీపరీక్షవలన రోగి యెంతకాలమునుండి బాధపడుచుండెనో యింకను యెంతకాలము ఆరోగముచే పీడింపబడవలెనో గ్రహింపవచ్చును. ఈగంభీరమైన, సూక్ష్మమైన, నాడీజ్ఞానశాస్త్రమును పాశ్చాత్యవిద్వాంసులు యిప్పటికిని దెలిసికొనలేకపోవుచున్నారన్నసంగతి లోకవిదితము. డాక్టరు రేలి, ఆయుర్వేదమును ప్రశంసించుచు మ్మ్రదుమధుర భాషలో యిట్లు నుడివిరి "భారతీయులు శస్త్రచికిత్సలో విశేషనిపుణులని వారిగ్రంథమువలన ప్రకటితమగుచున్నది. నూటయిరువది యేడువిధములైన శస్త్రములను ప్రయోగించుచుండెడివారు శస్త్రప్రయోగమేగాక అనేక యంత్రములనుగూడ వాడుచుండెడివారు." వీబరు పండితుడిట్లు వ్రాయుచున్నాడు "శస్త్రచికిత్స (Surgery) లో ప్రాచీనార్యులు గొప్పనేర్పరులు. పాశ్చాత్యులు భారతీయులవలన శస్త్రవిద్యను అభ్యసింపగలుగుచున్నారు. వికృతమైన చెవినిగాని ముక్కు

ముగాని బాగుజేయుట ప్రాచీన హిందువైద్యులమూలముననే నేర్చిరి.” డాక్టరు హాంటరుకూడ ఆర్యులశస్త్రచికిత్సను విశేషముగా కొనియాడిరి. మిస్ మైనింగిట్లు వ్రాయుచున్నది. “ప్రాచీనహిందువుల శస్త్రచికిత్సయంత్రములవలన వెంట్రుకలుగూడ తిన్నగను, పొడుగుగను చేయవచ్చును.” ఇట్లే అనేకులు పాశ్చాత్యవిద్వాంసులు ప్రాచీనార్యులశస్త్రచికిత్సను పొగడియుండిరి. మనఆయుర్వేదము ప్రచారములో లేకుండుటకు కారణము కేవలము ఆయుర్వేదశాస్త్రజ్ఞానశూన్యతయనుటలో నాశ్చర్యములేదు. ఆయుర్వేదమందలి వాత, పిత్త, కఫములు ప్రకృతియందలి సత్వ, రజః తమోగుణములను బోలియున్నవి. వాత,పిత్త, కఫములను త్రిదోషములయొక్క సమత్వమువలన శరీరము నిరోగమగుచున్నది ఏదివిషమించినను మృత్యుదేవత సమీపించుచున్నదని మనము తెలిసికొనుచున్నాముగదా !

ఇంక అంకవిద్యయందలి పూర్వులఘనతను విచారింతము. బీజగణితము, దశాంశము, సంఖ్యానిర్ణయము, త్రికోణమితి, జ్యామితి, రేఖాగణితము, గణితము ఆదిగాగల అంకజ్ఞానమునకు భారతదేశమందలి మహర్షిగణమే ఆదికర్తయని ఐరోపాపండితు లంగీకరించుచున్నారు. ప్లేఫెయిర్ (Professor Playfair) అధ్యాపకుడు ఆర్యులత్రికోణమితిశాస్త్రము బహుప్రాచీనమైనదనియు, సూర్యసిద్ధాంతమందు వ్రాయబడిన త్రికోణమితిక్రియలు గ్రీసుదేశీయుల క్రియలకంటెను శ్రేష్ఠమైనవనియు, ఈశాస్త్రమును యూరోపియనులు పదునారవ శతాబ్దమువరకు నెరుగరనియు వ్రాసియున్నాడు. సూర్యసిద్ధాంతమును రచించుటకుపూర్వమే హిందువులు రేఖాగణితము నెరుగుదురనికూడ లిఖించియుండెను. బ్రహ్మగుప్తాది గణితశాస్త్రజ్ఞుల గణితగ్రంథములనుచూచి పాశ్చాత్యదేశస్థు లాశ్చర్యపడి దశాంశసంఖ్య (Decimals) భారతదేశీయులకు ప్రాచీనకాలమందే తెలియునని

గ్రహించిరి. ఆర్యభట్టుడు మొదలగువారిగ్రంథములవలన హిందువుల బీజగణితజ్ఞానము స్పష్టమగుచున్నది. 2260 వత్సరములకు పూర్వము డెమొఫేన్టినుయను గ్రీకుపండితుడు భారతీయుల గ్రంథసహాయము వలన తా నంతటి పాండిత్యము సంపాదించగలిగినట్లు అతను రచించిన గ్రంథములద్వారావిశదమగుచున్నది. 1200 సంవత్సరములకు పూర్వము అరబ్బీయచక్రవర్తియగు ఖాలిఫ్ ఆలమాన్సరు హారూన్ ఆల్ రసీదు కాలమున మహమ్మదు బిన్ మూసాపండితుడు బీజగణితాది గణితశాస్త్రములను అరబ్బీభాషలోని కనువదించినట్లు చరిత్రవలన ద్యోతితమగుచున్నది. ముసల్మానుచక్రవర్తులు యూరోపాఖండమందలి స్పెయిను, పోర్చుగల్ మొదలగుదేశములలో నధికారమును చలాయించుకాలమున భారతీయులసర్వవిద్యల నభ్యసించుటకై వారి రాజ్యము నందు గొప్పపాఠశాల నిర్మింపబడినట్లు చరిత్రయే ప్రమాణము. గ్రీసుదేశమునుండియు అరబ్బుదేశమునుండియు ననేకపండితులు వారి వారి దేశాధీశులనాజ్ఞను, సహాయమును గైకొని హిందూదేశమునకు వచ్చినట్లును, హిందూదేశములో గణిత, జ్యోతిష విద్యలను నేర్చి తిరిగి తమదేశములకుబోయి యక్కడ ప్రచారముసాగించినట్లును ఇతిహాస గ్రంథములలో నక్కడక్కడ కాన్పించుచున్నది. దీనివలన ప్రాపంచకమునకంతకును భారతదేశమే ఆదిగురువని ప్రకటనమగుచున్నది కదా! ప్రొఫెసరు మెక్డొనల్ (History of Sanskrit Literature) యను గ్రంథమున నిట్లు వ్రాసియున్నారు. "పృథ్వియందుండెడు అంక విద్యలకన్నిటికిని ఆదిఆవిష్కర్త భారతభూమియే. దశమికసంఖ్యకూడ అక్కడే ప్రారంభమైనది. ఎనిమిదవ లేక, తొమ్మిదవశతాబ్దములో భారతదేశము అంకవిద్యలో అరబ్బుదేశవాసులకు గురువుగానుండెను. ఈవిద్య అరబ్బులవలన పశ్చిమదేశములలో వ్యాప్తిచెందెను. మని యరునిలియమ్‌యొక్కయభిప్రాయ మిట్లున్నది. "హిందువుల జ్యామితి,

బీజగణితములు మొదట అరబ్బుదేశమందును, తరువాత యూరపులోను వ్యాపించెను. (Indian Wisdom) వీబరు, మిస్ మైనింగు యిట్టియభిప్రాయములనే వెలిబుచ్చిరి. ప్రొఫెసరు వాలెను Edinburgh Review and History of Indiaలో యిట్లు లిఖించియున్నాడు. "సూర్యసిద్ధాంతమందొకవిధమైన త్రికోణమితివర్ణనము కలదు. ఇది ప్రాచీన హిందువులవలన ప్రారంభమైనది. దీనిని అరబ్బులు, గ్రీకులు యెరుగరు" ఈప్రమాణములనుబట్టి అంకవిద్యయొక్క జన్మభూమి భారతవర్షమని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ప్రాచీనకాలమందు సాముద్రిక, కేరళ, స్వరోదయ జీవస్వరవిజ్ఞానాదిశాస్త్రములు భారతదేశములో కానవచ్చుచున్నవి. యూరపువాసులీశాస్త్రములనుజూచి విస్మితులై వీనిమహిమనుగూర్చి ప్రచారము గావించుచున్నారు. త్రికాలదర్శులగు మహర్షులు స్వయముగా రచించిన సాముద్రికశాస్త్రమందు రేఖాగణనము, ముఖచిహ్నగణనము మొదలగువిషయములు వ్రాయబడినవి. కేరళశాస్త్రములవలన జీవజంతువుల భావములను గ్రహింపవచ్చును. భూతభవిష్యత్కాలములందలి యద్భుతవిషయములు స్వప్నగోచారమువలనఁ దెలియగలవు. జాగ్రదవస్థలో కూడ శకునాదులమూలమున భూతభవిష్యత్తులను నిర్ణయింపగలుగుచున్నాము యోగిరాజమహర్షి పతంజలి తనయొక్క యోగసూత్రమందు శబ్దమువలన అర్థజ్ఞానము, అర్థమువలన భావజ్ఞానము, భావమువలన యథార్థజ్ఞానము యుదయించుచున్నవని వ్రాసియున్నాడు. దీనివలన వాచ్యపదార్థమునకును, వాచకశబ్దమునకును సంబంధమున్నదనియు, శబ్దమువలననే భావముయొక్క పూర్ణజ్ఞానము గలుగుచున్నదనియు విశదమగుచున్నది. ఇట్టి యద్భుతవిషయములు మహర్షులు జీవస్వరవిజ్ఞానమందు వివరించియున్నారు.

సామాన్యావస్థయందు వచ్చుమాటలవలన భవిష్యత్తును చెప్ప వచ్చును శబ్దోత్పత్తి, శబ్దవిచారణ, శబ్దఫలము మొదలగు విషయము లుస్వరోదయశాస్త్రమందును, జీవస్వరవిజ్ఞానశాస్త్రమందును సంగ్రహముగా వ్రాయబడినవి. ఆంగ్ల, జర్మను, ఫ్రెంచిభాషలలో స్వరోదయజ్ఞానగ్రంథములనేకముగా ప్రకటింపబడుచున్నవి యూరోపియనులు వారియొక్క పామిస్ట్రీవిద్యను మన సాముద్రికశాస్త్రమువలననే గ్రహించిరి. పశుభాషలవలన వానిమనోవృత్తులను కనిపెట్టుమార్గములుగలవని మన ప్రాచీనులే వ్రాసియున్నారు.

ఇంక జ్యోతిషశాస్త్రోన్నతిని విచారింతము. గణితజ్యోతిషము, ఫలజ్యోతిషము ఆదికాలమందు భారతభూమియందే జన్మించినవనుటలో సందేహ మిసుమంతయు లేదు. పాశ్చాత్యవైజ్ఞానికులు యింతవరకును భారతీయుల జ్యోతిషశాస్త్రమును పూర్తిగా గ్రహింపలేకున్నారు. యంత్రసహాయమువలన గణితజ్యోతిషమును ఉన్నతస్థితికి దీసికొనివచ్చిరిగాని ఫలజ్యోతిషమందలి సూక్ష్మతను గమనించుటకసమర్థులగుచున్నారన్న సంగతి మనమెరుగుదుము. ప్రాచీనజ్యోతిషగ్రంథములందు గ్రహములు, నక్షత్రములు, రాశిచక్రము, నక్షత్రచక్రము, అంశలు, విషువరేఖ, గోళకార్థ, ఉదీచీనరాశి మొదలగు రాశిభేదము, క్రాంతి, కేంద్రవ్యాసనిరూపణము, సుమేరు, కుమేరు, ఛాయాపథము, ఉపగ్రహములు, కక్షము, ధూమకేతు, ఉల్కాపిండ, నిర్ఘాత, మాధ్యాకర్షణశక్తి, సూర్య, మహాసూర్య మొదలగువాని భేదము, పృథివియొక్క యాకృతి, గ్రహణనిర్ణయము మొదలగు సకలగంభీర విషయసిద్ధాంతములు స్పష్టముగా కానబడుచున్నవి వీబరుపండితు డిట్లు వ్రాయుచున్నాడు. "ఈశాస్త్రము భారతవర్షమందు 2780 సంవత్సరములకుపూర్వమే జన్మించినది" కవుంటు జోర్నసుపండితుడు Theogony of the Hindus అను గ్రంథమం దిట్లు చెప్పుచు

వ్రాసెను. "కలియుగారంభమందే అనగా అయిదు వేలవత్సరములకు పూర్వమే ఆర్యుల జ్యోతిషశాస్త్రము ప్రచారమందుండెను" సర్ హంటరుగారియొక్క Indian Gazetteer లో నిట్లు కన్పించుచున్నది "అనేకవిషయములందు ఆర్యజాతియొక్క జ్యోతిషశాస్త్రము గ్రీకుల జ్యోతిషశాస్త్రముకంటె ఎక్కువయున్నతస్థితికి దేబడెను" అయనగతి, భూమి తనచుట్టును తానుతిరుగుట మొదలగువిషయములు వ్రాయబడిన హిందువులగణితము, టాల్మి లేక అరబ్బుదేశీయుల గణితముకంటెను ఎక్కువశుద్ధమైనదని కోల్‌బ్రూకు నుడివియున్నాడు. ప్రొఫెసరు విల్సను హిందువుల జ్యోతిషజ్ఞానమును గొనియాడుచు "ద్వాదశరాశినిర్ధారణ, గ్రహములయొక్కగతి, పృథివి శూన్యమందు దిరుగుట తనకక్ష్యమందు దైనికభ్రమణము, చంద్రగతి, భూమియొక్కయు, చంద్రునియొక్కయు దూరత్వనిర్ణయము, చంద్రసూర్యగ్రహణకాల నిర్ణయము మొదలగు సమస్తవిషయములు ప్రాచీనార్యజాతియొక్క జ్యోతిషవిద్యయందు స్పష్టీకరింపబడిన"వని లిఖించియుండెను.

విష్ణుపురాణము:—

స్థాలీస్థమగ్నిసంయోగా దుద్రేకిసలిలంయథా,
తథేందువృద్ధౌ సలిలమంభోధౌ మునిసత్తమ!
నన్యూనా నాతిరిక్తాశ్చ వర్ధన్త్యాపో హ్రసంతిచ,
ఉదయాస్తమయేష్వేందోః పక్షయోః శుక్లకృష్ణయోః.
దశోత్తరాణిపంచైవ అంగుళానాంశతానివై,
అపాంవృద్ధిక్షయౌదృష్టౌ సాముద్రీణాంమహామునే.

సముద్రముయొక్క పాటుపోటులు శుక్ల, కృష్ణపక్షములందలి చంద్రకళలమూలమున కలుగుచున్నవని వ్రాయబడినది. తిథి, వారములు కనుగొనువిధానము మహర్షులే నిర్ణయించిరి. దివారాత్రములు

ప్రమాణముగా నుండు దినమును యూరోపియన్ పండితుడగు టోల్మి కు పూర్వమే మన యార్యులు నిరూపణ జేసియున్నారు.

నక్షత్రకల్పమం దిట్లు వ్రాయబడినది:—

“కపిత్థఫలవద్విశ్వం దక్షిణోత్తరయోః సమమ్”

వెలగపండువలె భూమి గోళాకారముగాయున్నదనియు, ఉత్తరదక్షిణములు సమానముగా నున్నవనియు వివరింపబడినదిగదా! పాశ్చాత్యులు భూమినొక నారింజపండుతో పోల్చియున్నారు. కాని నారింజపండుకన్న కపిత్థఫలము పోలికతో సరిపోవునని చెప్పవచ్చును.

ఆర్యభట్టు డిట్లు వ్రాసియున్నాడు:—

“చలా పృథ్వీస్థిరా భాతి”

భూమి నిజముగా దిరుగుచున్నది కాని బాహ్యప్రపంచమునకు దిరుగక స్థిరముగా నుండినట్లు కనబడుచున్నది.

భపంజరః స్థిరో భూరేవావృత్యావృత్య ప్రాతిదైవసికౌ,
ఉదయాస్తమయౌ సంపాదయతి నక్షత్రగ్రహాణామ్.

నక్షత్రమండలము, రాశిచక్రము స్థిరముగానున్నదనియు, భూమియే తిరుగుట నిజమనియు స్పష్టపడుచున్నదిగదా!

బ్రహ్మపురాణమం దిట్లు కనబడుచున్నది:—

“పర్వకాలే తు సంప్రాప్తే చంద్రార్కౌ ఛాదయిష్యతి,
భూమిచ్ఛాయాగతశ్చంద్రం చంద్రగోర్కం కదాచన.”

జ్యోతిషాచార్యుల గ్రంథమం దిట్లున్నది:—

“ఛాదకో భాస్కరస్యేందురధఃస్థో ఘనవద్భవేత్,
భూచ్ఛాయాం ప్రాఙ్ముఖశ్చంద్రో విశత్యర్థో భవేదసౌ.”

పైశ్లోకములవలన ప్రాచీన భారతవాసుల గ్రహణ విజ్ఞానము వెల్లడియగుచున్నది. ఇట్టిగంభీర విషయములు వ్రాయబడుటచేతనే యూరపుఖండమునందలి ప్రసిద్ధవిద్వాంసుడు బెయిలీ (Baily) పై

యిరు (Playfair) కేశేని (Casseni) మొదలగువారు జ్యోతిషశాస్త్రముయొక్క ఆవిష్కారకర్త భారతభూమియనియు అయిదువేలసంవత్సరములకు పూర్వమే వ్రాయబడిన జ్యోతిషగ్రంథములు నేటికిని ప్రమాణములనియు నిర్వచించియున్నారు. ప్రసిద్ధజ్యోతిషశాస్త్రి యధ్యాపకుడగు కోలుబ్రూకు (Colebrooke) ఆర్యజాతే యీశాస్త్రమునకు ప్రధానగురువని వ్రాసియున్నాడు. అరబ్బీయగ్రంథములయిన 'తార్వరికల్ హుకుమా, గులాస్ తుల్ హిసబ్' యీసంగతినే బుజువుచేయుచున్నవి. ఆర్యభట్టుని పేరు 'అజ్యభర్' యనియు, భాస్కరాచార్యుని పేరు "బాఖర్" యనియు వ్రాయబడినది. వీటివలన వైజ్ఞానికశాస్త్రముయొక్క ఆదిగురువు భారతవర్షమని తేలుచున్నది.

పదార్థవిద్యయొక్క ప్రాచీనత్వమును విచారింతము. న్యూటన్ చే కనిపెట్టబడిన పృథ్వియొక్క మాధ్యాకర్షణశక్తి మనప్రాచీనార్యుల గ్రంథములందు కనబడుచున్నది. శ్రీమద్భాగవతములో శ్రీకృష్ణభగవానుని యుపదేశమందు భూమియొక్క మాధ్యాకర్షణశక్తి వివరింపబడినది.

భాస్కరాచార్యుడు:—

"ఆకృష్టశక్తిశ్చ మహీతయా యత్ తు
ఖస్థంగురుః స్వాభిముఖంస్వశక్త్యా,
ఆకృష్యతే తత్ పతతీతి భాతి
సమేసమంతాత్ క్వపతత్వియంఖే."

ఆర్యభట్టుడు:—

ఆకృష్టశక్తిశ్చ మహీయత్తయా ప్రక్షిప్యతే తత్తయాధార్యతే,
పృథ్వికి యాకర్షణశక్తిగలదనియు, ఏవస్తువునైనను పైకెగురవేసిన నదితిరిగి భూమిమీదనే పడుననియు వ్రాయబడినది.

యూరపువాసులచే యంత్రసహాయమువలన కనుగొనబడు చున్న సూర్యకళంకములు (Solan spcts) మన పూర్వుల చేతనే కొన్నివేలవర్షములక్రిందట కనుగొనబడినట్లు విష్ణు, మార్కండేయ పురాణములవల్లను, వరాహమిహిరునివంటి జ్యోతిషశాస్త్రజ్ఞులవల్లను దెలియుచున్నది విశ్వకర్మ(ధమీయను యంత్రమును సూర్యమండలముపై ప్రయోగింపగా అది సూర్యమండలమును దగులొకని కళంక మునేర్పరిచెనని వ్రాయబడినది.

ఇంజనీరింగుపదార్థవిద్య ప్రాచీనకాలము దెట్టియున్నతస్థితికి దేబడెనో రామేశ్వరమందలి సేతుబంధమువల్లను, దేశము దక్కడక్కడ నిర్మింపబడిన దేవమందిరములవల్లను గ్రహింపవచ్చును. ఖనిజ పదార్థవిద్య (Minorology) స్వేదజసంబంధియపదార్థవిద్య (Bacteriology) పూర్వులకు దెలియునట్లు వారియాచారములమూలమునను, వారిగ్రంథములమూలమునను దెలియుచున్నది తులసీపత్రముయొక్క పవిత్రత, రోగబీజనాశకారియగు గోమయముయొక్క పవిత్రతను ప్రాచీనులు గుర్తెరింగినట్లు వారియాచారములే చెప్పుచున్నవిగదా! పూర్వులెందుచే గంగాజలమును పవిత్రోదకమని భావించిరో (Bacteriology) విద్వాంసుడగు డాక్టరు హాంకిన్సుయొక్క గంగాజల పరీక్షవలన దెలిసికొనవచ్చును. ఏవిషజీవినైనను గంగాజలమందు వడ వేసిన నది ఆరుగంటలలోపున చనిపోవునట.

"Mark Twein speaking of some test by Mr. Hankins, the scientest in Government employ at Agra in connection with the water of the Ganges remarks in his 'More Tramps Abroad' :—It had long been noted as a strange thing that while Benares is often afflicted with the cholera, she does not spread it beyond its borders. This could not be accounted for Mr. Hankins the Scientist in the employ of

the Government at Agra concluded to examine the water. He went to Benares and made his tests He got water at mouths of the sewers where they empty into the rivar at the bathing ghats: a cubic centimetre of it contained millions of cholera germs; at the end of six hours they were all dead. He caught a floating cospse, towed it to the shore and from beside it he dipped up water that was swarming with cholera germs, at the end of six hours they were all dead........ How did they find out the waters secret in those ancient ages?............We know that they had a civilization long before we emerged from savagery.”

పదార్థవిద్యయందు జగత్ప్రసిద్ధిగాంచిన శ్రీ జగదీశచంద్రబోసుని సృష్టిలోని జీవసత్వసిద్ధాంతమును, ఇంద్రియములయొక్క అస్తిత్వ సిద్ధాంతమును మహాభారతాది ఆర్యగ్రంథములలో వర్ణింపబడినవి గదా. డాక్టరు శ్రీ ప్రఫుల్ల చంద్రరాయియొక్క రసాయనవిద్యకు సంబంధించిన క్రియలు పూర్వులపదార్థజ్ఞానమును వెల్లడిచేయును.

II

ప్రాచీనభరతఖండమందలి సంగీతవిద్యోన్నతిని కొద్దిగా పరికింతము. గంధర్వవేదమే ప్రాచీనార్యజాతియొక్క సంగీతశాస్త్రమై యొప్పుచున్నది. యూరపువాసియు లీశాస్త్రమును ఐహికానందభోగముల కొరకసాధనముగా వాడుచున్నారుగాని ప్రాచీనార్యులు సంగీతశాస్త్రమును ప్రధానవిజ్ఞానశాస్త్రముగా పరిగణించుచు, ఆధ్యాత్మిక సంబంధమైన ఆనందమును పొందుచుండెడివారు సమిష్టిరూపమైన ప్రకృతియొక్క ధ్వని ఓంకారమైనట్లు వ్యష్టిరూపమైన ప్రకృతియొక్క ధ్వనులకు స్వరములని వ్రాయబడినది. ఈస్వరములే సంగీతశాస్త్రము. ఋషీశ్వరులకాలమందు పదునారువేలరాగరాగిణులు ఆలాపింపబడు చుండెడివనియు, మూడువందల ముప్పదియారు తాళములు వాయింప

బడుచుండెడివనియు గ్రంథములవలన వ్యక్తమగుచున్నది. కొన్నికొన్ని రాగముల మూలమున ప్రబలమైన శరీరవ్యాధులు మనోవ్యాధులు మటుమాయమగుననుటకు సంగీతశాస్త్రగ్రంథములే ప్రమాణము. శ్రోతలమనవ్వించుట వారియొక్క శోకమోహాదులను దూరము జేయుట యిత్యాదిపను లనేకము సంగీతమువలన చేయవచ్చునుగదా !

సంగీతశాస్త్రమందు ముఖ్యముగా సప్తస్వరములు గలవు. దీనికి కారణము బాహ్యప్రకృతి సప్తవిధములుగా యుండుటయేయని యనేకులు చెప్పుదురు అనేకపదార్థములు సప్తవిధములుగా లెక్కింపబడుచున్నవి. (సప్తరత్న, సప్తధాతు, సప్తరంగ, సప్తదిన, సప్తభూమిక, సప్తదర్శన మొదలయినవి) ఈసప్తస్వరముల ననుసరించియే రాగములన్నియు సృష్టింపబడినవి. ఈరాగములన్నియు నానావిధములయిన ప్రకృతియొక్క రూపములేయని చెప్పవచ్చును. భైరవరాగముయొక్కరూపము వైరాగ్యయుక్తమైనది ఆరూపమును వృషభవాహన-భస్మభూషిత-జటాకౌపీనధారితో పోల్చియుండిరి. ఈరాగము ననుసరించి యేమంత్రమునైనను లేక పదమునయినను పాడినయెడల వినువారియం దొకవిధమైన వైరాగ్యభావము జనించునని ప్రాచీనులు వ్రాసియున్నారు

పదార్థములందు దృశ్య, అదృశ్యభేదమున్నట్లే స్వరములలో గూడ శృత, అశృత భేదముగలదు పక్షి, కీటపతంగాది భూతముల యొక్క స్థూలధ్వనియే శృతస్వరము. వృక్ష, లతాదుల రససంచార క్రియయొక్కశబ్దము, మనుష్యులలోని శోణితసంచారక్రియయొక్క శబ్దము, గ్రహ, ఉపగ్రహ, భ్రమణక్రియయొక్కశబ్దము, యిత్యాదులను అశృతస్వరమని చెప్పుచున్నారు. సూక్ష్మదృష్టితో చూచిన ఓంకారమును అశృతశబ్దముల కాధారమని యెట్లు చెప్పుచున్నారో, అట్లే సప్తగ్రామములను శృతశబ్దముల కాధారమని చెప్పకతప్పదు.

ఈవిషయముకూడ ప్రాచీనార్యుల గ్రంథములవలన ప్రకటితముగు చున్నది.

ఆర్యసంగీతవిద్య త్రయీవిద్య—యథాగానము, వాద్యము, నృత్యము—యని చెప్పబడుచున్నది. నృత్యమందు మరల రెండుభాగములుగలవు. పురుషనృత్యము ను తాండవమనియు, స్త్రీనృత్యమును లాస్యమనియు వ్రాయబడినది. గానమందు మూడుభాగములు గలవు—సామగానము, మార్గవిద్య, దేశవిద్య. తాళములనుగూర్చియు, లయజ్ఞానమునుగూర్చియు, వివిధయంత్రములనుగూర్చియు, మహర్షులచే వ్రాయబడిన గ్రంథములందు విశేషముగా కనబడుచున్నది.

పాశ్చాత్యపండితులుకూడ భారతీయుల సంగీత విద్యాప్రవీణత ను గొనియాడుచు భారతదేశమే తక్కిన ప్రపంచమున కాదిగురువని నొక్కి వక్కాణించియున్నారు కోల్మనుపండితుడు Hindu Mythology యనుగ్రంథమం దిట్లువ్రాసియున్నాడు. "సర్ జోన్స హిందూసంగీతశాస్త్రము పాశ్చాత్యులసంగీతశాస్త్రముకన్న పలువిధముల ఉత్తమమయినదని యంగీకరించుచున్నాడు" ఎ సి విల్సన పండితుడు Hindu System of Music యనుగ్రంథమం దిట్లు లిఖించియుండెను. "పృథ్వియందు ఆర్యులయొక్క సంగీతశాస్త్రము బహుప్రాచీనమైనది. ఆర్యజాతినుండియే ముసల్మానులు సంగీతవిద్య నభ్యసించిరి." సర్ హంటరుని యభిప్రాయము "హిందువులు సాధారణరాగములతో తృప్తిజెందక పశ్చిమదేశీయులు గ్రహింపలేనంతటి సూక్ష్మరాగములను సృష్టించిరి. యూరోపియనులు హిందువులను సంగీతవిద్యయం దాక్షేపించుటకు కారణము వారియొక్క మూర్ఖతయు, సంగీతవిద్యాహీనతయు యని చెప్పకతప్పదు" వీబరుపండితు డిట్లు చెప్పుచున్నాడు "రాగవిద్యయు హిందువులనుండి పారశీకులును,

పారశీకులనుండి అరబ్బులు, అరబ్బులవలన యూరపువాస్తవ్యులును నేర్చిరి ”

ఇంక ప్రాచీనార్యుల యుద్ధవిద్యనుగూర్చియు, వారిధీరత్వము నుగూర్చియు విచారింతము. ప్రాచీనులు యూరోపీయనులవలె మనోన్మత్తులై ధర్మపథమునుతప్పి నడువలేదు. అంతమందు ధర్మమునకు విజయమును అధర్మమునకు పరాజయమునుగల్గుట, ప్రకృతినియమ మనియు భగవదాజ్ఞయనియు వారినమ్మకము అందుచేతనే ధర్మము నకు కట్టుబడి, నిమిత్తమాత్రులై యుద్ధములుజేసిరి. భీష్మపితామహు డును, ద్రోణాచార్యులును దుర్యోధనునిచే పోషింపబడి దుర్యోధ నుని పక్షమందుండి యుద్ధముజేయుట ధర్మానుకూలమే. అధర్మప్రవ ర్తనమూలమున దుర్యోధనుడు నశించుటకూడ ధర్మమేకదా!

సహజముగా సంభవించుయుద్ధము ధర్మయుద్ధమని పూర్వుల యభిప్రాయము. ఈసంగతినే శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతయందు విశదీకరించియున్నాడు. ధర్మయుద్ధమనట్టిదో భారతయుద్ధమువలన స్పష్టమగుచున్నది పాశ్చాత్యులవలె నిరాయుధులగు శత్రువులపై దాడిసలుపుట, దుర్బలులయెడ నత్యాచారముజేయుట, మొదలగు నవి ప్రాచీనులకు స్వభావగుణంబులుగావు. ఆపదవచ్చినపుడు శత్రు వునైనను రక్షించుట ముఖ్యధర్మమనియెంచి పాండవులు, దుర్యోధనుని భార్యలు తీర్థయాత్రలో విషమావస్థయందున్నసమయమున వారిని రక్షించిరన్నసంగతి లోకవిదితము.

ఆర్యులు ధర్మయుద్ధపక్షపాతులని దెల్పుటకు అర్జునునకు మ యునకును జరిగినసంభాషణమే తార్కాణము. దానవరాజగు మ యుడు ఖాండవవనదహన సమయమున అర్జునునిచే రక్షింపబడి, అర్జు నునితో తనవద్దనున్న దానవాస్త్రములను గైకొనుమని కృతజ్ఞతా పూర్వకముగా కోరెను. అర్జునుడాయస్త్రముల మహిమనుగూర్చి

యడుగగా మయుడు, అస్త్రములసహాయమున ఆకాశమున కెగిరి, అదృశ్యులై శత్రునాశనము జేయవచ్చుననియు, నీటియందు మునిగి శత్రుసేనను క్షయమొనరింప వచ్చుననియు, శత్రువులకు విశేషదూరమున నుండియే శత్రుసంహారము సేయవచ్చుననియు జెప్పెను. అర్జునుడు అస్త్రములయొక్క మహాత్వమును గొనియాడెనుగాని అనార్యసేవితమైన అస్త్రములను తాను గైకొనజాలనని చెప్పెను. దీనివలన ఆర్యులెట్టిధర్మసూత్రములకు గట్టువడిరో దెలియుచున్నదిగదా!

శత్రువులను సమ్ముఖమందుంచుకొని యుద్ధముజేయుట ప్రాచీనుల యుద్ధనీతికి మూలమంత్రము. దాగుకొని శత్రువులజంపుట ఆకాశమందుగాని, జలమందుగానియుండి శత్రుసంహారముజేయుట, పారిపోవుచున్న శత్రువును జంపుట, రాత్రియందు యుద్ధముచేయుట, నిద్రపోవుచున్న శత్రువులపై అస్త్రప్రయోగముజేయుట మొదలగు కార్యములన్నియు పాతకజనకములని ఆర్యులయొక్క యుద్దేశ్యమైయున్నది.

ధర్మయుద్ధమందు ఆత్మబలిదానము జేయుటవలన అనంతమైన దివ్యసుఖమును బొందవచ్చునని గ్రంథములందు వ్రాయబడినది.

భగవద్గీత:—"హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్" యుద్ధమందుమరణించిన స్వర్గప్రాప్తికల్గును. లేక యుద్ధమందు జయించిన స్వరాజ్యప్రాప్తికల్గునని శ్రీకృష్ణభగవానుడు నిర్వచించియున్నాడుగదా! యుద్ధమందుమరణించుట పరమపవిత్రమనియు, ఆర్యజనోచితమనియు, స్వర్గారోహణసోపానమనియు వారియొక్కవిశ్వాసము. స్వదేశముకొరకును, స్వధర్మముకొరకును నిష్కామకర్మయోగము ముఖ్యసాధనమని వారితలంపు. ఇట్టికర్మయోగమువలన ఆత్మోన్నతిప్రాప్తించునట. ప్రాచీనార్యులేగాదు. మొన్నమొన్నటి మేవాడు మహారాణ ప్రతాపసింహుడును, రాఠోరు దుర్గాదాసు, పృథ్వీరాజును ఇత్యాదిమహావీరు లనేకులు భారతభూమియం దుద్భవించి భారతీ

యుల యొక్క ప్రతిభకును వీరత్వమునకును నాదర్శపురుషు లైరన్న మాట మన మెరుగుదుము. రథ, గజ, తురగ పదాతుల చతురంగ బలసమేతుండగు పురుషోత్తముని జూచి మహావీరుడగు నలగ్జాండరు గూడ విస్మయమందుట మనకు దెలియును. ప్రాచీనార్యులచే వ్రాయబడిన ధనుర్వేదమందు అస్త్రశస్త్రప్రయోగము వ్యూహరచనాదివిషయము లనేకములు చిత్రింపబడినవి. నాగపాశ, శక్తిశేల, సమ్మోహన, అగ్నిబాణము, వారుణాస్త్రము యిత్యాది అస్త్రములయొక్క ప్రయోగము ప్రాచీనులఘనతకు తోడ్పడునుగదా! విల్సనుపండితు డిట్లు వ్రాయుచున్నాడు. "బాణనిక్షేప విద్యయందు ప్రాచీనార్యులు యద్వితీయులు" ఒకే సమయమం దనేక బాణములనువిడచుట, విడిచిన బాణములను తిరిగిపొందుట, శత్రువులను మూర్ఛపొందునట్లు చేయుట యివన్నియు ఆర్యులయొక్క యుద్ధవిద్యను వెల్లడిచేయుననుటలో సందేహము లేదు ద్రౌపదియొక్క స్వయంవరసమయమందు అర్జునుని బాణవిద్యయు, కురుక్షేత్రయుద్ధమందు భీష్మ, ద్రోణ, కర్ణులయొక్క అద్భుత మైన అస్త్రప్రయోగము రామరావణయుద్ధమందు రామునియొక్కయు, రావణునియొక్కయు, మేఘనాదునియొక్కయు విచిత్రమైన శక్తిశేల, సమ్మోహన, వారుణాస్త్ర, గారుడాస్త్ర, నాగపాశాస్త్రములయొక్క ప్రయోగము ఆధునికప్రపంచమున కాశ్చర్యము కల్గించునుగదా! మధ్యభేదీ, అంతర్భేదీ. మకరవ్యూహ, శ్యేన వ్యూహ, శకటవ్యూహ, అర్ధచంద్ర సర్వతోభద్ర, గోమూత్రిక, దండ, మండల, అసంహత యిత్యాదివ్యూహములు రచింపబడుచుండెననుట కనేకనిదర్శనములుంగలవు. కురుక్షేత్రమందు సూచీముఖవ్యూహము, వజ్రవ్యూహము, పద్మవ్యూహములు కాన్పించుచున్నవి. దుర్యోధనుడు అభేద్యవ్యూహనిర్మాణమున కాజ్ఞాపించినట్లు గూడకనబడుచున్నది. పూర్వమందు ఫిరంగులు తుపాకులు, ఫిరంగిగుండ్లు, తుపాకీమందు గలవనుటకు నిదర్శనములుం

గలవు. ఫిరంగిని శతఘ్నియనియు, తుపాకిని నాలాస్త్రమనియు ఫిరం
గిగుండును గుడకయనియు తుపాకిమందును ఉర్వఘ్నియనియు పిలచె
డివారట.

"ఉర్వఘ్నిం ప్రోథితాం కృత్వా శతఘ్నీం గుడకైర్యుతామ్,"
తుపాకిమందుతోను గుండ్లతోను నింపబడి ఫిరంగులు వేయబడుచుం
డెడివనియు బుజువగుచున్నదిగదా! పృథ్వీరాజు జీవనచరిత్రయితి
హాసమం దిట్లు కనబడుచున్నది:—

"జంబూర్ తోప్ ఛుటహి రఘునాంకి,
దశకోశ్ జాయ్ గోలాధనాంకి."

జంబూర, తోపు (ఫిరంగి)లు పృథ్వీరాజుకాలమందు గలవని
యు, ఫిరంగిగుండు పదికోసులదూరము పోవుచుండెడిదనియు తెలి
యుచున్నది. మైథిలీపండితుడు యిట్లు వ్రాయుచున్నాడు.

"భారతీయులు ఫిరంగిమొదలగు ఆగ్నేయాస్త్రప్రయోగమం
దు పోర్చుగీసువారికంటెను ఎక్కుడుప్రజ్ఞావంతులు" గ్రీకుచక్రవర్తి
యగు అలెగ్జాండరు ఎరిస్టాటలుకుపంపినపత్రమందుకూడ గ్రీకుసేనల
మీద భారతసైనికులు ఫిరంగిగుండ్ల వర్షముగురిపించెనని వ్రాసియు
న్నాడు. శతఘ్నిని ఒకపెద్దవృక్షముయొక్క స్కంధముతో పోల్చియు
న్నారు. దీనియొక్క శబ్దము బహుగంభీరమైనదనికూడ చెప్పబడినది.

అస్త్రయుద్ధముందేగాక, జలయుద్ధమందును ఆకాశయుద్ధమందు
ను భారతవాసు లెక్కువ నేర్పరులు. ఋగ్వేదమందు రాజర్షియగు
తుగ్రుడు తనపుత్రుడైన భుజ్యునిససైన్యదిగ్విజయార్థమై ససైన్య
ముగా సముద్రముమీదకుపంపెనని చెప్పబడినది. కర్నలుటాడ్,
స్ట్రెబో, ప్రాచీనార్యులు జలయుద్ధమందు విశేషనిపుణులని విస్పష్టము
గా వ్రాసియున్నారు. ఫరియా (Asia Portuguesa and Ibid) యిట్లు
వ్రాసియున్నాడు. "క్రీస్తుశకము 15-వ శతాబ్దమందు ఒకగుజరాతీఓడ

పోర్చుగీసుయోడపై అనేకఫిరంగులను వేసెను. 1502-వ సంవత్సర
మందు హిందువులు కల్లికోటయుద్ధమందు ఓడలమీద యుద్ధముచే
సిరి మరుసటిసంవత్సరమున జామొరినుయోడపై 380 ఫిరంగులు
తీసికొనిరాబడినవి."

ఆకాశయుద్ధవిద్యయందుగూడ పూర్వులు గొప్పనిపుణులని జెప్పుటకు శ్రీరామచంద్రునిసేనపై ఇంద్రజిత్తు ఆకాశమార్గమునుండి కురిపించిన బాణవర్షమే నిదర్శనము.

పూర్వుల తడిత (Electricity) విజ్ఞానమును పరిశీలించిన ఆధునికుల కాశ్చర్యము జనించకమానదు పూర్వుల ఆచారనియమములను పరిశోధించిన వారియొక్క తడిత జ్ఞానము పలురూపముల ప్రకటనమగుచున్నదని చెప్పవచ్చును భోజనమందును, శయనమందును కూర్చుండుటయందును, నడచుటయందును, జలమందును, స్థలమందును, ధర్మార్థకామమోక్ష కారకములగు సమస్తకర్మలయందును తడితవిజ్ఞానము ద్యోతితమగుచున్నది అస్త్రశస్త్రక్రియాక్రమమగు నాగపాశ, శక్తి శిల, సమ్మోహనాలు యిత్యాదిఅస్త్రములన్నియు తడితవిజ్ఞానసహాయముచేతనే నిర్మింపబడినవి. దేవమందిరముపైనుంచు అష్టధాతుచక్రము విద్యుద్విజ్ఞానోన్నతిని వెల్లడిచేయును. ఉత్తరమువైపు శిరస్సుయుంచి నిద్రించకపోవుట, నీచజాతిచేముట్టబడిన అన్నమును భుజించకపోవుట, చైల అజిన కుశ కంబళిఆసనములపై కూర్చుండి ఉపాసనజేయుట, సౌభాగ్యవతులగు స్త్రీలకు స్వర్ణాలంకారమున కనుమతిచ్చుట, విధవల కలంకారాధికారము లేకుండుట యిత్యాదినియమములన్నియు తడితవిజ్ఞానమునకు సంబంధించినవే. అష్టధాతుచక్రము వజ్రపాతనివారణసాధనము. శిరస్సు నుత్తరమువైపునుంచి పరుండుటవలన దుస్స్వప్నములు పుట్టునట ఈదుస్స్వప్నములకు కారణము పృథ్వియొక్క స్వభావసిద్ధమైన తడిత్ప్రవాహము తమోగుణప్రధాను

నగు శూద్రునిచే ముట్టబడినయన్నము విద్యుచ్ఛక్తిమూలమున దోషయుక్తమగుచున్నది. చైల, అజిన, కుశ, కంబళి యాసనములపై కూర్చుండి ఉపాసనచేయుట తడిశక్తి వృద్ధికారకమట సువర్ణాదిధాతువులవలన విద్యుచ్ఛక్తి వృద్ధియగును. ఈవృద్ధివలన శరీరసంబంధమైన యింద్రియములన్నియు ప్రకాశవంతములగును. ఇంద్రియస్ఫూర్తి సుసంతానమునకు హేతువగును. ఈకారణముచేతనే పూర్వులు సౌభాగ్యవతులగుస్త్రీలకు ధాతుమయ, రత్నమయాలంకారముల కనుమతిచ్చిరి.

మూలప్రకృతియందు నాలుగుప్రధానరూపములు గలవు. 1 స్థూలశక్తి, 2 సూక్ష్మశక్తి, 3 కారణశక్తి, 4 తురీయశక్తి. స్థూలశక్తియందు మరల యేడు భేదములుకలవు. ఆయేడింటిలోను తడితయొకటి. ఈతడితశక్తి సూర్యునివలనజనించి భూమియందంతటను వ్యాపించియున్నది.

యోగశక్తి ముక్తిసహాయకారియని వ్రాయబడినది యోగశక్తివలన మేఘవాయువులను స్తంభింపజేయుట, శూన్యప్రదేశమంద నిలబడుట, శరీరమును చిన్నదిగను పెద్దదిగను జేయుట, దూరస్థితవిషయములను వినుట, చూచుట, దీర్ఘాయువును యిచ్ఛామృత్యువును బొందుట, క్షుత్పిపాసలను జయించుట, భవిష్యత్తును గుర్తెరుంగుట మొదలగుపనులన్నియు చేయవీలగును. డాక్టరు పాలు తనయోగవిజ్ఞానమను గ్రంథమందు ప్రాణాయామసాధనద్వారా దీర్ఘాయువును భూతజయమును పొందవచ్చునని వ్రాసియున్నాడు. యూరపువిద్వాంసులు ప్రత్యక్షముగా పంజాబుకేసరిమహారాజ రంజితసింగు సభయందు యోగవీరుడగు శ్రీహరిదాసుస్వామిని ఆరుమాసములు భూమిలోపల జడసమాధియందుండుటచూచి కడువాశ్చర్యము బొందిరి. యోగశక్తిమూలమున గొయ్యిలోనుండి పైనమట్టిచే పూడ్చబడినను కొన్ని

నెలలవరకు సజీవులయి యుండుటకూడ జూచిరి. ఆకాశమందు నిరాధారముగా నుండుటయు, భూకైలాసస్థితుడైన యోగిని శ్వాసరహిత సమాధియందుండుటను జూచి ఐరోపియనులు మూర్ఛితులయిరి. Telepathy, Thought Reading యోగశక్తిమూలమున నే లభించుచున్నవి

ఇంక ప్రాచీనుల శిల్పోన్నతినిచూతము. బుద్ధివికాసముయొక్క లక్షణమే శిల్పనిపుణత. ఈశిల్పనైపుణ్యమే బహిర్జగత్సంబంధమైన విచిత్రతయని చెప్పవచ్చును. ఆర్యులచతుర్థోపవేదము స్థాపత్యవేదమైయొప్పుచున్నది. సహస్రద్వారములుగలిగి సహస్రహస్తస్తంభయుక్తమైన గోపురములును, లోహనిర్మితనగరములు, ప్రస్తరనిర్మితపురములు ఋగ్వేదమందు వర్ణింపబడినవి. భారతవర్షమం దిట్టినగరములుండుటచేతను, అట్టినగరములపైబడి ధనమంతయు దోచుకొనవచ్చునను దురాశచేతను సైరసు, డరయుస్సు, సెమిరామిస్, అలెగ్జాండరు, గజనీమహమ్మదు, తైమూరు, బాబరు మొదలగు యోధులను పోర్చుగీసు, ఫ్రెంచి, స్పేనిష్, ఆంగ్లేయులు మొదలయిన పాశ్చాత్యజాతులును భారతదేశమునకువచ్చుట తటస్థించినది. మయదానవనిర్మితమయిన యుధిష్ఠిరుని రాజసభావర్ణనము ప్రాచీనుల శిల్పనైపుణ్యమును వేనోళ్ల చాటుచున్నది. రాజసూయయజ్ఞసమయమున మయదానవునిచే నిర్మింపబడిన సభాగృహము ప్రస్తుతప్రపంచమందెక్కడను కనబడదు. ఆసభయందొక అనుపమానమైన సరోవరము నిర్మింపబడినది. అందుమణిమయమైన పద్మముయొక్క కాడలు, వైడూర్యమయపత్రయుక్త శతదళకమలములును, కాంచనమయ కుముద, కదంబములు శోభనుకలుగజేయుచుండెనట. అందనేక చిత్ర విచిత్రములగు పక్షులుకూడ క్రీడసల్పుచుండినట్లు చిత్రింపబడెను. ఆపంకజములు, సువర్ణనిర్మితమత్స్యకూర్మాదులు, నాలుగువైపులను నిర్మింప

బడిన చిత్రస్ఫటికసోపానములు అదియొకనిజమైన సరోవరమా యని తోచునట్లు చేయుచుండెనట ఈసభాగృహమును చూచి రాజపురుషులందరు ముగ్ధులైపోయిరనిగూడ తెలియుచున్నది.

మధ్యరాష్ట్రములోని జోగిమారగోడలమీద చిత్రలేఖనములు, శిశునాగవంశమునకు చెందిన యిద్దరిరాజులయొక్క విగ్రహములును, కుమకఅజాతశత్రుని విగ్రహములును, అజంతాగుహాలందలి చిత్రలేఖనములు, లంకాద్వీపమందలి సింగరాయచిత్రలేఖనములు, ప్రాచీనులశిల్పనైపుణ్యమును ప్రకటించుచున్నవి. పలుతావులందు కానబడు బౌద్ధ, జైనవిగ్రహములు, దేవాలయములందలి విగ్రహములు పూర్వులెట్టి శిల్పనిపుణులో తెలియజేయుచున్నవి.

కాశ్మీరశాలువలు, ఢాకావస్త్రములు, కాశీపట్టువస్త్రములు మొదలయినవి ప్రాచీనుల వస్త్రశిల్పమును ఋజువుచేయుచున్నవి. మిస్ మైనింగిట్లు వ్రాసియుండెను. "యూరపువాస్తవ్యులు ప్రాచీనార్యుల శిల్పకళయందలి నేర్పరితనమునుజూచి విస్మయసముద్రమందు మునిగిపోవుచుండిరి" ప్రొఫెసరు వీరారెను యిట్లుచెప్పుచున్నాడు. "విగ్రహనిర్మాణమందు భారతీయులు గ్రీకులకంటె నెక్కువ నేర్పరులు" కర్నలు టాడి యిట్లువ్రాయుచున్నాడు.

"భారతదేశమందలి ప్రాచీన స్తంభములను, విగ్రహములను జూచిన కళాసుందరి యిక్కడ తాండవమాడుచుండెనా యనునట్లు తోచును" బైరన్‌డాల్‌వర్గు తన Geographical Ephemerides యనుగ్రంథమందు ద్వారకాపురమును చమత్కారపురమనివ్రాయుచు హిందువుల శిల్పకళలను వేనోళ్ల పొగడియుండెను. ఎల్లోరాగుహామందిరములును, జగన్నాథాదిదేవతలయొక్క ఆలయములును, చిత్తూరు దుర్గమును, కటక్ మొదలగు ప్రాచీనపట్టణములందలి నదీబంధములును, ఆగ్రాయందలి తాజ్‌మహలును, భారతీయుల శిల్పౌన్నత్య

మునకు ప్రమాణముగదా ! ఉదయగిరి, ఖండగిరులందలి శిలామందిరములును, భువనేశ్వరములోని అపూర్వమందిరమును దృష్టాంతములు. వీబరుపండితుని యభిప్రాయమిట్లున్నది. "పశ్చిమదేశమందలి శిఖరములు భారతబౌద్ధమందిరములయొక్క శిఖరముల ననుసరించి నిర్మింపబడినవి."

---

## పదియవభాగము.

---

ఉత్కృష్టజీవనముయొక్క లక్షణములలో బుద్ధివికాసమొకటి. ఈబుద్ధివికాసము జ్ఞానాధిక్యతవలన కలుగును. ఈజ్ఞానాధిక్యత పూర్ణమైన ధర్మజ్ఞానమువలన లభించుచున్నది. ఇట్టి ధర్మజ్ఞానమునకు పుట్టినిల్లు భారతవర్షమే. ధర్మజగత్తులో భారతభూమియే ధర్మభూమియై తక్కిన దేశముల కాదిగురువై యొప్పుచుండెననుటలో యతిశయోక్తి లేదు. విదేశీయులు మనభారతీయులవలననే ధర్మజ్ఞానశిక్షను పొంది యుండిరి. సత్యయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగమందు రమారమి మూడువేలసంవత్సరములు గతించినపిమ్మట బుద్ధభగవానుడు భారతదేశమందుద్భవించి తనబౌద్ధమతమును పృథ్వియంతటను వ్యాపింపజేయమొదలిడెను. మనయాచారములలో కొన్ని బౌద్ధమతమునకు సంబంధించినవేయని చెప్పవచ్చును. ఈబౌద్ధధర్మము ఆర్యధర్మమునుండియే సృష్టింపబడినది. బౌద్ధధర్మమునుండి క్రైస్తవధర్మముద్భవించెనని పండితులయభిప్రాయము. క్రైస్తవమతస్థాపకుండును, ప్రచారకుడును, మహాత్ముడునునగు ఏసుక్రీస్తు బాల్యమునందు భారతదేశమునకేతెంచి బ్రాహ్మణ, బౌద్ధాచార్యులకడ విద్యనభ్యసించి బౌద్ధధర్మసూత్రములనుగ్రహించి, స్వదేశమునకుబోయి తనక్రైస్తవధర్మమును సృష్టించెనని మేడమ్ బ్లేవట్స్కీ (Madam H. P. Bla-

vatsky) తనగ్రంథములో వ్రాసియున్నది. దీనివలన క్రైస్తవధర్మము బౌద్ధధర్మముయొక్క శిష్యురాలని నిర్ణయింపవచ్చును. క్రైస్తవధర్మము నుండి మహమ్మదీయమతము జనించెనని మఱికొందరి యభిప్రాయము. ఏదియెట్లున్నను సనాతనార్యధర్మమే తక్కినధర్మములకు మూలమని చెప్పకతప్పదు. ఈసనాతనధర్మస్వరూపమునుగూర్చి కొద్దిగానుచ్చరించుట మన ముఖ్యకర్తవ్యము ఈసనాతనధర్మముయొక్క లక్షణములు మూడు. ఈధర్మము అపౌరుషేయధర్మము పరధర్మావలంబకులను తనధర్మములో కలుపుకొనకపోవుట రెండవలక్షణము. అన్యధర్మములు అధికారభేదము లేకుండా సర్వజనులకు ఒకేసాధనమును నిరూపించినవి. బుద్ధిమంతుడైనను, మూర్ఖుడైనను, జితేంద్రియుడైనను, భోగలాలసుడైనను, గృహస్థుడైనను, లేక సన్యాసియైనను, దరిద్రుడైనను లేక ఐశ్వర్యవంతుడైనను, రోగియైనను లేక ఆరోగ్యవంతుడైనను, ఏకమార్గము నవలంబించువారగుచున్నారు సనాతనధర్మమందట్లుగాక యోగ్యతననుసరించి అధికారము నిర్ణయింపబడినది. సనాతనధర్మమందలి మూర్తిపూజ, ఆత్మస్వరూపనిర్ణయకారియగు బ్రహ్మసద్భావము ద్వైతాద్వైతవిజ్ఞానము, యోగదర్శనము, సాంఖ్యదర్శనము, న్యాయదర్శనము, వైశేషికదర్శనము, కర్మమీమాంసదర్శనము, దైవమీమాంసదర్శనము, వేదాంతదర్శనము, మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగము—యిట్టిసాధనమార్గములు శాస్త్రోక్తమైన సదాచారములు సనాతనధర్మమును వేనోళ్ళచాటుచున్నవి.

పూజ్యులైనమహర్షులు ధర్మమును నాలుగుభాగములక్రింద విభజించియున్నారు. 1 సాధారణధర్మము, 2 విశేషధర్మము, 3 అసాధారణధర్మము, 4 ఆపద్ధర్మము. సాధారణధర్మమందు మరల 72 భేదములున్నవిగాని పెద్దభాగములుమూడు. దాన,తప,యజ్ఞములు. దాన

ము గలవు. మూడువిధములు అన్నదానము (భూమిదానము, వస్త్రదానము. ధనదానము యిత్యాది) బ్రహ్మదానము (విద్యాదానము) అభయదానము (దీక్షాదానము.) తపమందుకూడ మూడుభేదములు గలవు. శరీరసంబంధమైనతపస్సు, వాక్కుసంబంధమైనతపస్సు, మనస్సంబంధమైనతపస్సు; యజ్ఞమందు పదునెనిమిది భేదములుకలవు. కర్మయజ్ఞమందు నిత్య, నైమిత్తిక, కామ్య, అధ్యాత్మ, అధిదైవ, అధిభూతములను ఆరువిధములు గలవు. ఉపాసనయందు మరల తొమ్మిదిభేదములు కాన్పించుచున్నవి 1 నిర్గుణబ్రహ్మోపాసన, 2 సగుణపంచోపాసన, 3 అవతారోపాసన, 4 ఋషి, దేవత, పితృ, ఉపాసన, 5 భూతప్రేతఅసురాదులయొక్క ఉపాసన. 6 మంత్రయోగోపాసన, 7 హఠయోగోపాసన, 8 లయయోగోపాసన, 9 రాజయోగోపాసన. జ్ఞానయజ్ఞమందుకూడ మూడువిధములున్నవి. శ్రవణ, మనన, నిధిధ్యాసములు.

మూడువిధములైనదానము, మూడువిధములైనతపస్సు, పదునెనిమిదివిధములైనయజ్ఞము అన్నియుకలిపి యిరువదినాలుగుభేదములగుచున్నవి. ఈ యిరువదినాలుగును మరల సాత్విక, రాజస, తమోగుణములననుసరించి 72 భాగము లగుచున్నవి. ఈసాధారణధర్మమును చూచి పాశ్చాత్యవిద్వాంసులగు రోథ్, మాక్సుముల్లరు, విల్సను, డువేసేను, హెగెల్ ఆశ్చర్యపడి వైదికధర్మమహాత్వమును విశేషముగా పొగడియున్నారు. ఫ్రాన్సు. జెర్మనీ, అమెరికాయందలి పండితులనేకులు హిందూధర్మపక్షపాతులగుచున్నారు.

సనాతనధర్మము కేవలము పరలోకసంబంధమైన విచారణయందేగాక, నిద్రించుట, మేల్కొనుట, కూర్చొనుట, లేచుట, నడచుట, తినుట, నవ్వుట, యేడ్చుట యిత్యాదివిషయములందుగూడ కొన్నినియమముల నేర్పరుచుచున్నది. ఈనియమములను ధారణచేయు

టయే ధర్మమని చెప్పబడినది. విచారణచేసిచూచిన సృష్టిలో ప్రతి వస్తువునందును సత్వ, రజ, తమోగుణములు మూడును కనిపించు చున్నవి రజోగుణమువలన యుత్పత్తియు, సత్వగుణమువలన స్థితియు, తమోగుణమువలన లయము, యీ మూడవస్థలును విశ్వమంతటను చూడబడుచున్నవి. ఈ బ్రహ్మాండమందు అగణితగ్రహనక్షత్రాదులు మొదలు యొకచిన్న గడ్డిపరకవరకు యీయవస్థలకు లోనగుచున్నట్లు మనము చూచుచున్నాము. ఈయవస్థాభేదముచే ప్రతిజీవియొక్క సృష్టి స్థితిలయములు పూర్తిగా బోధపడుచున్నవిగదా! జీవి అహంకారముచే అజ్ఞానవంతమై కర్మప్రవాహములోపడుచున్నది కర్మచేతనే సృష్టిప్రవాహములో ప్రవహించుచున్నది ఈసృష్టియనెడు మాయాప్రవాహము నుండి విరమించుటే ఆత్మస్వరూపమును గుర్తెరుంగుట. ఆత్మస్వరూపమును గుర్తెరుంగుటకు సాధనము ధర్మాచరణ. ఈధర్మాచరణ ప్రతిచిన్నపనియందును యిమిడియున్నది ఉదాహరణము — ఏపురుషుడైనను పగటియందు నిద్రపోయిన అతనియొక్క తమోగుణము వృద్ధియగుచున్నది. తమోగుణము అజ్ఞానమునకు కారణమగుచున్నది ఈతమోగుణమువలన జీవి జడత్వమును పొందుచున్నది. దివానిద్ర జీవము యొక్క క్రమోన్నతికి బాధకలుగజేయుచున్నది. కావున దానిని యధర్మకార్యమని పూర్వులునిర్ణయించియున్నారు. పూజ్యపాదులును, త్రికాలదర్శులును నగు మహర్షులు స్థూలసూక్ష్మభేదమునను సరించి ధర్మాధర్మములను వర్ణించియున్నారు. వేదములు, ఉపవేదములు, దర్శనములు, స్మృతులు, పురాణములు, తంత్రములు మొదలుగాగల శాస్త్రములన్నియు యీ సనాతనధర్మస్వరూపములే.

సనాతన ధర్మవాక్యము:—

"ధర్మేయోబాధతే ధర్మోన సధర్మ కుధర్మతత్,
అవిరోధీతు యోధర్మ సధర్మో మునిసత్తమ."

అన్యధర్మమునకు బాధకములగజేయు ధర్మము ధర్మము కానేరదు. దానిని కుధర్మమందురు. బాధకములగజేయనిదే యథార్థమైనధర్మము.

ఇంతవరకు సాధారణధర్మము చెప్పబడినది. ఇంక విశేషధర్మమును పరిశీలింతము. ఈ విశేషధర్మమునకు విశేషమైనయధికారముండవలెను. పురుషునియొక్క పురుషధర్మము, స్త్రీయొక్క స్త్రీధర్మము, గృహస్థుని ప్రవృత్తిధర్మము, సన్న్యాసియొక్క నివృత్తిధర్మము, రాజుయొక్క రాజధర్మము, ప్రజలయొక్క ప్రజాధర్మము, ఆర్యులయొక్క ఆర్యధర్మము, అనార్యులయొక్క అనార్యధర్మము, బ్రాహ్మణునియొక్క బ్రాహ్మణధర్మము, క్షత్రియుని క్షత్రియధర్మము, వైశ్యుని వైశ్యధర్మము, శూద్రుని శూద్రధర్మము, వర్ణాశ్రమధర్మములుగూడ విశేషధర్మములే.

అసాధారణధర్మము, ద్రౌపది పంచపాండవులను భర్తలుగా స్వీకరించుట, విశ్వామిత్రుడు బ్రాహ్మణుడగుట, యిటువంటి విషయములందు కానబడుచున్నది. అసాధారణధర్మమునకు విశేషమైన యోగశక్తి, ఆత్మబలియావశ్యకత ముఖ్యములు, సాధారణమానవులకెట్టిధర్మాధికారము లేదు.

ఆపద్ధర్మ చమత్కారమును యించుక పరిశీలింతము. ఆపద్ధర్మము భావప్రధానమైనది. విపత్తులో మునిగి పురుషుడు తనముఖ్యోద్దేశ్యమును పాలించుటకొరకు ఆపద్ధర్మమనితలంచి యేపాపకార్యమును చేయునో యది పాపకార్యము కాక పుణ్యకార్యమగునని వ్రాయబడినది. విశ్వామిత్రుడు క్షుద్బాధవలన ననేకసంవత్సరములు బాధపడి కుక్క మాంసముతో బలివైశ్వదేవము చేసి దానిని భుజించుట కుద్యమించె [illegible] నని మహాభారతమందు గలదు. కుక్కమాంసము తినకూడదని [illegible] యెకపోవుటకాదు. క్షుద్బాధమూలమున కుక్కమాంసముదినుట

ద్ధర్మముగా పరిగణింపబడెను. ఆత్మరక్షణకొరకై యీఆపద్ధర్మమాచరింపబడుచుండెను.

పైని పేర్కొనబడిన నాలుగుభాగములు సనాతనధర్మమే. ఈ సనాతనధర్మము పృథ్వియందలి తదితరధర్మముల కన్నిటికిని పితృస్వరూపియై సర్వలోకహితకారిగా నుండెడిది.

ప్రాచీనుల ముక్తివిజ్ఞానమును సంశోధింతము. సనాతనధర్మనేతలగు మహర్షులు ప్రపంచము క్షణభంగురమనియు, అసత్యమనియు గుర్తెరింగి, విషయవాంఛలనువదలి, ప్రతివస్తువును ఆధ్యాత్మికదృష్టితో చూచుచు ఆత్మోన్నతికివలయుసాధనములారయుమని యుపదేశించియున్నారు. ప్రతిపదార్థము త్రిగుణాత్మకమై యున్నదనియు, అందుచే పరివర్తనమునకు నాశనమునకు లోనగుచున్నదనియు, అందుచేతనే యీప్రపంచమంతయు స్వప్నతుల్యమనియు చెప్పియున్నారు అంతర్ముఖులే బుద్ధిమంతులనియు, ప్రాపంచికవిషయములనుండి పరమాత్మవైపు దృష్టినిమరలించుటే జీవనోద్దేశమనియు మహర్షులయొక్క యభిప్రాయము.

ఈశ్వరుండు తనమహాశక్తిమూలమున నీ ప్రపంచమునంతను సృష్టించియున్నాడు. ఈబ్రహ్మాండములో రెండుపదార్థములే అనుభవయోగ్యమైయున్నవి. 1. జడ (ప్రకృతిభావము) 2. చేతన (పురుషభావము) అనగా పురుషభావము జ్ఞానమయమైన చేతనము ప్రకృతిభావము జడమయమై త్రిగుణాత్మకముగా నున్నది. చేతనశక్తివలన ప్రకృతి చైతన్యయుక్తమగుచున్నది. ప్రకృతియే మనముండుప్రపంచము. ఇది త్రిగుణాత్మకముగాన ఉత్పత్తిస్థితి లయముల కధీనమగుచున్నది. ఇట్టి పరివర్తనకును నాశనమునకును లోనగుప్రపంచముతో సంబంధము కలుగజేసికొను జీవులుకూడ నశించెదరనుటలో నాశ్చర్యము లేదుగదా !

ఆత్మయం దృష్టిపరివర్తన లేదు. ఆత్మభావము త్రిగుణాతీతమై, జ్ఞానపూర్ణమైన భావము. పూర్ణమైన చేతనభావమే పరమానందరూపమైన మోక్షమును పొందుటకు హేతువగుచున్నది కేవలము ధర్మపథమందు చరించుటచేతనే జీవి క్రమశః పరమానందపూర్ణమైన ఆత్మపదమును పొందుటకు వీలగుచున్నదిగదా ! ధర్మసాధనరూపమైనదీపముయొక్క సహాయముచేత ఆత్మజీవి క్రమముగా ఆత్మభూమి చేరుచున్నదని వ్రాయబడినది 'సనాతన ధర్మోక్తసాధనమువలన పరమానందపదమున కధికారము ప్రాప్తించుచున్నది ఈ చైతన్యముయొక్క పూర్ణతయే, ఈ జ్ఞానముయొక్క చరమసీమయే యీ పరమానందముయొక్క పరమపదమే మోక్షమనబడుచున్నది. ధర్మలక్ష్యవిహీనమైన కామము, అర్థము నరకమునకు కారణమగుచున్నవి ఈధర్మము మూలముననే యిహలోకమందును పరలోకమందును సుఖప్రాప్తి కలుగుచున్నది. ఈవిషయమునే పూజ్యపాదులయిన మహర్షులు లోకమునకు చాటియున్నారు. ప్రాచీనులు ధర్మప్రధానులై మోక్షపదమును పొందిరనుటలో నాశ్చర్యము లేదు. మోక్షమే జీవితముయొక్క గమ్యస్థానమని వారితలంపు వారి యాచరణయంతయు ధర్మయుక్తమైనది నిత్యము ఈశ్వరుని ధ్యానించుచు వలయు కర్మల నాచరించుచు, తన్మూలమున స్థిరమైన పరలోకసుఖము ననుభవించిరని చెప్పవచ్చును.

*Copies can be had of :—*

K. B. SUBBARAYUDU, B. A., B. Ed.,

PODAGATLAPALLI,

GOPALAPURAM POST,

Razole Taluk,

East Godavari Dt.